# హిందూ ధర్మం

- నములకంటి జగన్నాథమ్



mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in

# మంగళాశాసనము

ప్రపంచంలో ఎన్నో మతాలు వెలిసి ఏ మతాని కామతం అన్నిటికంటే తానే గొప్పదని అనిపించుకోటానికి విశ్వప్రయత్నం చేస్తున్న రోజు లివి. కేవలం ఆ మతమే నిజం, దాన్ని అనుసరించని వారికి ముక్తి కలుగనే కలుగదని అయా మత ప్రచారకులు ప్రచారం చేస్తున్నారు. హిందూ మతమని ఒకటి ఉందని దాని సిద్ధాంతా లనబడేవి పరస్పర విరుద్ధంగా ఉన్నాయనీ, అది మూఢ నమ్మకాల మూట అని, ఆ మూఢ నమ్మకాలను ఎంత తొందరగా వదిలితే అంత మంచిదనీ అనే వాళ్ళనుగూడా చూస్తున్నాము.

ఇస్లాం మతానికి ప్రవక్త మహమ్మదు. అలానే క్రిస్టియన్ మతానికి ప్రవక్త జీసస్ క్రైస్తు. ఇలానే హిందూ మతానికి ప్రవక్త ఎవరు ? అసలు హిందూ మతమనే పేరుగల మతం ఒకటి ఉన్నదా? ఉంటే దాన్ని ప్రవచించింది ఎవరు? ఈ సమస్యలు బుద్ధిమంతుల్ని కలవర పెడుతున్నాయి. భారతదేశం పర పరిపాలనకు బానిస అయినప్పటినుంచే ఈ సమస్యలు తలయెత్తినట్లు కనబడుతున్నది.

నిజానికి మన దేశంలో హిందూ మతమనే పేరుతో ఒక మతాన్ని కల్పించినవారు పరదేశీయులే. మన దేశంలో అనాదినుంచీ సమాజ వ్యవహారాని కంతటికీ సర్వోత్కృష్టమైనది ధర్మము. ప్రజల నడవడిక, మహారాజుల, చక్రవర్తుల పరిపాలన, వ్యాపార వ్యవహారాలు, అన్నిటికీ ధర్మమే మూల స్రోతస్సుగా ఉండేది. ఆ ధర్మాన్ని దివ్వెపట్టి చూపినవి వేదాలు. అందుకే ధర్మానికి వైదిక ధర్మమనే ప్రతిష్ఠ కలిగింది. ఈ వేదాలను ఉపబృంహణం చేసి ప్రజాబాహుళ్యానికి ధర్మసూక్ష్మము తీరుతెన్నులను తేటతెల్లం చేసినవి వేదాంగాలూ, ఉపవేదాలూ, పురాణాలూ మొదలైన విద్యలు పద్దెనిమిది.

అఙ్గాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతా శ్చతుర్దశ
ఆయుర్వేదో ధనుర్వేదో గాంధర్వశ్చైవ తే త్రయః
అర్థశాస్త్రం చతుర్థం చ విద్యాన్యష్టాదశైవ తాః

—విష్ణు పురాణము 3-7-27,28.

ఈ విద్యలను తరిచి ఏమార్గాన నడిస్తే ప్రజా బాహుళ్యం శ్రేయః ప్రాప్తిని పొంది భవబంధాలనుండి ముక్తులౌతారో తెలియజేయటానికి కొందరు ఉత్తమ జ్ఞానులు ప్రయత్నించారు. శ్రీ శంకరులు, రామానుజులు, పూర్ణ ప్రజ్ఞులు, భాస్కర, వల్లభ, చైతన్యాదులు ఈ కోవలోవారు,

ఈ విధంగా భారత దేశము బృహత్తరమైన వైదిక ధర్మాన్ని అనుసరించటం చేతనే తరువాత తరువాత ఎన్ని మతాలు పొడచూపినా అవన్నీ దివ్య జ్యోతి అయిన భాస్కరునిముందు చిరుదీపాలవలె ఉండిపోయినవి. ఏ పేరుతో ఏమతం వచ్చినా ఆయా సిద్ధాంతాలన్నీ వైదిక ధర్మంలోనే ఉండటంచేత భారతీయుల కవి కొత్త చేయలేదు.

ఈ బృహద్ధర్మ తత్వాన్ని చక్కగా ఆకలించుకొని శ్రీ ఎన్. జగన్నాథం ఎం.ఎల్.ఏ., గారు "హిందూ ధర్మం"అనే ఈ మంచి పుస్తకాన్ని తేటతెల్లమైన తెలుగులో ప్రజా సామాన్యానికి అందజేస్తున్నారు. "కొండ అద్దమందు కొంచమై యుండదా" అన్న వేమన్న సూక్తిని ఈ 'హిందూ ధర్మం' తలపింప జేసింది. 10 అశ్వాసాలుగల ఈ చిన్న పుస్తకంలో ఆయన వేదాలనుంచి మననాటి వరకు అవిచ్ఛిన్నంగా వస్తున్న ధర్మస్రోతస్వినిని ఉపనదులు, కాలువలు, పిల్లకాలువలతో సహా వర్ణించి చూపారు. వ్రాసినంతవరకు ఎక్కడా సంప్రదాయానికి దూరం కాకుండా, కావలసినది వదలిపెట్టకుండా, అక్కరలేని విషయాలు చెప్పకుండా సూక్ష్మంలో మోక్షమన్నట్లు ఈ చిన్న పుస్తకం పరిధిలో భారత ధర్మ వ్యవస్థను అందరికీ కరతలామలకం చేశారు.

అనుషంగింకగా భారతీయుల ముఖ్య విధులైన అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనేవాటిని అనుభవ ప్రమాణ

కంగా వివరించారు. శాస్త్రీయంగా చర్చించి అస్పృశ్యత అనే దురాచారాన్ని అర్థరహిత మైందిగా నిరూపించారు. ఏకాలంలో ఏ ఆచారాలెట్లా ఉన్నా మన కాలంలో వాటి వైతథ్యాన్ని తెలుసుకున్నాక మనం చేయవలసిం దేమిటి? 'ఉద్ధరే దాత్మనాత్మానం' అనికదా గీతాచార్యుని ఉపదేశము! నడవడిని తీర్చి దిద్దుకొని నవ సమాజాన్ని సమ సమాజంగా హృష్టపుష్టం చెయ్యవలసిన బాధ్యత మన అందరి మీదా ఉన్నది అని హెచ్చరిక చేశారు గ్రంథకర్త. ఏ మతాలు ఏ ప్రలోభాలు చూపినా మన ధర్మాన్ని మనం విడనాడకుండా ఉండవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు. కర్మ సిద్ధాంతము, పునర్జన్మ, అష్టవిధ వివాహములు, విగ్రహారాధన మున్నగు వివిధ విషయాలు నిశితంగా చర్చించబడినవి.

ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః త్రేతాయాం ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవం.

—విష్ణుపురాణం 6-౩-17

"కృతయుగంలో ధ్యానం చేసి, త్రేతాయుగంలో గొప్ప గొప్ప యజ్ఞాలు చేసి, ద్వాపర యుగంలో అర్చన చేసి సాధించినంత ఫలితాన్ని కలియుగంలో దైవ కీర్తనం చేసినంత మాత్రంచేతనే జనులు పొంద గలుగుతారు.'' ఈ మాటలు వేదవ్యాసుడు కలి రాబోతున్న సమయంలో మహర్షులకు చెప్పాడు.

'స్వల్పేన హి ప్రయత్నేన ధర్మ స్సిద్ధ్యతి వై కలౌ'

అనగా'కలియుగంలో స్వల్ప ప్రయత్నం చేతనే ధర్మం సిద్ధిస్తుంది' అని వ్యాస మహర్షి కలియుగాన్ని ప్రశంసించాడు. అందువల్లనే ఇప్పుడు విదేశాలలో కూడా 'హరే రామ హరే కృష్ణ' భక్త సమాజాలు ప్రజాదరణ పొందుతున్నాయి.

'హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
ఇతి షోడశకం నామ్నాం కలి కల్మషనాశనం.
నాతః పరతరోపాయః సర్వవేదేషు దృశ్యతే'

అనే కలి సంతారణోపనిషత్తు మనకు సులభంగా భవ బంధ విమోచన మార్గాన్ని సూచిస్తున్నది. ఈ ప్రబోధంతో 'హిందూ ధర్మ' మనే ఈ గ్రంథం

ముగించటం ఎంతో సమంజసంగా ఉంది. శ్రీ జగన్నాధంగారి చిత్తశుద్ధికి ఇది నిదర్శనం.

శ్రీ జగన్నాధంగారు రాజకీయాల్లో మునిగి తేలుతున్నా ఇటువంటి ఉత్తమ గ్రంథాలు ఇప్పటికే ఎన్నో వ్రాశారు. 'హిందూ ధర్మం' అనే ఈ గ్రంథం వారి ఆధ్యాత్మిక విద్యా పారమ్యాన్ని అద్దంపట్టి చూపిస్తున్నది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే ఈ గ్రంథం —

"As inevitable as tomorrow
As vital as next heart-beat"

అనే నానుడికి నాందీ గీతం పలుకుతున్నది.

సంకల్పబలం ఉంటే స్వయంకృషివల్ల ఏ వ్యక్తియైనా మెట్టుపై మెట్టు ఎక్కిరాగలడని దృఢ విశ్వాసం గల మా జగన్నాథంగారికి ఇదే నా హార్దిక మంగళాశాసనము.

హైద్రాబాద్
5-9-1975

ఎన్. సి. ఎస్. పార్థసారధి,
శతావధాని.

# రచయిత వినతి

హింధూధర్మమును గూర్చిన సమాచారమును తెలుసుకొనుట ఒక హిందువులకేగాక, అన్యమతస్థులకు కూడా అవసరమే. మనము లేదన్నా కాదన్నా మతము మనలో జీర్ణించిపోయింది. మనుజునకు మతము అవసరమా కాదా ? అను వివాదముతో మనకు ప్రమేయంలేకుండా మతమువలన మంచిజరిగితే దానిని తప్పక స్వీకరించవలసిందే. మనుజుడు మతోన్మాది కాకూడదను విషయమును యెవరు కాదనకూడదు-మతమును, దాని ప్రభావమును మనుజుడు వదులుకోలేడేమోననిపిస్తుంది. మనకు పేరులో మతము, బట్టకట్టులో-బొట్టు పెట్టుటలో మతము, గుళ్లగోపురాలు దర్శించి పూజించుటలో మతము, మనము విశ్వసించే దేవుళ్లలో మతము, పుట్టుకలో చావులో పెండ్లిపేరంటాలు సాగించుటలో మతము, భాషలో వేషములో మతము కనిపిస్తుంది. కాబట్టి మతమును మనుజులు అంత తొందరగా వదలలేరు.

కాబట్టి మనము పరమతము స్వమతములను తారతమ్యములు వదలి అన్ని మతములలోగల మంచిని స్వీకరిస్తే తప్పులేదు. మతములనుగూర్చి తెలుసుకొనుటలో ముప్పులేదు.

కాబట్టి హిందువులలో చాలాభాగము ప్రజలకు హిందూధర్మమును గూర్చిన పరిచయములేదు. అందుకే నేను కొన్ని గ్రంథములను పరిశీలించి ఓపినకొలది సమాచారములను సేకరించి ఈ గ్రంథమునకు సరిపడే విషయాలను సమకూర్చాను. ఈ పుస్తకమును మతప్రచార దృష్టితోగాక సమాజ అసమానతలు—అంటరానితనము తొలగించుదృష్టితోనూ, మరియు ఈ మతమునకు జెందిన సమాచారమునుగూర్చి తెలియజేయు ఉద్దేశముతోనూ ఏర్చి కూర్చి రచించాను. పొరపాటులుంటే క్షంతవ్యుడను.

ఇట్లు

నములకంటి జగన్నాథము

# అనుక్రమణిక

శ్రీ ర స్తు

# హిందూ ధర్మము

## ప్రథమాశ్వాసము



ఈ చరాచర దృశ్య ప్రపంచము అసంఖ్యాకములగు ప్రాణులచే నిండియున్నదనియు, దీనిలోగల ప్రతిప్రాణియు జనన మరణములకు గురియౌతుంటుందనియు బాలులు సహితము సునాయాసముగా దెలుసుకొనదగిన ప్రత్యక్ష ప్రమాణమైయున్నది. సజీవ ప్రాణులన్నియు మృత్యువునుండి తప్పించుకొనుటకు ప్రయత్నములు జేయుచుండును. సుఖ సంతోష సముపార్జనకై నటు నిటు దిరుగాడుచుండును. ప్రాణికోటిచే జరుగు ప్రతి కదలిక సుఖాన్వేషణకే ననునది నిర్వివాదాంశము. కావున ఈ విశ్వాంతరాళమునగల ప్రాణులు యే వస్తువు వలన జనించినవను ప్రశ్న మనలో నుదయించును. ఇట్టి జంగమ స్థావర జీవజాలమునకు నుత్పత్తి కారకమగు శక్తి యొకటి యుండియుండవచ్చునని ఊహామాత్రమున జ్ఞానలేశము గలవారుగూడ నిర్ణయించుకొన గల్గుదురు. అట్టి మహాశక్తినే విజ్ఞులు ఆదిశక్తి యనియు, పరాశక్తియనియు, పరమేశ్వరుడనియు వేదాదిగ్రంథ ప్రమాణముల ననుసరించి తెలుపుదురు. ఈ పరాశక్తి మూలముననే సమస్త జీవజాలము లుదయించి, స్థితినంది, నశించుచున్నట్లు వేదములు దెలుపుచున్నవి. పరమేశ్వరునకును ననేక సహస్ర నామములు గలవు. ఇట్టి సర్వశక్తివంతుడగు పరమేశ్వరుడు దేనివలన నుద్భవించినాడను ప్రశ్న మనలో స్ఫురించకపోదు. దానికి సమాధానముగా, ఆది గ్రంథములన్నియు పరమేశ్వరుడు "స్వయంభూః" అని (తనకై తానే యావిర్భవించినవాడనియు) తెలుపుచుండును. కావున పరమేశ్వరుని కంటె ముందెట్టి ఇతరశక్తియు లేదనునది సుస్పష్టమైన విషయము. ఈ శక్తియొక్క రూపభేదములను గూర్చి హిందూమతములో దెలుపబడినట్లు మరే మతములో దెలుపబడలేదు. హిందువు లీ పరాశక్తి ననేక సహస్రనామములతో బిలుచుటే గాక పలువిధముల నుపాసింతురు. పరమేశ్వర, పరబ్రహ్మ, పరమాత్మ నామములతో సంస్మరింతురు.

క్రైస్తవ, మహమ్మదీయ మతములకు ఏసు, మహమ్మదు మొదలగు మతకర్త లుండినట్లు హిందూమతమునకు సృజన కారకులగు మతకర్త లెవరును లేరను విషయము సర్వజనవేద్యము. ఈ మతమును సృష్టించి, ప్రచారముజేసి, వ్యాప్తిలోకి దెచ్చి, ఈ మతమే శ్రేష్ఠమైనదిగాన దీనినే మీరందర వలంబింపుడని యన్యులను బలవంత పెట్టిన యుదంతములు హిందూమతమం దెచ్చటను గాన రావు. అంతేగాక యొకానొకరిచే హిందూమతము సృష్టింపబడినదని నిష్కర్షగా జెప్పుటకు వీలులేదు. ఐతే మరి యీమత మెట్లు జనించినదను వాదమున కాస్కార మేర్పడును.

ఆదిలో వేదవిహిత ధర్మములు మహర్షులచే ప్రచారములు జేయబడెను. ఆ వేదాంశముల ప్రచార సారమే హిందూమత వ్యాపకమునకు మూలకారణము. ఈ వేద ధర్మములను మత బోధనా ప్రాతిపదికపై మహర్షులు ప్రచారము జరిపి యుండలేదు. వారు వేదములను సర్వమానవ కల్యాణార్థమై ప్రవచించి యుండిరి. సర్వజన శ్రేయోమార్గ ప్రచారమే క్రమేపి మతముక్రింద గణింపబడియెను. అన్యమతములు వ్యాప్తిలోకి వచ్చిన తర్వాత దీనికి హిందూమత మని పేరు గలిగెను. వేదధర్మాచరణ సమాజమునకు యిట్టి నామాంతరీకరణ జరిగినదే కాని, వేద వేదాంతాది గ్రంథములలో హిందువుల కొరక మతమున్నట్లు తెలుపబడి యుండలేదు. ఇపు డిచట మనకొక విషమ ప్రశ్న ముదయించును. అదేమన? ఈ వేదములు ఋషుల కెక్కడినుండి లభించినవి? మరి వాటి నెవరు లిఖించిరనుచు ప్రతివారును ప్రశ్నించవచ్చును.

సృష్టికర్తయగు బ్రహ్మ వేదములను అనాది సిద్ధుడైన పరమేశ్వరునిచే ధ్వని రూపమున తన హృదయాంతరాళమున ప్రతిధ్వనింపగ శ్రద్ధగా ఆలకించి మహర్షి వర్గమున కుపదేశించెనని పెద్దలు వక్కాణింతురు. ఐతే మనము హిందూ మతమునకు మూలపురుషుడు బ్రహ్మదేవుడేనని యనుకొనవలసివచ్చును. అంతేగాక దీనిని మతమను పేరుతో బిలువక, సమస్త విశ్వమానవ సమాజమునకు అహింస, సత్యము, అస్తేయము. బ్రహ్మచర్యము, అపరిగ్రహము, దయ, శౌచ, ఆత్మ సంయమము లనబడు ధర్మమార్గములను ప్రబోధించు పవిత్ర విశ్వజనీన ధర్మబోధక సమాజ సిద్ధాంతవాదమని యనినచో సమంజసముగా యుంటుందని విబుధు లభిప్రాయ పడుచుందురు. ఇది సదాచార సహితమైన

దియు, ఆర్యజన సమ్మతమైన సిద్ధాంతమనియు మనకు పెద్ద లుద్బోధించు చుందురు.

ఆర్యు డనగా పూజ్యుడనియు, వేదవిహిత ధర్మములను నియతి దప్పక నాచరించువాడనియు అర్థము, "ఆరాత్ పాపకర్మభ్యో యతీత్యార్యః" అనువాక్యము ననుసరించి పాపకర్మములకు దూరముగా నుండువాడనియు, "అరణీయ అభిగమ్యోవా ఆర్యః" పూజ్యుడై నందున అందరిచేత సేవింపదగిన వాడని అర్థము. మరియు

"హీనం చ దూషయత్యేవం హిందు రిత్యుచ్యతే బుధైః" అని మేరు తంత్రములో దెలుపబడియున్నది. అహింసా పరుడును, నీచకర్మలను దూషించి (వదిలి) సత్కర్మల నాచరించువాడు హిందువుడని పై శ్లోకమునకు తాత్పర్యము. గావున ప్రప్రథమములో హిందువుల మూలదైవమును, వారి మూలగ్రంథములను గూర్చి వివరణాత్మకముగా దెలుసుకొనుట ముఖ్యము.

## -: జగత్సృష్టినిగూర్చి హిందువుల యభిప్రాయము :-

ఆదిలో గుర్తింపరాని వస్తువేదియులేక, సమస్తము శూన్యము, అలక్షణము, అయోమయ (చీకటి) మైనదియై యున్న తరుణమున యొక మహచ్ఛక్తి తనకు తానే యావిర్భవించగలిగినది. ఇట్టి శక్తినే పరమేశ్వరుడని మన పూర్వులు ప్రస్తుతించిరనుచు గ్రంథాదిలోనే వివరించడమైనది.

"ఆదిజుడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాడు వే
దాది సమస్త వాఙ్మయములందు ప్రశంసితుడైనవాడు"

అని మహనీయు లభివర్ణించిరి. ఇట్టి శక్తి యావిర్భవించి "నేనొకడనే యున్నాను. నాకు తోడెవరు లేరుగదా" యని యనుకొనుచుండ సంకల్ప మాత్రముననే యా మహాశక్తిలోనుండి ఇచ్ఛాశక్తి యను మూలప్రకృతి ప్రాదుర్భవించి "స్వామీ ! మీ రీ ఏకాంతమును భరించలేరుగాన తమ లీలా వినోదమునకు సమస్త జీవజాలమును నాలోనుండి బుట్టించెదను. నాకు మరికొన్ని దివ్య శక్తులను ప్రసాదించు"దని యా దేవదేవుని ప్రార్థింప

నతడు మరొక మూడు శక్తుల నా యిచ్ఛాశక్తి కప్పగించిన, ఆ మూల ప్రకృతి పరమేశ్వర ప్రసాదితమగు త్రిశక్తులకు జననస్థానమై వెలయగలిగెను. ఆ త్రిశక్తులనే త్రిగుణములని యనుట కలదు. త్రిగుణములనగా సత్వగుణము, రజోగుణము, తమోగుణములని విజ్ఞుల యభిప్రాయము. "సత్వ రజ స్తమో యితి గుణాః ప్రకృతి సంభవాః" యనునది ఉపనిషద్వాక్యమై యున్నది, ఇట్టి త్రిగుణాత్మకమైన మౌలిక జగత్తుకు దృశ్య ప్రపంచములగు పంచభూతము లుదయించగలిగెను. వాటి యుత్పత్తి క్రమము నిట్లు జెప్పుదురు "ఆకాశా ద్వాయుః వాయో రగ్ని రగ్నే రాప అద్భ్యః పృథివీ, తేషాం పంచభూతానాం (యోగచూడామణ్యుపనిషద్)

అనగా పంచభూతముల వివరము వాటి యుత్పత్తి యిట్లు దెలుపబడియున్నది. పంచభూతము లనగా ఆకాశము - వాయువు - అగ్ని - జలము - భూమి.

ఆకాశములోనుండి వాయు వుదయించెను. వాయువునుండి అగ్నిబుట్టెను. అగ్నినుండి జల ముత్పన్నమయ్యెను. జలమునుండి పృథ్వి జనించెనని పై సూచించిన సూత్రమునకు తాత్పర్యము.అట్టియనంత శక్తిమయుని సంకల్పమాత్రమున జనించిన మూల ప్రకృతియే జీవశక్తిప్రదమైన పరమేశ్వరుని మాయయనియు (చిదాభాసమనియు) తెలుపబడుచున్నది. పంచభూత మిశ్రితమైన దృశ్య ప్రకృతిని భౌతిక తత్త్వమనియు, పరమేశ్వరుని మౌలిక చిదాభాసమగు జీవశక్తిని చిత్‌శక్తి యనియు లేక ప్రాణమనియు చెప్పుదురు. ప్రకృతిజన్యమైన త్రిగుణములను, వాటి సమ్మేళనమున నావిర్భూతమైన సూర్య, చంద్ర, తమో సంచయములును దృశ్య జగత్తునకు ప్రాతిపదికలు. మన కనుల కగపడు దృశ్య జగత్తంతయు నొకరోజు నశించును. "యద్దృశ్యం తన్నశ్యతే"యను నార్యోక్తికి ననుగుణ్యముగా యీ కనబడునదంతయు నొకనాడు నశించిపోవును.

అంతేగాక యీ త్రిగుణములకు ప్రతినిధులుగా త్రికాలజ్ఞులగు త్రిమూర్తు లుదయించిరి. వీరినే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని యందురు. వీరికి తోడుగా ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తు లనబడు త్రిశక్తు లుదయించినవి, వీటినే లక్ష్మి, సరస్వతీ, పార్వతీదేవు లనియు వీరు పైన సూచించిన త్రిమూర్తులకు భార్యలనియు జెప్పుట కలదు.వీరికి వాసయోగ్యములగు లోకములు వైకుంఠము-సత్యలోకము - కైలాసము లనియు సృష్ట్యాది లోకములనగా నివియే యనియు

పెద్దలు జెప్పుట కలదు. త్రిమూర్తులగు బ్రహ్మ - విష్ణు - మహేశ్వరు లీ సృష్టి కర్తలు. బ్రహ్మ చరాచర జగత్తును సృష్టించువాడు, విష్ణువు పాలించువాడు, మహేశ్వరుడు నంతమొందించువాడునై యున్నారు. ఇట్టి బ్రహ్మ సృష్టికి హేతుభూతమైన పదార్థములు పృథివీవాయురాకాశాగ్ని జలంబులు. ఈ పంచభూత మిశ్రమములచే జంగమ స్థావర శరీరము లేర్పడినవి. పైన సూచించిన పంచభూతములు తమలో నుండి యర్థ భాగమును వేరు జేసుకొని మిగిలిన యర్థ భాగమును ఐదుగా విభజింప ఐదైదులు యిరువదియైదై యట్టి యిరువది యైదు తత్త్వములతో నిరువది యారవ తత్త్వమగు పరబ్రహ్మ చిదాభాసము గలియుటచే జీవుడై, అపుడది ఆత్మ తత్త్వముచే గూడిన దేహమై ప్రకాశించినదని వేదాంతముల నిర్ణయమై యున్నది.

ప్రతి స్థూలశరీరములో పంచభూతాత్మకమైన ప్రకృతి విశేషము మన కవగత మగుచుండుటచే నిట్టి వాద మత్యంత విశ్వాసయోగ్యమైనదిగా గన్పట్టుచున్నది. అంతేగాక జంగమ స్థావర జీవ శ్రేణు లనబడువాటిని ఎనుబది నాల్గు లక్షలుగా విభజించి చెప్పుట కలదు.

శ్లో॥ స్థావరో లక్షవింశత్తి జలజో నవ లక్షకః
క్రిమిణాం రుద్ర సంఖ్యశ్చ చాతుర్లక్షంతు మానుషః
త్రింశల్లక్షం గజాశ్వాణాం పక్షిణాం దశలక్షకమ్......]

జంగమము లనగా నడచునవియు, స్థావరములనగా యచ్చోటనే బుట్టి యచ్చోటనే నశించునవని యర్థము. పైన జెప్పిన శ్లోకము ననుసరించి స్థావరములగు చెట్లు గుట్టలు మొదలైనవి యిరువది లక్షలు. నీటిలో బుట్టినవి తొమ్మిది లక్షలు. క్రిమి కీటకాదులు పదునొకండు లక్షలు. మనుష్యజాతి నాల్గు లక్షలు. చతుష్పాద జంతువులగు గజాశ్వములు మున్నగునవి ముప్పది లక్షలు. ఆకాశమున సంచరించు పక్ష్యాదులు పది లక్షలు. వీటి యన్నిటి మొత్తము ఎనుబది నాల్గు లక్షలని జెప్పుదురు.

ఇట్టి జీవ సృష్టిలో ననేక యోనుల యందు దేహి పుట్టుచు గిట్టుచు ఒక దేహము నుండి మరొక దేహమునకు మార్పుజెందుచు కర్మఫలానుభవమున తుదకు మానవ జన్మము దాల్చునని మన పూర్వజుల యభిప్రాయము. మానవు

లలో త్రిగుణాత్మకములైన జన్మలుండును. గుణ విభాగములు జేసిచూడ కొందరు సత్త్వగుణులు, మరి కొందరు రజోగుణులు, కొందరు తమోగుణము గలవారునై యుందురు. మనుజులు జాగ్రత్-స్వప్న-సుషుప్తి యను నవస్థాత్రయములు గలిగియుందురు. ఇవి త్రిగుణములమూలమున సంభవించుచుండును. త్రిగుణాత్మకవ్యావృత్తిచే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము లనెడు అంతఃకరణములకులోనై మనుజులు సత్కర్మలు-దుష్కర్మలు జేయుచుందురు. ఇట్టి గుణ కర్మ స్వభావములచే సుఖ దుఃఖములు పుణ్య పాపములు పొందుదురు. ఉత్తమ కర్మలచే ఉత్తమ దశలును, నీచకర్మలచే నీచ దశలును గలుగును. ఇట్టి మాయా మోహితమగు జగత్తును, మిథ్య యని తలచి, మూలపురుషుడైన పరమేశ్వరుని భక్తితో నుపాసించి, అంతఃకరణములచే విశ్వసించి యా యనంత శక్తిమయునిలో లీనమొందుటయే మోక్షమని-ముక్తి యని తెలుపబడి యున్నది.

## ఆది దేవుడగు మూలపురుషుని గూర్చి హిందువుల విశ్వాసము

జగదాధారుడైన యీశ్వరుని "ఓం"కారమయ స్వరూపుడని ప్రప్రథమములో యీ మతవాదులు నుచ్చరించి స్మరించుట కలదు. "ఓం"యను శబ్దమును ప్రణవాక్షర మని యందురు. ప్రణవ మనగా పరబ్రహ్మమగు ఆది దేవుడు. ఈ ఓంకారము మూడక్షరముల సమ్మేళనముచే గలిగినది. ఒకటి "అ" రెండవది "ఉ" మూడవది "మ" ఇట్టి అ-ఉ-మ-లు గలిపి యేకంగా నుచ్చరించిన పక్షమున "ఓం" యను ధ్వనిని గలిగిస్తుంది.

*దీనికి ప్రమాణము :*

"తస్య వాచకః ప్రణవః"—[ఓంకారమే యాతని నామధేయము.] మనస్సున గల్గు ప్రతిభావమునకును ప్రతిరూప మనదగు పదమొకటి గలదు. పదమును అర్థమును అవిభాజ్యమై యుండును. ఒకే విషయము యొక్క బాహ్య రూపమును పదమనియు, అంతర్భాగమును అర్థమనియు జెప్పుచున్నారు. అర్థము నుండి పదము నెవ్వడును వేరుపరుప జాలడు. కొందరు జను లొక చోట గూర్చుండి పదములను నిర్ణయించుటవలన భాష నిర్మింపబడినదను సిద్ధాం-

తము హేతు విరుద్ధమని నిశ్చయింపబడి యున్నది. సృష్టిలో మనుష్యులున్నంత వరకు మాటలును భాషయు నుండియే యున్నవి. అర్థమునకును పదమునకును గల సంబంధ మేమి ? భావము ననుసరించి పదము లేర్పడినవని మనమూహించినను ఒకానొక భావమును దెలుపుట కొకానొక మాటయే కావలయునను నియమము లేదు. ఒకే భావమును దెలుపుట కిరువది దేశములలో నిరువది వేరు వేరు భాషలుండ వచ్చును. ఒక్కొక్క భావమును దెలుపుటకై మనకొక్కొక్క భాష శబ్దము లుండ నక్కర లేదు. వివిధ దేశములందు శబ్దములు వివిధములై యుండును. "భావమునకును పదమునకును సంపూర్ణముగా స్వాభావికమగు సంబంధమున్నను ఒకానొక భావమునకును ఒకానొక శబ్దమునకును అవినాభావ సంబంధముండవలయునని యూహింపరాదు." అని వ్యాఖ్యానకారులు జెప్పుచున్నారు. శబ్దములు వేరువేరై యున్నను శబ్దములకును భావములకును సహజ సంబంధ మేర్పడి యున్నది. సంజ్ఞకును దానిచే దెలుపబడు వస్తువు లేక విషయమునకును సరియగు సంబంధముండిననే గాని శబ్దములకును భావములకును సమంజసమగు సంబంధ మేర్పడ నేరదు. అంతవరకును నా సంజ్ఞ వాడుకలోనికి రాజాలదు. సంజ్ఞ యనగా నిర్దేశింపబడిన వస్తువు లేక విషయమును దెలుపు నట్టి పదము. నిర్దిష్ట వస్తువున కిదివరకే ఒక సంజ్ఞ యేర్పడి యున్న యెడల, మరియు ఆ వస్తు వా సంజ్ఞచే అనేక పర్యాయములు వెల్లడింపబడుచున్నదని అనుభవ పూర్వకముగా మనకు తెల్సిన యెడల ఆ రెంటికి అన్యోన్య సంబంధము గలదని మనము నిశ్చయింప వచ్చును. వస్తువులు తమ యెదుట లేకున్నను వానిని గ్రహించునట్టి వారు వేలకొలది జనులుందురు, సంజ్ఞకును దానిచే నిర్దిష్టమగు వస్తువునకును స్వాభావికమైన సంబంధముండవలయును. అప్పుడు సంజ్ఞ నుచ్చరించి నంతనే నిర్దిష్ట వస్తువు నది మనకు స్ఫురింప జేయును. అటులనే "ఓం"కారము భగవంతుని తెలుపు సంజ్ఞ యని జెప్పుచుందురు. "భగవంతుడు" అను నట్టి భావమును వందల కొలది పదములతో సంబంధించి యున్నది. వీనిలో ప్రతి పదమును భగవంతున కొక సంజ్ఞయై యున్నది. కాని యీ సంజ్ఞ లన్నిటిని సమీకరించుచు వీనికి మూలాధారమగు సంజ్ఞ యొకటి యున్న యెడల, అట్టి సంజ్ఞ వీని భావము లన్నిటిని దెలుపుచుండుటచే ఉత్తమోత్తమ సంజ్ఞ యగును. శబ్దోచ్చారణము నందు మనము కంఠము నందలి స్వరపేటికను, అంగిలిని, శబ్దఫలకముగ నుపయోగించుచున్నాము. ఏ శబ్దము నుండి తదితర శబ్దము లన్నియు వ్యక్తమగు చున్నవో

అత్యంత స్వాభావికమైన అట్టి శబ్ద మేదియైన యొకటి గలదా ? అనిన, సర్వ శబ్దములకును మూలమగు ప్రణవము లేక "ఓం"కార మట్టి శబ్దమని మనము జెప్పవలసి యుండును.

ఇందు మొదటి భాగమగు "అ" కారము నాలుకయొక్కగాని, అంగిలి యొక్కగాని యే భాగమువలనను నుచ్చరింపబడనిదై ఓంకారమునకు బీజమై యున్నది. "మ" కారము కడపటిదై మూయబడిన పెదవులచే నుచ్చరింపబడు చున్నది. "ఉ" కారము నోటియందలి శబ్దోచ్చారణ ఫలకమున మూలభాగము నుండి అంత్యభాగము వరకును దొరలుచున్నది. ఇట్లు ఓంకారము శబ్దోచ్చారణ ప్రక్రియనంతను జూపుచున్నది. కావున నిదియే శబ్దము లన్నింటికిని మూల మగు స్వాభావిక సంజ్ఞయై యుండవలయును సమస్త శబ్దజాలమును ఓంకారము నందిమిడియున్నది. మరియు భారతదేశమునందలి వివిధ మతాభిప్రాయము లన్నియు ఓంకారముపై నాధారపడియున్నవి. మరి యే యితర దేశీయులుకాని దీనివలన గ్రహింపవలసిన దేమన భారతదేశమున నెప్పుడెప్పుడు మతాభివృద్ధి కలిగినను ఓంకారము ప్రధానముగా పరిగణింపబడుటయేగాక భగవంతుని గూర్చిన సాకార నిరాకార భావములన్నియు ఓంకారము మూలముననే అన్వ యింపబడుచు వచ్చినవి. వేదములందలి వివిధాశయము లన్నిటికిని ఓంకారమే పట్టుకొమ్మ. అద్వైతులును, ద్వైతులును, విశిష్టాద్వైతులును శైవ శాక్తేయాది స్వతంత్ర మతస్థులును, తుదకు నాస్తికులునుగూడ ఓంకారమును స్వీకరించి యున్నారు. జనబాహుళ్యమునకు ఓంకారము మతపరమావధిని దెలుపు చిహ్న ముగా నేర్పడియున్నది.

కావున పరమేశ్వరుని మొదటినామము "ఓం"కారమైయున్నది. అట్టి పరబ్రహ్మమునకు అనంతములగు నామములున్నవి. అతనినిగూర్చి వేదాదులలో నిట్లు తెలుపబడియున్నది.

"ఓం హిరణ్య గర్భః సమవర్తతాగ్రే
భూతస్య జాతః పతిరేక ఆసీత్
సదాధార పృథివీం ద్యాముతేమాం
కస్మై దేవాయ హవిషావిధేమ.

(యజుర్వేదం : అధ్యా-౧౩ మంత్రము ౪)

హిరణ్యగర్భుడు- సమవర్తి- అన్ని భూతములకంటె ముందు నుదయించినవాడు. అన్నిటికి నుత్పత్తి కారకుడు నతడే పతియైయున్నాడు. సమస్త జగమున కాధారుడై యున్నాడు. అని భగవంతునిగూర్చి చెప్పబడియున్నది. ఈ యీశ్వర తత్త్వమునుగూర్చి మరింత విపులముగా నిట్లు జెప్పబడియున్నది.

సీ. అట్టిట్టి దనరానిదై మొదలై నిండు
　　కొన్నదై వెలుగుచు గుణములేని
దై యొక్కచందంబుదై కలదై నిర్వి
　　శేషమై క్రియలేక చెప్పరాని
దే రూపమని శ్రుతులెప్పుడు నొడివెడి
　　నారూపమగుచు నధ్యాత్మ దీప
మై బ్రహ్మ రెండవ యర్థంబు తుదిజగం
　　బులు నశింపగ పెద్ద భూతగణము
ఆ. సూక్ష్మ భూతమందు జొరగ నా భూతంబు
ప్రకృతిలోన జొరగ ప్రకృతిబోయి
వ్యక్తమందు జొరగ వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు చెలువ మగుదు.

(ఆంధ్ర భాగవతము-దశమస్కంధము, పూ. భా. ౧౨౬ వ పద్యము)

పైన నుదహరించిన పద్యము జగదాధారుని సృష్టి లయంబులను స్పష్టపరచు నర్థమును సూచించుచున్నది. అట్టి మహత్పరాశక్తిని అట్టిట్టిదని చెప్పుటకు వీలు పడదనియు, అవాఙ్మానసగోచరమనియు, మొదలై - అనగా ఆద్యమైనదనియు, నిండుకొన్నదై - సర్వత్ర వ్యాపకమైనదనియు వెలుగుచు-ప్రకాశమానమైనదనియు, యొక్కచందంబు గలదై-అవ్యయమైనదనియు, (కర్చుకానిది) గుణము లేనిదై - నిర్గుణ నిర్వికారమైనదనియు, ఆధ్యాత్మ రూపములేక పరమాత్మ రూపమగుచు- అన్ని ఆత్మలకు జనన కారణమైనదనియు, వేదముల చేతనే తెలుసుకొన శక్యమైనదనియు, బ్రహ్మ యను సృష్టికర్త యీ శక్తికి ప్రతినిధియనియు. యతని రెండవయర్థంబున బ్రహ్మ ప్రళయమగునని పై పద్యముచే దెలుపబడినది.

## -: బ్రహ్మ ప్రళయ వివరణము :-

సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు నూరేండ్లు నిండినచో బ్రహ్మ రెండవ యర్థమున ప్రవేశించగలడనియు, అదియే బ్రహ్మ ప్రళయమనియు వేదవిదుల యభిప్రాయమైయున్నది.

చతుర్యుగ సహస్రంబులు గడిచిచనిన బ్రహ్మకు ఒక పగలౌతుందట. అట్లే చతుర్యుగ సహస్రంబులు గడిచిన నొకరాత్రి యౌతుంది. ఇట్టి పగలు రాత్రియుగలసి ఒకదినమౌతుందనియు,ఇట్టి దినములు మున్నూటయరవై గడిచిన నొక సంవత్సరమును, ఇట్టి సంవత్సరములు నూఱునిండితే బ్రహ్మకు రెండవ యర్ధము లేక (రెండవ జన్మము) బ్రహ్మప్రళయమని చెప్పబడియున్నది.

ఇక చతుర్యుగము లనగా నేమిటో వాటి సంఖ్యా వివరణములు తెలుసు కొనుట లత్యంతావశ్యకమై యున్నది. యుగములు నాలుగు. వాటి నీ విధముగా దెలుపుదురు.

౧. కృతయుగము, ౨. త్రేతాయుగము, ౩. ద్వాపరయుగము, ౪, కలియుగము.

వీటిసంఖ్య దిగువ నుల్లేఖించటమైనది.

కృతయుగ సంఖ్య :- పదిహేడు లక్షల ఇరువదివేల సంవత్సరములు.

త్రేతాయుగ సంఖ్య :- పన్నెండు లక్షల అరువదితొమ్మిదివేల సంవత్సరములు.

ద్వాపరయుగ సంఖ్య :- ఎనిమిది లక్షల అరువదినాల్గు వేల సంవత్సరములు.

కలియుగ సంఖ్య :- నాల్గులక్షల ముప్పదిరెండువేల సంవత్సరములు.

ఈ మొత్తము నలుపది రెండు లక్షల, ఎనుబదిఐదువేలు.

ఇట్టి నలుబదిరెండు లక్షల ఎనుబదిఐదువేల సంవత్సరములు వెయ్యిసార్లు దిరిగి నచ్చినచో చతుర్యుగ సహస్రము లని యందురు.ఇట్టి చతుర్యుగ సహస్రములు బ్రహ్మదేవునకు ఒక పగలౌతుంది. అటులనే మరొక చతుర్యుగ సహ

స్రంబుల కొకరాత్రి యౌతుంది. ఇప్పుడు బ్రహ్మదేవునకు ఒకదినము నిండినట్లు లెక్క. ఇట్టి దినములే మున్నూటయరువదియైతే ఒక సంవత్సరము. మరియు నిట్టి సంవత్సరములు నూరు నిండితే ఒక బ్రహ్మ యర్ధము- అనగా బ్రహ్మప్రళయ మని దెలుసుకొనవలసి యున్నది.

## :- ప్రళయ ప్రకారము :-

పైన గనుపరచిన భాగవత పద్యము నాధారముగా గైకొనినచో ప్రళయమునందు సమస్త భూతములు (పంచ భూతములు) నశించి సూక్ష్మభూతమగు ప్రకృతిలో ప్రవేశింపగా ప్రకృతిబోయి వ్యక్తమందు (పరాశక్తి) లో నైక్యము జెందగా యట్టి వ్యక్తమే మిగిలి సమస్తము శూన్యమై పోవుటచే ప్రళయమని తెలుపబడియున్నది. ప్రళయముఈ పంచభూతములు ఒకదానిలో ఒకటి లయించిపోయి ప్రకృతిలో గలసిపోవునని జెప్పుదురు. భూమి నీటిలోగలిసి, నీరు అగ్నిచే దహించిపోయి, అగ్ని వాయువుచే హృతమై, వాయువు నాకాశములో యణగారి,యాకాశము మూలప్రకృతిలో గలసి అది పరబ్రహ్మైక్య సంధానమందునని తెలుపబడియున్నది. ఇట్టి ప్రళయములు వచ్చుచు పోవుచుండునని హిందూ ధర్మానుయాయుల విశ్వాసము. వీటిమధ్య సృష్టిజరిగి, స్థితినంది తుదకు లయమై పోవుచుండు ననుటలు సువిదితమైన విషయములు.

## -: హిందువుల ముఖ్య గ్రంథములు :-

పరబ్రహ్మ స్వరూపుడైన యాదిదేవునకు బ్రహ్మాది దేవతలు జనించిరని ముందే తెలుపబడియున్నది. ఈ దేవతలలో బ్రహ్మదేవుడు వేదములకు అధిదేవత. ఇతడు వేదములను పరబ్రహ్మముచే విని ప్రవచించెను. దీనిని ఋషులు విని విభజించిరి. వేదములు అపౌరుషేయములగు మూలగ్రంథములు. వేదములనగా నెవ్వియో మనము దెలుసుకొనవలసి యున్నది.

వేదము "విద్" అను ధాతువుచేత పేర్కొ-న బడుచున్నది. ఈ వేదమును "శృతిః" "అమ్నాయః" యని జెప్పుదురు. "విదంత్యనేనైవ ఇతి వేదః" తెలియజేయునది గావున వేదమని జెప్పబడెను. ఈ వేద శబ్ద నిష్పత్తి-

కర్మకాండ మనగా : ఇహపర సుఖములకు దగిన కర్మానుష్ఠానములను జేయు పద్ధతులును, అశ్వమేధము, వాజపేయము మొదలగు యజ్ఞములను జేయు విధములును నవి జేయుటవలన గలుగు ఫలములను బోధించును.

ఉపాసనకాండ మనగా : పరమేశ్వరుని యందు భక్తిచేయు విధమును, అట్లు భక్తిజేయు వారికి గల్గు ఫలమును బోధించును.

జ్ఞానకాండ మనగా : తత్వజ్ఞానమువలన బ్రహ్మ జ్ఞానమును బొందు మార్గమును అందువలన గలుగు ప్రయోజనమును బోధించును.

మరియు ఈ వేదములు బ్రాహ్మణము లనియును, మంత్రములనియును, ఆరణ్యకము లనియును మూడు విధములుగ నుండును.

బ్రాహ్మణము లనగా : బ్రహ్మజ్ఞాను లనుష్ఠించవలసిన విధులు

మంత్రము లనగా : భగవంతుడు మొదలగు వారిని స్తుతించు స్తోత్రములు. అంతేగాక ఋషులు విన్నవి మంత్రము లనియును ఋషులు దెలిసికొన్నవి బ్రాహ్మణము లనియును కొందరు జెప్పుదురు.

ఆరణ్యకము లనగా : ఋషులు అరణ్యముల యందు భగవంతుని స్తుతించిన భాగములు. ఈ యారణ్యకములు బ్రాహ్మణములకు టీక వంటివి యని కొందరి యాశయము.

ఋగ్వేదములోని బ్రాహ్మణములు (అనుష్ఠానములు) హోతల యొక్క విధులను బోధించును. యజుర్వేదములోని బ్రాహ్మణములు ఉద్గాతల యొక్క విధులను బోధించుచున్నవి. అంతేగాక ఐతరేయ బ్రాహ్మణము, కౌషీతక బ్రాహ్మణము, తైత్తిరీయ బ్రాహ్మణము, శతపథ బ్రాహ్మణము, తాండ్య బ్రాహ్మణము, గోపథ బ్రాహ్మణము అను నీ బ్రాహ్మణములు ఆర్యుల యొక్క ఆదివాచక కావ్యము లనియు కొందరు భావించెదరు. పైన జెప్పిన బ్రాహ్మణము లనగా అనుష్ఠానములు; ఆరణ్యకము లనగా స్తోత్రములు.

ఆదిలో వేదము లన్నియు ఒకేచోట జేర్పబడి మంత్రములు ఆరణ్యకములు ఉపనిషత్తులు మొదలగున వన్నియు సమ్మిశ్రమముగా నుండినందున

అధ్యయనముజేయు వారికి సులభముగా నుండునటుల విష్ణు సన్నిభుడైన వేద వ్యాసుడు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేదములని నాల్గు విభాగములగు నట్లు విభజించెను.

## -: ఈ వేద విభజనకు భాగవత గ్రంథాధారము :-

"ఆది యందు జతుర్ముఖుని హృదయంబున నొక నాదంబుద్భవించె నది వృత్తి నిరోధంబువలన మూర్తీభవించి వ్యక్తంబుగా కనుపట్టె నట్టి నాదోపాసనవలన యోగి జనంబులు నిష్పాపులై ముక్తి నొందుదు రందు నోంకారంబు జనించె నదియె సర్వమంత్రోపనిషన్మూలభూతమగు వేదమాత యని జెప్పంబడు నా యోంకారంబు త్రిగుణాత్మకంబై యకారోకారమకారంబులనెడు త్రివర్గ రూపంబై ప్రకాశించుచుండె నంత భగవంతుడగు నజుం డా ప్రణవంబువలన స్వరస్పర్శాంతస్థోష్మాది లక్షణ లక్షితంబగు నక్షర సమామ్నాయంబు కల్పించి తత్సహాయంబునన్ దన వదన చతుష్టయంబువలన వేద చతుష్టయంబు గలుంగజేసె. నంత నతని పుత్రులగు బ్రహ్మవాదు లా వేదంబులం దదుపదిష్ట ప్రకారంబుగా నభ్యసించి యాక్రమంబున వారలు తమ శిష్యపరంపరలకు నుపదేశించి రిట్లు వేదంబులు సమగ్రంబులుగా ప్రతి యుగంబున మహర్షులచే నభ్యసింపబడియె నట్టి వేదంబుల సమగ్రముగా పఠియింప నశక్తులగు వారలకు సహాయంబు చేయుటకై ద్వాపర యుగాది యందు భగవంతుడు సత్యవతీదేవి యందు పరాశర మహర్షికి సుతుడై యవతరించి యా వేదరాసిని క్రమముగా ఋగ్యజుస్సామాధర్వంబులన నాలుగు విధంబులుగా విభజించి పైల వైశంపాయన జైమిని సుమంతు లనియెడు శిష్యవరులకు గ్రమంబుగా నా వేదంబుల నుపదేశించె నందు బైల మహర్షి చేకొన్న ఋగ్వేదం బనంతంబులగు ఋక్కులతో జేరియుండుటనుజేసి బహ్వృచశాఖ యని చెప్పబడునంత నా పైలుం డింద్రప్రమితికి బాష్కలునకు నుపదేశించె బాష్కలుడా సంహితం జతుర్విధంబులు గావించి శిష్యులగు బోధ్యుండు యాజ్ఞవల్క్యుండు పరాశరుండు అగ్నిమిత్రుండు నను వారికి నుపదేశించె. నింద్రప్రమితి తన సంహిత మాండుకేయున కుపదేశించె మాండుకేయుండు దేవమిత్రుండను వానికిం జెప్పె నతనికి సౌభర్యాది శిష్యు లనేకులై ప్రవర్తిల్లిరంత సౌభరి సుతుండు శాకల్యుండు తానభ్యసించిన శాఖ నైదు విధంబులుగా విభజించి వాత్స్యుండు, మౌద్గల్యుండు, శాలీ

యుండు, గోముఖుండు, శిశిరుండనెడు శిష్యుల కుపదేశించె. నంత జాతుకర్ణి యను వానికి వా రుపదేశింప నతడు బలాకుండు పైంగుడు వైతాళుడు విరజుం డను వారి కుపదేశించె. నదియుం గాక మున్ను వివిపించిన బాష్కలుని కుమారుండైన బాష్కలి వాలఖిల్యాఖ్య సంహితను బాలాయని గార్గ్యుండు కాసారుండను వారలకు జెప్పె నిత్తెరంగున బహ్వృచ సంహిత లనేక ప్రకారంబులం బూర్వోక్త బ్రహ్మ ఋషులచే ధరియింపంబడియె యజుర్వేద ధరుండగు వైశంపాయనుని శిష్య సంఘంబు నిఖిల క్రతువుల నాధ్వర్యకృత్యంబులచే దేజరిల్లిరి మరియు నతని శిష్యుండగు యాజ్ఞవల్క్యుండు గుర్వపరాధంబు జేసిన నా గురువు కుపితుడై యధీత వేదంబుల మరలం దనకిచ్చి పొమ్మనిన నతండు దాను చదివిన యజుర్గణంబును దదుక్తక్రమంబున గ్రక్కనవి రుధిరాక్తంబగు రూపంబు దాల్చిన యజుర్గణాధిష్ఠిత శాఖాది దేవతలు తిత్తిరి పక్షులై వానిని భుజించిరి. దానంజేసి యాశాఖలు తైత్తిరీయంబులయ్యె నంత నిర్వేది యగు నా యాజ్ఞవల్క్యుం డపరిమిత నిర్వేదంబు నొంది యుగ్ర తపంబున సూర్యుని సంతుష్టుని గావింప నతండు సంతసిల్లి హయ రూపంబు దాల్చి యజుర్గణంబుల నతని కుపదేశించె. గావున నది వాజసనేయశాఖ యని ప్రాఖ్యాతంబడె నంత నా యజుర్గణంబు కాణ్వమాధ్యందినాదులచే నభ్యసింపబడె నిట్లు యజుర్వేదంబు లోకంబున ప్రవర్తిల్లె. సామవేదాధ్యేత యగు జైమిని మహర్షి తన సుతుండగు సుమంతుని కుపదేశించె. నతడు సుకర్ముండను తన సుతునకు తెలిపె. నతండా వేదమును సహస్ర శాఖలుగా విభజించి కోసలుని కుమారుడైన హిరణ్యనాభునికి తన కుమారుడకు పౌష్యంజి యను వానికి నుపదేశించె. నంత వారిరువురు బ్రహ్మవేత్తలగు నావంత్యులు నదీచ్యులునను నేనూర్గిరికి నుపదేశించి వారిని సామవేదపారగులంగా జేసి రిట్లు సామవేదంబు లోకంబున వినుతి నొందె. మరియు నథర్వవేత్త యగు సుమంతు మహర్షి దానిని తన శిష్యుల కుపదేశించె. నందు వేదదర్శుండను వాడు శౌల్కాయని బ్రహ్మబలి నిర్ఘోషుండు పిప్పలాయనుం డను వారలకును, పథ్యుడను వాడు కుముదుండు శుకకుండు జాబాలి బభ్రువంగిరసుండు సైంధవాయనుం డనువారలకు నుపదేశించి ప్రకాశంబు నొందించె. నిత్తెఱంగున నథర్వ వేదంబు వృద్ధి నొందె నిట్లఖిల వేదంబుల యుత్పత్తి ప్రచార క్రమం బెఱింగించితి.

(—భాగవతము: ద్వాదశ స్కంధము 30 వ గద్య)

## మరి కొన్ని యాధారములు

పైన నుదహరించిన భాగవతాధారము, సత్యవతీదేవి పుత్రుడైన వేదవ్యాసుడు వేదములను విభజించిన క్రమము దానిని వారి శిష్యపరంపరకు బోధించి ప్రాచుర్య మొనర్చిన విధానమును దెల్పుచున్నది. హిందువుల గ్రంథములు సృష్ట్యాదిలో బ్రహ్మవలన సృష్టింపబడి క్రమముగా ఋషులవలన ప్రచారమొందిన వనుట సుస్పష్టమైన విషయముగా దోచును. కాబట్టి యీ వేదములలో గల అంతర్యములు దెలుసుకొనుట అత్యంతావశ్యకములు గాన వాటిని దిగువ నుదహరించడమైనది.

---

# హిందూ ధర్మము

## ద్వితీయాశ్వాసము



### -: ఋగ్వేదక్రమము :-

"ఋక్" అనగా పరమాత్మను స్తుతించు మంత్రము. ఇది యత్యంత పురాతనమైనదనియు జెప్పుట కలదు. ఈ ఋగ్వేదము పది మండలములుగా విభజింపబడియున్నది. ఇందు మొదటి యేడు మండలములయందు పరబ్రహ్మమును అగ్నియను పేరుతోడను పదియవ మండలమున ఇంద్రుడను పేరుతోడను స్తుతింపబడియున్నది. తక్కిన గీతములు పరబ్రహ్మమును విశ్వేదేవతలనే పేరుతో స్తుతింపబడియున్నది. అంతేగాక తక్కిన యెనిమిది తొమ్మిదిమండలములయందు ప్రాధాన్యమైన గీతములు, పరబ్రహ్మమునుగూర్చి స్తోత్రము జేయబడియున్నవి.

ఎనిమిదవ, తొమ్మిదవ మండలములయందు తొంబదిరెండు గీతములున్నూ పదవ మండలమునందు నూటపద్నాలుగు గీతములును గలవు. వీనియందు కొన్ని సోమలతను గురించి ప్రార్థింపబడియున్నవి. ఈ పది మండలములలో నూటికిమీద అనువాకములు గలవు. అనువాకములనగా అజములు లేక పనసలు గల వేదవాక్యము లని యర్థము. వీనియందు గీతములను రచించిన ఋషుల పేర్లును నవియు నే దేవతలయొక్క పేర్లతో రచింపబడెనో ఆ దేవతలపేర్లును, ఏ విషయమునకై రచింపబడెనో ఆ విషయ వివరణమును విశదముగా జెప్పబడియున్నవి. ఒకటవ మండలము పదిహేనవ అధ్యాయమందు కుత్సుతుని,ధృతుని గూర్చిన గీతములను కొందరు తపోధను లొక యెడారియందు బోవునపుడు జలముకొరకై యొక డొక బావిలో దిగగా వేరొకడు యా బావిని బండిచక్రముతో మూసినంతలో లోపల నున్నవాడు పరితాపముతో ప్రార్థించిన గీతములును, ఇరువదిమూడవ అధ్యాయములో అగస్త్యులు, ఇంద్రుడు మొదలగువారికి

జరిగిన సల్లాపములును, ఇరువది నాల్గవ అధ్యాయమునందు అగస్త్యులు స్తుతించిన గీతములును మరియు నతడు విషమునకు భయపడి ప్రార్థించిన గీతములును గలవు. ఇట్లే ఏడవ మండలమున మూడవ అధ్యాయము ఎనిమిదవ ప్రకరణమునందు వసిష్ఠ మహర్షి విషవేదనదొలుగుటకు ప్రార్థించియున్నాడు. మూడవ మండలము ఐదవ యధ్యాయమునందు విశ్వామిత్రుడు రచించిన ప్రార్థనలయందలి కడపటి గీతములయందు ఆరవ మంత్రములో నొకదానియందు పరమాత్మను ఓంకార గాయత్రిగా స్తుతింపబడియున్నది. ఆరవ మండలము మూడవ గీతములయందు పరమేశ్వరుని సూర్యుని పేరుతో స్తుతించినవియును, వర్షము నిమిత్తము వసిష్ఠులవారు ప్రార్థించినవియును గలవు. ఏడవ మండలము మూడవ అధ్యాయము కడపట ఆర్యులు ఆదియందు గృహములు మొదలగునవి నిర్మించునపుడు స్తుతించు మంత్రములు గలవు. నాల్గవ అధ్యాయమున రుద్రుని గూర్చి స్తుతింపబడియున్నవి. మరియు నీ మండలము కడపటి భాగమునందు, ఆదికాలపు రాజుల చరిత్రలు ప్రస్తావింపబడియున్నవి. ఎనిమదవ మండలము ఇరువదియేడవ అధ్యాయమునందు రాజ పట్టాభిషేకముజేయు వివరణములును. మూడు మొదలు ముప్పదియెనిమిది వరకుగల అధ్యాయములయందు ఇంద్రుడు మొదలగు దేవతలను వర్ణించు విధములును ముప్పదినాల్గవ అధ్యాయమునందు భయభక్తు లలవడుటకు సాధ్యమగు కర్మలును నాల్గవ అధ్యాయమునందు పురోహితులయొక్కయు, ఆచార్యులయొక్కయు లక్షణములును, వారికి జేయవలసిన మర్యాదలును వివరింపబడియున్నవి. పదవ మండలము ఆఱవ అధ్యాయమునందు శత్రు విజయ విషయమైన రెండు గీతములును యేడవ అధ్యాయమందు చంద్ర సూర్యుల సల్లాపములును యముడు యమునను చెఱుప ప్రయత్నించినప్పుడు నీతివాక్యములు జెప్పి అడ్డగించిన గీతములును, పదవ యధ్యాయము కడపటి భాగమున అంబరీషుని కుమారైను గుఱించియు,సూర్యుని గుఱించియు పదకొండవ అధ్యాయమునందు మొదట లోకసృష్టి విషయమునుగూర్చి జెప్పబడిన గీతములును గలవు.

ఈ ఋగ్వేదమందలి ఐతరేయ బ్రాహ్మణమును ఐతరేయారణ్యకమును ఐతరేయోపనిషత్తును కౌషీతక్యుపనిషత్తును మిగుల ప్రశస్తమైనవిగా భావింపబడుచున్నవి.

## —: యజుర్వేద క్రమము :—

"యజ్" అను ధాతువుచేత బుట్టినదియే యజుర్వేదము. యజుర్వేదము యాగములు, బలిదానములు మొదలగు వానిని గురించి జెప్పబడినది. ఇందు యాగములు, బలిదానములు మొదలగునవి జేయునప్పుడు పురోహితులు వారి సహాయోపధ్యాయులు జెప్పునట్టి పద్యము లిందు గలవు. ఈ వేదమును సృష్టించిన వారికి అధ్వర్యులని పేరు. ఈ యజుర్వేదమున ప్రధాన భాగములయందు మంత్రములును, సంహిత యందలి నలువది అధ్యాయములయందు స్తోత్రములును గలవు. ఇది రెండువందల యెనభైయారు అనువాకములును, ఇంచుమించుగా ఒకవేయి తొమ్మిదివందల ఎనభైయేడు ప్రకరణములను కలిగియున్నది.

మొదటి రెండధ్యాయములయందు అమావాస్య, పౌర్ణమి దినములలో జేయవలసిన యాగములును, కడపట పితృకర్మలనుజేయు విధములును, మూడవ అధ్యాయమునందు నిత్యకర్మాదులనుజేయు విధములును, నాల్గుమొదలు యెనిమిది అధ్యాయముల వరకు అగ్నిష్టోమాదులును మరియు సోమపానమును తొమ్మిది, పది అధ్యాయములయందు వాజపేయము, రాజసూయము మొదలగు యజ్ఞములును, పందొమ్మిది- ఇరువది- ఇరువదిరెండు- ఇరువదిమూడు- ఇరువదినాల్గు- ఇరువదిఐదు అధ్యాయములయందు అశ్వమేధయాగములును, ముప్పది, ముప్పది యొక్క అధ్యాయములయందు పురుషమేధము, సౌత్రామణి, నారాయణ బలి మొదలగునవియును జెప్పబడియున్నవి. ఇట్లే తక్కిన అధ్యాయములందును యాగముల విషయములు ప్రబలముగా వర్ణింపబడియున్నవి.

మరియు స్తోత్రభాగములయందు పరమేశ్వరుని ప్రజాపతి, పరమేష్ఠి, నారాయణుడు, బృహస్పతి, ఇంద్రుడు, వరుణుడు, అశ్విని మొదలగు పేర్లచే కొనియాడబడియున్నవి. ఈ స్తోత్రములకు వశిష్ఠ, వాసుదేవ, విశ్వామిత్రాదులు కర్తలుగా నున్నారు.

ఈ యజుర్వేదమున జెప్పబడినట్లుగా పశుపక్ష్యాదులను జంపుటయనునది మంచిది కాదని సామాన్యముగా దోచుటయేగాక యెంతమాత్రము ప్రాణులను హింసజేయగూడదని విధులున్నవి. మరియు శతపథ బ్రాహ్మణమునందు బలుల నీయగూడదని నిషేధింపబడియున్నది. ఇది వాజసనేయుల కాలమున కృష్ణ

యజుర్వేదమనియు, శుక్లయజుర్వేదమనియు రెండు విధములైనవిగాయున్నవి. శుక్లయజుర్వేదము వాజసనేయ సంహితమనియును, తైత్తిరీయ సంహితయనియును తెలుపబడుచున్నది. శుక్లయజుర్వేదమునకు ఉదాత్త అనుదాత్తములను రెండు స్వరములును, కృష్ణయజుర్వేదమునకు ఉదాత్త అనుదాత్త స్వరితము ప్రచయములని నాల్గు స్వరములును గలవు. శుక్లయజుర్వేదములోని యీశావాస్యము, ఉపనిషత్తులకెల్ల ప్రధానమైనదిగా పరిగణింపబడుచున్నది.

## —:సామవేదక్రమము:—

సామవేదమనగా గానరూపమైన గీతములుగలది. ఇది సహస్ర సంహితాభేదము గలదియై యున్నది. కొందరు ఒకవేయి ఐదువందల నలువదితొమ్మిది పద్యములున్నవనియును, ఇందు డెబ్బదియెనిమిది పద్యములు ఋగ్వేదములోనివనియును చెప్పుచున్నారు. ఈ సామవేదమను వృక్షశాఖను వ్యాసుల వలను జైమిని ఋషియును వారి వలన తమ కుమారులైన సుమంతు మొదలగువారును అధ్యయనము జేసిరి.

ఇందు పరమేశ్వరుని అగ్ని, ఇంద్రుడు మొదలగు పేర్లతో నుద్ఘోషింపబడియున్నది. మరియు పాప నివారణమగు గీతములును, వీనిని అధ్యయనము జేయువారికి గలుగు ఫలమును జెప్పబడియున్నది. ఈ వేదమును అధ్యయనము జేయువారిలో ఉదీచ్యసామగులనియు, ప్రాచ్యసామగులనియును ఇరుదెఱగులవారును గలరు. ఈ వేదమును అధ్యయనము జేయువారికి ఉద్గాతృలనిపేరు. దీనిని సుకర్మాదులు యేనూరుగురు అధ్యయనము జేసియుండిరి. ఈ సామవేదములోని ఛాందోగ్యోపనిషత్తు, కేనోపనిషత్తు అను రెండును మిగుల ప్రశస్తములైనవి. అందును ఛాందోగ్యము మిగుల ప్రసిద్ధమైనది. ఈ సామవేదము భక్తిప్రధానమైనది.

## అధర్వణ వేదక్రమము

అధర్వణవేదమునందు శాంతిక, పౌష్టిక, చరకాది మంత్ర తంత్ర ప్రయోగ విధులు గలవు. ఈ వేదమును వ్యాసమహర్షి శిష్యుడైన సుమంతు

ఋషి తన కుమారుడైన కబంధువున కుపదేశించెను. కబంధువు దీనిని రెండుగా విభాగించి దేవధర్మాది శిష్యుల కుపదేశించెను. ఇది యిరువదియెనిమిది కాండములును, ఒకవేయి పదిహేను వాక్యములును, ఇంచుమించుగా రెండువందలకు పైబడిన అనువాకములును, యేడువందల యరువదికి పైబడిన సూక్తులును గలిగి నలువది ప్రపాఠకములుగా విభజింపబడియున్నది. ఇందు ముఖ్యముగా శత్రునాశనము మొదలగు విషయములు విస్పష్టపరచబడియున్నవి. మరియు నక్షత్రముల యొక్కయు, మాసముల యొక్కయు ప్రస్తావన దెలుపబడియున్నది. దీని రెండవ భాగమునందు ప్రపంచోత్పత్తియును, యీ ప్రపంచమున కాదికారణము బ్రహ్మమనియును మరియు సంవత్సర, మాస, దినములను గూర్చిన విషయములును జెప్పబడియున్నవి. ఈ అధర్వణ వేదాంతర్భూతమగు ముండకోపనిషత్తును, కేనోపనిషత్తును ప్రశస్తములైనవిగా యున్నవి.

ఈ చెప్పబడిన వేదములు నాల్గింటియందుగల ముఖ్యాంశములను వివరించుటకు ఉపనిషత్తులు (వేదాంతములు) ను మఱియు నీవేద వేదాంతములకు అంగములైన షడంగములును, వేదముల కనుబంధములగు ఉపవేదములును గలవు.

## ఉపనిషత్తులు

పైన సూచించినరీతి వేదాంతములనగా ఉపనిషత్తులని తెలుసుకొన గలిగితిమి. ఇపుడీ వేదాంతానుక్రమణికలు గూర్చి తెలుసుకొన వలసియున్నది. ఈ ఉపనిషత్తులు పదియని తెలుపుదురు. మరికొందరు వీటిని నూటాయెనిమిదియని జెప్పుట కలదు. వేదాంత విదులు పది ఉపనిషత్తులే ముఖ్యమైనవిగా దెలుపుట కలదు. వాటి వివరణ మీవిధముగా జెప్పుదురు.

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండుక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

ఉపనిషత్ అను శబ్దములు మూడు పదములతో గూడియున్నవి. అది ఎట్లన? ఉప-ని-షత్- ఉప-అనగా సమీపమున- ని-అనగా చక్కగా- సద్-అనగా పొందబడినది. గురు సమీపమున నుండి అధ్యాత్మ విద్యారూపములో చక్కగా గ్రహించబడినదని భావము. "అస్యాం శ్రేయః ఉపనిషదితి" అని యనగా మేలుగలుగజేయునదనియు లేక హితమును బోధించునదనియు భావము. మరియు ఉపనిషత్తునకు వేదాంతమనియు, వేదశిరస్సనియును, రహస్యమనియు నిట్లనేక నామములు కలవు. వేదములయొక్క పర్యవసానము తెలియజేయునది గాన వేదాంతమనియును మానవునకు శిరస్సువలె వేదమునకు ఉపనిషత్తు శిరస్థానమై యున్నందున వేదశిరస్సనియు పేర్లుగలిగెను. ఇంతేగాక పరమాత్మ జ్ఞానమునుతెలియజేయునదియై ఆచార్యునివద్ద నభ్యసింపదగినదియైనందున "రహస్య" మనియును "అంతరంగిక" మనియు "ప్రార్థన" మనియును యిట్లనేకార్థములు గలిగి యున్నది. కావుననే ఉపనిషత్తునకు "సమీపసాధనము" అని మరొక పేరు గల్గెను. ఋగ్యజుసామాధర్వణములనియెడు నాల్గు వేదములలోనుండి ఒకవేయి నూటఎనుబది ఉపనిషద్వాక్యములు గలిగెనని జెప్పుటకలదు. అవి యెట్లనిన? ఋగ్వేదమునందు ఇరవదియొక్క శాఖలును, యజుర్వేదమునందు నూటతొమ్మిది శాఖలును, సామవేదమునందు వేయి శాఖలును గలవు. ఈ శాఖల సంఖ్యయైన ఒకవేయి నూట ఎనభై యింటిని ఉపనిషత్తులనబడును. వీనియందు యెనిమిది వందల నలుపది కర్మలను బోధించునుగాన కర్మకాండమనియు రెండువందల ముప్పదిరెండు ధ్యేయబ్రహ్మమును బోధించుటంబట్టి ఉపాసన కాండమనియును, నూటయెనిమిది ఉపనిషత్తులు జ్ఞేయబ్రహ్మమును బోధించునుగాన జ్ఞానకాండమనియును పేరొందెను. మరికొందరు వీటిని రెండువందల ముప్పదియైదనియును, కొందరు నూటాడెబ్బదియనియును లేక నూటాయెనిమిది యనియును పలువురు పలు విధములుగా జెప్పుచున్నారు. ఇపుడు జ్ఞేయబ్రహ్మమును బోధించు నూటాయెనిమిది ఉపనిషత్తులు ప్రసిద్ధములైయున్నవి. వీనిలో దశోపనిషత్తులు మిగుల ప్రశస్తమైనవిగా జెప్పుదురు.

## వేదాంగములు

శ్లో॥ శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహు ర్మనీషిణః ॥

అను సూక్తిననుసరించి, శిక్షా-వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము లనునవి వేదాంగములని పై శ్లోకమునకు తాత్పర్యము. వీటినే షట్శాస్త్రములని. షడ్దర్శనములని నుడువుట కలదు.

## షడంగముల వివరణము

శిక్ష:— దీనికి పాణిని యనువారు కర్త. యిందు వేదశబ్దములయొక్క అక్షరముల స్థానజ్ఞానములను, ఉదాత్త అనుదాత్త, స్వరిత, స్వరముల జ్ఞానమును జెప్పబడును. ఉదాత్తమనగా ఉచ్ఛము-అనుదాత్త మనగా నీచము-స్వరితమనగా సమానమనియు తెలియదగినది, వ్యాసశిక్ష, భారద్వాజ శిక్ష, నారద శిక్షయని త్రివిధములుగా జెప్పుదురు.

*వ్యాకరణము :-*

దీనికి పాణిని యనువారే కర్తలు కాత్యాయనుడును పతంజలులులును అనువారు వ్యాఖ్యానములను రచించియున్నారు. ఇందు వేద శబ్దములయొక్క ప్రకృతి ప్రత్యయజ్ఞానము విశదీకరింపబడియున్నది. పాణినీయ ప్రోక్త వ్యతిరిక్త వ్యాకరణములు వేదాంగములుగా పరిగణింపబడవు. అవి పురాణముల కుపయోగ పడును.

*ఛందము :-*

దీనికి పింగలు డను మునీశ్వరుడు కర్త. దీనివలన వేదమునందు జెప్పబడిన గాయత్రి మొదలగు ఛందములయొక్క పరిజ్ఞాన మలవడును.

*నిరుక్తము :-*

దీనికి యాస్క మహాఋషి కర్త. ఇందు వేద మంత్రముల ప్రయోజనమును స్పష్టపరచు నిమిత్తము అప్రసిద్ధ పదములయొక్క అర్థములు బోధింపబడి యున్నవి. మరియు వేదశబ్ద వివరణ నిఘంటువును ఇందుగలదు. శాఖపూర్ణ నిరుక్తమును యిందుగలవు. ఇది పదకాండ యర్థకాండ యని రెండువిధములుగా నున్నది.

జ్యోతిషము :-

దీనికి ఆదిత్యాదులు కర్తలు. ఇందు వైదిక కర్మల నారంభించుటకు వలయు కాలజ్ఞానమును తద్ బలమును భవిష్యత్సూచలనలును వివరింపబడి యున్నవి వీనిని వివరించు సూర్య సిద్ధాంతము మొదలగు గ్రంథము లనేకము లున్నవి.

కల్పము :-

దీనికి ఆశ్వలాయ, వాత్స్యాయన. ఆపస్తంబ, బోధాయన, వైఖానస, ద్రాహ్యాయన, భారద్వాజ, సత్యాషాఢ, హిరణ్యకేశి మొదలగువారు సూత్రకర్తలు. కల్పసూత్రములు వేదములయం దుద్ఘోషింపబడిన యజ్ఞకర్మముల ననుష్ఠించు రీతిని బోధించును.

## ఉపవేదములు

ఋగ్యజస్సామాథర్వము లనెడు నాల్గు వేదములనుండి క్రమముగా నాల్గు ఉపవేదము లుదయించినవి. ఉపవేదము లనగా ఒకటి- ఆయుర్వేదము. రెండవది ధనుర్వేదము. మూడవది- గాంధర్వ వేదము.నాల్గవది- అర్థవేదము.

ఆయుర్వేదము :-

దీనిని రచించినవారు బ్రహ్మ. ఆశ్వినీ దేవతలను ధన్వంతరి మొదలగువారు దీనిని బ్రహ్మచేత బడసిరి. ఈ వేదము రోగనివారణము జేయుటలు బోధించును. చరక, వాగ్బట, సుశ్రుతాది గ్రంథములును దీని యంతర్భూతములే. ఈ వేదమును జ్ఞానమార్గము నంటియుండును. ఆదియెట్లన ఔషధదానము వలన రోగ శమనము కాకపోయినప్పుడు వైరాగ్యమును గలుగజేసి తద్వారా ముక్తి మార్గమును విచారింప జేయును. గాన నిది జ్ఞానదాయకమై యున్నది.

ధనుర్వేదము

విశ్వామిత్రు డీ వేదమునకు కర్త. ముక్త, అముక్త, ముక్తాముక్త, యంత్రముక్త మని చతుర్విధ శాస్త్రవిద్యలు గలవు. అవి యెట్లన: చక్రాదులు

ముక్తము. ఖడ్గాదులు అముక్తము. నారాచాదులు ముక్తాముక్తము. శతఘ్ని మొదలగునవి యంత్రముక్తము. ఈ వేదమునందు అస్త్రశస్త్రప్రయోగ మంత్రములును, శత్రు నాశనమును, శిష్టజన రక్షణమును జూద చోరాదుల ఖండనమును జెప్పబడియున్నవి. గాన ప్రజాక్షేమము కొరకును తద్వారా మోక్షము సిద్ధించుటకు దీనిని బ్రహ్మదేవునివలన విశ్వామిత్రు డుపదేశము నొందెను.

### గాంధర్వ వేదము :-

ఇది భరతముని ప్రణీతము. ఇందు స్వర తాళ మూర్ఛాదులును నృత్య వాద్యాదుల విషయములును స్పష్టముగా దెలియజేయబడి యున్నవి. గీతముల వలన ఈశ్వర స్తోత్రము లానంద దాయకముగా నుండును గాన నిదియును పరలోక సాధనమై యున్నది.

### అర్థ వేదము

దీని కనేక మహాత్ములు కర్తలు. శిల్పశాస్త్రము, పాకశాస్త్రము, నీతిశాస్త్రము, అశ్వశాస్త్రము మొదలగునవి అథర్వణ వేదాంతర్భూతములు. అవి ధన సంపాదనకు హేతు భూతములు. ఇందువలన ధన సంగ్రహము గలిగి యా ధనము సత్కర్మాచరణములకు అనగా దేవాలయము యజ్ఞము మొదలగు వానికి యుపయుక్తమై ఆముష్మిక ఫలమును గలుగజేయును. ఈ వేదమునకు స్థాపత్య మనియును పేరుగలదు.

## పురాణములు

పురాణములు పద్దెనిమిది.వీటి విభజనము మరియు వివరణము తెలుసుకొనుట ముఖ్యము.

శ్లో, బ్రాహ్మ్యం పాద్మం వైష్ణవం చ శైవం లైంగశ్చ గారుడమ్
నారదీయం భాగవతం ఆగ్నేయం స్కాంధ సంజ్ఞితమ్
భవిష్యత్ బ్రహ్మవైవర్తం మార్కండేయం చ వామనమ్
వారాహ మాత్స్య కౌర్మాణి బ్రహ్మాండాఖ్య ఇతి త్రిషట్
బ్రహ్మన్నేతం సమాఖ్యాతం శాఖాప్రణయనం మునేః॥

౧. బ్రహ్మ పురాణము
౨. పద్మ పురాణము
౩. విష్ణు పురాణము
౪. శివ పురాణము
౫. లింగ పురాణము
౬. గరుడ పురాణము
౭. నారద పురాణము
౮. భాగవత పురాణము
౯. అగ్ని పురాణము
౧౦. స్కాంద పురాణము
౧౧. భవిష్యత్ పురాణము
౧౨. బ్రహ్మ వైవర్త పురాణము
౧౩. మార్కండేయ పురాణము
౧౪. వామన పురాణము
౧౫. వారాహ పురాణము
౧౬. మత్స్య పురాణము
౧౭. కూర్మ పురాణము
౧౮. బ్రహ్మాండ పురాణము

## పురాణ వివరణము

*బ్రహ్మ పురాణము :-*

దీనిని బ్రహ్మదేవుడు మరీచికి బోధించెను. ఇది పదివేల శ్లోకములుగల దియై యున్నది.

*పద్మ పురాణము*

ఇదియును బ్రహ్మచే చెప్పబడినదిగా వచింతురు. ఇది యేబదియైదు వేల శ్లోకములు గలిగియున్నది.

*విష్ణు పురాణము*

దీనిని పరాశరులు రచించిరి. ఇది యెనిమిదివేల శ్లోకములు గలదియై యున్నది.

*శివ పురాణము:-*

దీనిని వామదేవుడు రచించెను. దీనిని వాయుపురాణ మని జెప్పుటయును గలదు. ఇందు ఇరువదినాల్గు వేల శ్లోకములు గలవు.

**భాగవత పురాణము :-**

దీనిని శుక మహర్షి పరీక్షిన్మహారాజున కుపదేశించెను. ఇది పదునెనుమిది వేల శ్లోకములు గలది.

**నారదీయ పురాణము :-**

దీనిని నారద మహాఋషి రచించెను. ఇందు ఇరువదియైదువేల శ్లోకములు గలవు.

**మార్కండేయ పురాణము:-**

ఇది మార్కండేయ మహాముని ప్రణీతము. ఇందు పక్షులు జైమినికి ధర్మములను జెప్పినవి. చాలా ప్రశస్తకరములునై యున్నవి. దీనియందు ముప్పదిరెండు వేల శ్లోకములు గలవు.

**అగ్ని పురాణము :-**

ఇందు భృగు మహాఋషిచే యాగాది విధులు జెప్పబడియున్నది. ఇది యెనిమిది వేల శ్లోకములు గలిగియున్నది.

**బ్రహ్మ వైవర్త పురాణము :-**

దీనియందు వసిష్ఠ మహాఋషి యంబరీషున కుపదేశించిన ధర్మములు గలవు. ఇది పద్రెండువేల శ్లోకములు గలదియై యున్నది.

**లింగ పురాణము :-**

దీనిని నందీశ్వరుడు రచించెను. ఇందు పదకొండు వేల శ్లోకములున్నవి.

**వరాహ పురాణము:-**

దీనిని వరాహమూర్తి భూదేవి కుపదేశించెను. ఇందు నాల్గువేల శ్లోకములున్నవి.

**స్కాంద పురాణము :-**

ఇది కుమారస్వామిచే చెప్పబడినది. ఇందు నూరువేల శ్లోకములు గలవు.

వామన పురాణము :-

ఇది బ్రహ్మదేవునిచే రచింపబడినది ఇందు పదునాల్గువేల శ్లోకము లున్నవి.

మత్స్య పురాణము -

దీనిని మత్స్యమూర్తి యగు విష్ణువు మనువున కుపదేశించెను. ఇందు పదు నాల్గువేల శ్లోకములు గలవు.

కూర్మ పురాణము:-

దీనిని కూర్మరూప భగవంతుడు రచించెను. ఇందు ఆరువేల శ్లోకము లున్నవి.

గరుడ పురాణము :-

ఇది విష్ణువు గరుత్మంతున కుపదేశించెను. ఇందు పదునారువేల శ్లోక ములు గలవు.

బ్రహ్మాండ పురాణము :-

దీనిని బ్రహ్మదేవుడు రచించెను. ఇందు పన్నెండువేల యిన్నూరు శ్లోక ములు గలవు.

ఈ పురాణములు లోకోపయుక్తకరముగా యా యా దేశకాల పాత్రా దుల ననుసరించి ధర్మబోధల రూపమున పురాణ పురుషులగు బ్రహ్మ, విష్ణు మొదలగు వారిచే ప్రవచించబడినవై యున్నప్పటికీ వీటిని సమగ్రముగా పరి శోధించి, విభజించి కృష్ణ ద్వైపాయనుడగు వేదవ్యాస మునిసత్తముడు ప్రపం చమున ప్రకటించెను.

పైన చెప్పబడిన పురాణములు పదునెనిమిదిలో విష్ణుపురాణము, భాగవత, నారదీయ, గారుడ, పాద్మ, వారాహ పురాణములనునవి ఆరు సాత్త్విక పురాణ ములు. ఇవి విష్ణు ప్రతిపాద్యములు.

బ్రహ్మ పురాణమును, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్తన, మార్కండేయ, భవిష్య, వామన పురాణములను నీయారును రాజసపురాణములని జెప్పుటగలదు. ఇవి బ్రహ్మప్రతిపాద్యములని మహాత్ముల యభిమతమైయున్నది.

శైవ పురాణమును, లైంగ, స్కాంద, ఆగ్నేయ, మాత్స్య, కూర్మ పురాణములను యీ యాఱును తామసపురాణములు. ఇవి శివ ప్రతిపాద్యములు. మరియు తామసపురాణములను సాత్వికపురాణములనియును, సాత్వికపురాణములను తామసపురాణములనియును మతద్వేషముచే కొందరు జెప్పుదురు.

జగత్తు త్రిగుణాత్మకమైన విధముగా పురాణాదులు గూడా త్రిగుణములకు ప్రాతినిధ్యము వహించుట గమనార్హమైన విషయము. త్రిమూర్తులు త్రిగుణాత్మక తత్త్వములకు యధిష్ఠాతలగుటచే యీ పురాణములు గూడా వారి వారి సహజత కనుకూలముగ ప్రవచింపబడియున్నవనుట వాస్తవికతతో గూడిన విషయముగా స్ఫురించక మానదు.

పురాణముల తర్వాత ఇతిహాసములు గణనీయమగు స్థానము నాక్రమించుకొనదగిన గ్రంథములని జెప్పుదురు. అంతేగాక పురాణములు పదునెనిమిదికి పదునెనిమిది ఉపపురాణములు కలవు. వాటి నీ సందర్భములో దెలుసుకొనుట సముచితమైనదిగా భావించి వివరించటమైనది.

| | |
|---|---|
| ౧. సనత్కుమారము | ౧౦. బ్రహ్మాండము |
| ౨. నారసింహము | ౧౧. వారుణము |
| ౩. స్కాందము | ౧౨. కౌశికము |
| ౪. శివదర్శనము | ౧౩. లైంగము |
| ౫. దౌర్వాసము | ౧౪. సాంబము |
| ౬. నారదీయము | ౧౫. సౌరవము |
| ౭. కపిలము | ౧౬. పరాశరము |
| ౮. వామనము | ౧౭. మారీచము |
| ౯. ఔశనము | ౧౮. భార్గవము |

మొదలగునవి నుపపురాణములుగా తెలియజేయుదురు. వీటిలో ముందు దెలియ

జేసిన పద్ధెనిమిది పురాణములలోని విషయములే యించుమించుగా కొద్ది మార్పులతో దెలియజేయుటమైనది.

పైన జెప్పబడిన పురాణముల యొక్క లక్షణములు రెండు విధములై యుండును.

**మొదటి విధము:-**

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వృత్తి రక్షాంతరాణి చ।
వంశోవంశాను చరితం సంస్థా హేతు రపాశ్రయః
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః

అనగా సర్గము (సృష్టి) ప్రతిసర్గము (ప్రళయము) వృత్తి (వ్యాపారము) రక్షా (పరిపాలన) మన్వంతరము (మన్వాదుల కాలము) వంశము (వంశ్యాది విషయములు) వంశానుచరితము (రవిశశి వంశస్థుల చరిత్రములు) సంస్థా (స్థితి) హేతువు (కారణము) అపాశ్రయము (ఆశ్రయవిషయము) అను నీ పదియును పురాణములకు లక్షణములు.

**రెండవ విధము:-**

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పంచకమ్

*సర్గ మనగా:-*

సర్వ ప్రపంచ సృష్టిని విస్తరించుట.

*ప్రతిసర్గ మనగా:-*

సకల ప్రపంచమును లయమగు లక్షణములను తెలుపుట.

*వంశ మనగా:-*

పృథు ప్రియవ్రతాదుల వంశోత్పత్తిని విశదీకరించుట.

*మన్వంతరమనగా:-*

చతుర్దశ మనువులలో యే కల్పమందు యేమనువు కాలమున నేయే కార్యములు జరిగినవో యా వృత్తాంతము దెల్పుట.

*వంశానుచరిత మనగా:-*

సూర్య చంద్ర వంశస్తులగు శ్రీరామ, ధర్మరాజాదులయొక్క వృత్తాంతములను తెలుపుట యను నీయైదును పురాణలక్షణములు. వీటినే, సర్గము-ప్రతిసర్గము-వంశము-మన్వంతరము-వంశానుచరితములు అని వివరించుట కలదు.

అంతేగాక కొందరు దశలక్షణములతో గూడినది మహాపురాణమనియును, పంచలక్షణములతో గూడినది అల్పపురాణ మనియును జెప్పుదురు. మరియు నీపురాణములు వ్యాస భట్టారక ప్రణీతములుగా వచింతురు. ఇతరులచే జెప్పబడినవియు, ఘోషింపబడియున్నను వ్యాసమహర్షులే వీటికి నుత్పత్తికర్తలని తెలియజేయబడియున్నది.

## ఇతిహాసములు

ఈ పురాణముల యనంతరము ఇతిహాసములు పేర్కొనదగినవైయున్నవి. ఇతిహాసము లనగా ? శ్రీమద్రామాయణము. మహాభారతములు— ఇవి సూర్యవంశ రాజుల, మరియు చంద్రవంశరాజుల చరిత్రములను తెలియజేయును. ఇతిహాసములు రెండు. కాని కొందరు రఘువంశమునుగూడ ఇతిహాసముగా లెక్కించి ఇతిహాసములు మూడని జెప్పుటకలదు. అందువలన ప్రముఖములైన ఇతిహాసములు రెండే రెండు గాన, రామాయణ, మహాభారతములే బహుళ ప్రచారములోనున్నవి. వీటిలో శ్రీ నారద భగవానులు వాల్మీకి మహర్షికి బోధించినది రామాయణము. దీనినే వాల్మీకి రామాయణమని యందురు. దీనిని ఆదికవి వాల్మీకి మహర్షి రచించెను. ఇది మహోత్కృష్టమగు నీతి ధర్మ విధులను బోధించు గ్రంథరాజము. హిందూమతవాదులకు రామాయణమంతటి పవిత్ర ఇతిహాసము మరొకటిలేదు. ఈ మహనీయ గ్రంథస్థమగు విషయములు హిందూ సమాజముపై పలు విధముల ప్రభావముగలిగి సమాజమును సుసంఘ

టిత మొనర్చి ధర్మమార్గమున నడిపించుటకు నేటికినీ దోహదము గలిగించు చున్నది.

మహాభారతేతిహాసము చంద్రవంశరాజులగు కురుపాండవుల చరిత్రను సూచించే రాజనీతియుక్త గ్రంథము. దీనిని కృష్ణద్వైపాయనుడు (వేదవ్యాసుడు) విశ్వజనీనమైన గ్రంథముగా పంచమవేదమన బరగునట్లు రచించెను. ఈ వ్యాస ప్రోక్త మహాభారతేతిహాసములో పదునెనిమిది పర్వములుగలవు. ఈ పదునెని మిది పర్వములలో యుద్ధపంచకమున, ఆదికాండములోగల భీష్మపర్వమునందు భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునకు భగవద్గీతలు నుపదేశించెను. ఇది హిందువులకు ప్రాణాధారకరమైన మౌలిక గ్రంథమని యెల్లరును గుర్తించిన విషయమే. అంతేగాక హిందువులు వారి పురాణస్థములైన విష్ణుభగవానుని దశావతారములు ముఖ్యములని భావింతురుగాన వాటిని గూర్చి తెలుసుకొనుట యవసరము.

# హిందూ ధర్మము

## తృతీయాశ్వాసము

### -: దశావతారములు :-

శ్లో. మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ బౌద్ధః కల్కి రేవ చ.

దశావతారము లనగా భగవంతుడగు శ్రీ మహావిష్ణువు దుష్ట సంహారమునకు, శిష్ట ప్రతిపాలనమునకు ప్రతియుగమున యొకటి రెండును లేక యంతకు మించి నాలుగైదు సార్లవరకు జన్మించి దుష్ట శిక్షణజేసి ప్రపంచమున ధర్మ సంస్థాపన జేసిన విధములను రూపభేదములను దెలుపును. భగవద్గీతలలో శ్రీ కృష్ణమూర్తియైన విష్ణువు యొకచోట,

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

అని సెలవిచ్చియున్నాడు అనగా నేను సాధువులను రక్షించి దుష్టులను శిక్షించుటకును ధర్మ సంస్థాపనము జేయుటకునై ప్రతియుగమున బుట్టుదునని పై శ్లోకమునకు తాత్పర్యము. కాని యుగములు నాల్గు యని ఒకవంక జెప్పుచు, యవతారములు పదింటిని జెప్పుచుండుటచే యుగమున కొక్కమారు బుట్టుదునను భావమును స్ఫురింపజేయు భగవద్గీత శ్లోకమునకు సరియైన అర్థము రావటము లేదుగదా యని కొందరాక్షేపించుట కలదు. భగవంతుడగు శ్రీకృష్ణుడు యుగే యుగే యని జెప్పినను, యుగమున కొక్కసారియే యని సూచింపబడుటలు కాదు. దుష్టుల బాధలు, శిష్టులు భరింపరాని పరిస్థితి యేర్పడినప్పుడెల్లను, నేనుద్భవించెదను. శ్లోక ప్రథమపాదమున సూచించిన యర్థము మనము గ్రహించవలసి యున్నది. ఈ పద్ధతిచే పరిగణించి జూచినయెడల ఒక కృతయుగముననే

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన యనెడు ఐదు రూపములతో గూడిన యవతారములను భగవంతుడు ధరించెననుట సుస్పష్టమైన విషయము. ఇక త్రేతాయుగములో లేక త్రేత, కృతయుగ సంధిలో రెండవతారములను విష్ణు భగవానుడు దాల్చగలిగెను. వాటినే పరశురామ శ్రీరామ యవతారములని జెప్పుదురు. ద్వాపరయుగమున శ్రీకృష్ణ యవతార మొక్కటియేయని తెలుపుదురు ఇక కలియుగములో బౌద్ధావతారము కల్కి యవతార మను రెండింటిని గూర్చి పురాణ వక్తలు జెప్పుదురు.

హిందువులు విష్ణుభగవానుని దశావతారములను విశ్వసింతురు. వీటి దేవాలయాదులను నిర్మించి పూజింతురు. ఈ దశావతారములయందు ధర్మమును స్థాపించి దుష్టులను శిక్షించిన కథలు పారాయణ జేతురు. త్రిమూర్తులలో ఒకరైన స్థితికర్త యగు విష్ణువు సత్కథలను దెలుపు మహోత్తమమైన గ్రంథము భాగవతము. ఈ గ్రంథరాజము వీరికి శిరోధార్యమైనదై యున్నది. ఈ భాగవత పురాణములో విష్ణు భగవానుని చరిత్ర విపులముగా దెలుపబడియున్నది. దశావతార కథలు పాఠకులకు క్లుప్తముగా తెలియజేయడమైనది.

మత్స్యావతారము :-

ఈ యవతారములో విష్ణు భగవానుడు మత్స్యరూపధరుడై సోమకుడనే రాక్షసుని వధించినాడు. సోమకుడు నిద్రించుచున్న బ్రహ్మదేవుని వద్దగల వేదరాశి నపహరించి సముద్రమున జొచ్చి పారిపోవుచుండ, వేదముల నుద్ధరించుటకును, భావిశిష్టజనోపయోగమునకును తోడ్పడు వేదములు దుష్టజనుల హస్తగతము గాకుండ నిరోధించుటకు నతడు సోమకుని సంహరించి వాటిని దెచ్చి బ్రహ్మకు ప్రసాదించెను.

కూర్మావతారము:-

మందర పర్వతముతో క్షీరసముద్రమును దేవరాక్షసులచే తరిపించి అమృతము లభింపగా దేవతలకు ఇచ్చిన గాధ.

వరాహావతారము:-

దితి కొడుకులలో నొకడైన హిరణ్యాక్షు డనువాడు విష్ణు ద్వేషియై,

లోక కంటకుడై విష్ణువును వెదికి యతని నెందునుగానక సమస్తభూవలయమునే పీడించుట కుద్యుక్తుడు కాగా వరాహ రూపముతో ఆదివిష్ణువు ప్రత్యక్షమై హిర ణ్యాక్షుని సంహరించిన కథయే వరాహావతారము.

నరసింహావతారము:-

దితిదేవి కొడుకగు హిరణ్యకశిపుడు తన తమ్ముడైన హిరణ్యాక్షుని వరాహ రూపమున సంహరించినందున విష్ణుద్వేషియై విష్ణుభక్తుల నందరను యెనలేని యిక్కట్ల పాలు జేయుటకును, యెవ్వరితోనైన చావకుండుటకు మందర పర్వతమున కేగి ఘోరతప మాచరించెను. తపోనిష్ఠచేత బ్రహ్మను సంతోషపరచి యమోఘవరప్రసాదితుడై తిరిగివచ్చి యెట్టి దైవుల చేత నైనను యెవ్వరి చేతనైనను చావని వరము గలవాడగుటచేత, వర గర్వ దర్పితుడై పదునాల్గు లోకములను క్షోభ పెట్టసాగెను. అంత నా హిరణ్య కశిపునకు ప్రహ్లాదు డను పేరుగల పుత్రు డుదయించి విష్ణుభక్తుడై, తండ్రిని వ్యతిరేకింప హిరణ్యకశిపు డతని జంపించుట కెన్నియో ప్రయత్నములు సల్పి విఫలుడై తుదకు విష్ణు వెందున్నాడో జెప్పుమని బాధింపగా, విష్ణువు సర్వత్రా నున్నాడని ప్రహ్లాదుడు దెలిపెను. అందుల కా హిరణ్యకశ్యపుడు సభా మండపమున గల స్తంభమున నున్నాడా ? యని ప్రశ్నింపగా ప్రహ్లాదుడు నిస్సందేహముగా యీ స్తంభములో విష్ణువున్నా డనెను. హిరణ్యకశ్యపుడు స్తంభమును గదతో వ్రేయ స్తంభము పగిలి నరసింహాకారముతో విష్ణు వుద్భవించి హిరణ్యకశ్యపుని సంహరించెను. ఇదియే నరసింహావతారము.

వామనావతారము:-

విష్ణు భక్తుడైన ప్రహ్లాదుని మనుమడు బలిచక్రవర్తి. అతడు దానముల యందును, యజ్ఞములయందును పేరొందిన వదాన్యుడు. బల శౌర్యములచేత అమరేంద్ర సింహాసనము నాక్రమించుకొని బలిచక్రవర్తి యను పేరు బడయ గలిగెను. బలిని బంధించి మే లొనర్చుటకై విష్ణువు అదితి-కశ్యపులకు జన్మించి వామనుడను పేరొంది బలిచక్రవర్తి యజ్ఞశాల కేగి మూ డడుగుల భూమి దాన మడుగ బలిచక్రవర్తి వామనునకు మూ డడుగుల భూమిని దానమివ్వగా, వామన రూపుడగు విష్ణువు ఒక పాదమున భూమిని గప్పి రెండవ పాదమున

వియత్పథము నావరించి మూడవ పాదమును బలిచక్రవర్తి తలపై మోపి పాతాళమున కణగద్రొక్కి దేవతలకు తోడ్పడిన యవతారము వామనావతారమని చెప్పుదురు.

పరశురామావతారము:-

విష్ణువు జమదగ్ని మహర్షికిని, రేణుకాదేవికిని పరశురాము డను పేర జన్మించి, తండ్రిని హింసించిన హైహయుల చక్రవర్తియగు కార్తవీర్యార్జునుని మరియు నతని సుతుల సంహరించి, ఇరువది యొకటవసారి భూప్రదక్షిణము జేసి క్షత్రియరాజుల సంహరించుటలే పరశురామావతారము.

శ్రీరామావతారము :-

రామాయణ యితివృత్తము సర్వజన వేద్యమైనది. ఈ యితిహాసమును కొద్దియో గొప్పనో తెలియని హిందువుడు లేడనియే జెప్పవచ్చును. రామాయణము శ్రీరామచంద్రుని కథను దెలుపు గ్రంథము. రామ జననము, విశ్వామిత్ర యజ్ఞరక్షణ, పితృవాక్య పరిపాలనకై రాము డరణ్యమున కేగుటయు, సీతాపహరణము, సుగ్రీవ హనుమజ్జాంబవదాదుల స్నేహము, సేతు బంధనము, రావణ సంహారము, రామ పట్టాభిషేకము, రాముడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ జేసిన క్రమము విపులముగా వాల్మీకి మహర్షి రచించెను. త్రేతాయుగమున శ్రీ మహావిష్ణువు చతురంశములచేత దశరథ మహారాజు ముగ్గురు భార్యలకు రామ భరత లక్ష్మణ శత్రఘ్న నామములతో కౌసల్య, కైక, సుమిత్రలకు జనించుటలే రామావతారము.

కృష్ణావతారము:-

శ్రీ మహావిష్ణువు ద్వాపరయుగంలో లోక కంటకులగు కంసాది రాక్షస సంహారార్థము బందిశాలలో ఉన్న దేవకి వసుదేవుల గర్భమున జన్మించి, యాదవ వంశమును పునీతముజేసి, పాండవ పక్షపాతియై, దుర్యోధన వంశ నిర్మూలితుడై అర్జునునకు భగవద్గీత మహోపదేశము జేసి, అనన్య రాజకీయ చతురులన సహితము చకితులనుజేయు మహాద్భుత కార్యము లొనర్చి దేశమున గ,

దుర్మార్గులను రూపుమాపిన రాజయోగియే శ్రీ కృష్ణ పరమాత్మ, అతని పవిత్ర చరిత్రమే శ్రీకృష్ణావతారము

*బుద్ధావతారము:-*

బుద్ధుడు కపిలవస్తు పుర భర్తయగు శుద్ధోధన మహారాజు కుమారుడు. మాయాదేవి కొడుకు. ఇతని మొదటి పేరు సిద్ధార్థుడు. ఇతని గురువు విశ్వామిత్రుడను పేరు గలవాడు. ఇతనికి చెన్నుడను మిత్రుడొకడుండెను. ఇతడు యశోధర యను పేరుగల యువతిని పెండ్లి జేసుకొనియెను. ఒక పుత్రుడు గూడ జన్మించెను. ఒకనాడు సిద్ధార్థుడు పురమును జూచుటకై చెన్ను నితో సహా బయలుదేరినపుడు, ముందెన్నడు ముదిమి, చావు, రోగములు జూచి యెఱుగని రాజకుమారుడు ఒక ముదుసలి వానిని. మరియు ఒక రోగిష్టిని మృత కళేబరమును జూచి చలించి లోకము సమస్తము నశించునదియే దీనికింత భ్రాంతి జెంది తరతమ విభేదములతో పోట్లాడి తాపత్రయపడి జీవించుట అవివేకమని దృఢ నిశ్చయుడై, వైరాగ్యశీలుడై అర్ధరాత్రివేళ రాజ్య భోగములను భార్యాపుత్రులను సహితము వదిలి బుద్ధిని శాంతిని వెదుకుచు అరణ్యములలో దిరిగి యఖండ తప మాచరించి సిద్ధిబొంది విశ్వమానవ కళ్యాణమునకై శ్రమించి, ప్రేమ, విశ్వాసము, అహింస, కర్తవ్య నిర్వహణము, సర్వమానవ సమానత్వ ములను ప్రపంచమునకు చాటిచెప్పినదే బుద్ధావతారము. ఈ యవతారముగూడ విష్ణువుదేయని దెలుపుదురు.

*కలికి యవతారము:-*

కలియుగాంతమున భగవంతుడగు విష్ణువు ఒక గుఱ్ఱపు రౌతు రూపమున రాగలడనియు, అప్పుడు పాతకులు శిక్షింపబడి, పుణ్యాత్ములు రక్షింపబడుదు రనియు కలికి యవతారమును గూర్చి చెప్పుదురు.

అవతారములు పది యని జెప్పుచు, కడపటి రెండవతారముల యెడల కొన్ని వివాదాస్పదములను కనబరతురు. హిందువులు పైన కనుబరచిన పదిం టిలో యెనిమిది యవతారములను మాత్రము నిరభ్యంతరముగా నమ్ముచుందురు. ఇట్టి యవతార పరంపరలు వీటికి సంధించిన మనోరంజకములైన కథల వంటివి మరే యితర మతములలో గానబడవు. రామాయణ మహాభారత భాగవత గ్రంథ

ములు దశావతారములను క్షుణ్ణముగా దెలుపునవియేగాక యుత్కృష్ట నీతి బోధకములు. కాని వీటిని హిందువులలోనే చాలామంది నమ్మక వివాద పడుతుండుటలు గలదు.

## హిందూ మతములోని వర్ణములు, అస్పృశ్యతను గూర్చిన వివరణము

మీ రింతవరకు హిందువుల ముఖ్య గ్రంథములు వారి మూలపురుషులగు దేవతాదులను గూర్చి తెలుసుకొన గలిగితిరి. ఇక హిందూ సమాజములో వర్ణవ్యవస్థయు, నిమ్నోన్నతములను తెలుసుకొనుట ముఖ్యము. ఒకరిలో నొకరు హెచ్చుతగ్గులును, అంటరాని తనమును పాటించుట, వేదాది గ్రంథములం దెచ్చటనైనను కానరాదనుట నిర్వివాదాంశము. వర్ణ భేదములును, అంటరానితనమనునవి వేదవేదాంతములలో లేవను విషయము స్పష్ట పరచుటకై సామవేదీయ వజ్రసూచికోపనిషద్ ప్రబల నిదర్శనమై యున్నది, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర యనునవి మానవ గుణ కర్మ స్వభావములేగాని, యవి కులములు జాతులు గావని తెలుపుటకు వజ్రసూచికోపనిషద్ ప్రధాన పాత్ర వహించినది. భగవంతుడగు విష్ణువు దశావతారములను ధరించుటకు గల కారణము దీనులను, సుజనులను రక్షించి హింసను శోషణను రూపుమాపుటకే ననియు పురాణములు సహితము స్పష్టముగా ఘోషించుచున్నవి. దంభాహంకార భరితులగు కుల మదాంధులకై రక్షణ కల్పించి, కుల హీనులను బాధించినట్లు పురాణములలో నెచ్చటను లిఖింపబడి యుండలేదు. వేదములలో వర్ణ వ్యవహారమే కానబడదు. వేదములకు వక్రభాష్యము సృష్టించి స్వప్రయోజనమునకై సమాజమును బలి గావించిన కొందరు కుక్షింభరులు ఋగ్వేద, యైతరేయ, పురుషసూక్త మంత్రావళిని మరొక రూపమున ప్రవచించి దేశానికి తీరని నష్టము గలిగించు చీలికలు దెచ్చిపెట్టి యుందురని నమ్ముటకు చాలినంత యాస్కారము లభించుచున్నది. పురుషసూక్త మంత్ర భాగమునుగూర్చి మనము తెలుసుకొనుట ముఖ్యము.

తైత్తిరీయారణ్యక- బ్రహ్మమేధే పురుసూక్తమ్- అని వ్యవహరింపబడు-

వేదసూత్రముల యందలి వాక్యములను సందర్భానుగుణముగా నిచట వివరించు దమైనది.

ఓం సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః స్సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులం.

*    *    *

బ్రాహ్మణోఽస్యముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత.

విశ్వవిరాట్స్వరూపుడైన పరమేశ్వరుడు వేయి శిరములు గలవాడును, వేయి కన్నులును వేయిపాదములు గలవాడైయున్నాడు. ఈ యావద్భూమి వలయమును విస్తరించి పది యంగులములై యున్నాడు. ఇతనికి బ్రాహ్మణులు ముఖమైయున్నారు. క్షత్రియులు బాహువులు, మరియు వైశ్యులు తొడలై యుండి శూద్రులు పాదములై యున్నారనియు "అజాయత"యను పదమువలన బుట్టినారు అను అర్థమువచ్చును కనక వీ రీ విధముగ విరాట్పురుషునకు జనించిరనియు యర్థమిచ్చును. మన మీ మంత్రమునకు లాక్షణికార్థమునే గ్రహించవలయును గాని, వాస్తవికార్థమును బోల్చుకోగూడదు. ఏలనన? సర్వవ్యాపి యగు పరబ్రహ్మము వేయి శిరస్సులు, వేయి పాదములు, వేయి కన్నులు గలవాడై యుండి భూమి నంతటను నావరించినవాడై కేవలము పది యంగుళముల మేరకు యెత్తుగలవాడై యున్నా డనునది వాస్తవికతకు చాలా దూరమైన విషయము. వేయి శిరస్సు లున్నవానికి వేయి కన్నులే యున్నట్లు తెలుపబడి యున్నది. వేయి శిరస్సులున్నవానికి తలకు రెండేసి చొప్పున రెండువేల కన్నులుండవలయునేగాని వేయి కన్నులుండు టెట్లు పొసగును? వేయి శిరములున్న రెండువేల కాళ్ళుండ వలయును; వేయి కాళ్ళుండుట యాక్షేపింపదగిన విషయమైయున్నది. వీటన్నింటికి యీ పరాత్పరుడు వేయి శిరములున్న వానివలె సమస్తము దెలుసుకొను వాడనియు, వేయికన్నుల వానివలె సమస్తమును జూచు వాడనియు, వేయి కాళ్ళున్నవానివలె సకల వ్యాపకుడనియు మనము దీనిని అలంకారికముగా గుర్తించి యర్థము జేసికొనవలసియున్నదే గాని, యదార్థమని నిశ్చయించుకొనగూడదు.ఇటులనే బ్రాహ్మణులు ముఖమునుండి రాజులు బాహుల

నుండి, వైశ్యులు తొడలనుండి, శూద్రులు పాదములనుండి బుట్టిరని తెలుపుటల గూడ వాస్తవముగాదు, ఆ విశ్వరూపునకు వీరు ముఖము, బాహులు, తొడల కాళ్ళ లాంటి వారని లాక్షిణికముగా గుర్తించవలయును. ఈ శ్రుత్యర్థము విపుల పరచి యోచించినచో వేదాదులను పఠించి తపోనియమాదులచే ప్రకాశించు బ్రాహ్మణులు, ముఖముచే వేదపఠన స్తోత్రాదులు జేయువారు గావున వీర ముఖమువంటి వారనియు, క్షత్రియులు బాహువులచే పరాక్రమించి శత్రువుల జయించి రాజ్యముల నేలుటచే బాహువులవంటి వారనియు, ఒకచోటనే స్థిరముగ గూర్చుండి వ్యాపారములు జేయువారు గనక తొడలవంటివా రనియు, పిక్క బల మున దూరస్థ ప్రదేశములకు వెళ్ళి సేవకాది వృత్తులను జేయుటచే శూద్రుల పాదముల వంటి వారనియు సమాజ వ్యవస్థీకరణ కొరకు వారు జెప్పియుందుర ఇట్టి పురుష సూక్తార్థమును అపసవ్యముగా చిత్రించి బ్రాహ్మణులు పెద్దవా నియు క్షత్రియులు వారికంటె తక్కువయని, వైశ్యులు వీరికి లోబడియుం వలయు ననియు, శూద్రులు పాదములవంటి వారగుటచే తక్కిన వారం రికి సేవకులని స్వప్రయోజనపరులు సమాజమును శాసన బద్ధము జేసి యుం రనియు తెలియుచున్నది.

ఈ పురుషసూక్తమునే సాకుగా గొని పరమేశ్వరునకు ఆకార మున్నద నిర్ణయించుకొని విగ్రహములను జెక్కి,దేవాలయములను నిర్మించి విగ్రహారాధ మములు లోకి దెచ్చియుందురని తోచుచున్నది. ముఖమునుండి బ్రాహ్మణు పాదములనుండి శూద్రులు బుట్టిరను లాక్షణికార్థము యథార్థమని విశ్వసిం వర్ణభేదములను సృష్టించి తదనుగుణ్యముగా వృత్తులను నిర్దేశించి వాటిని శాస రీత్యా ఒక్కొక్క వర్గమునకు కేటాయించి బ్రాహ్మణాది వర్ణ చతుష్టయమ నిర్ణయించిరని నమ్ముటకు ఆస్కారమేర్పడుతున్నది.

ఈ పురుషసూక్తమునే ఆధారము జేసుకొని వర్ణభేదముల నిర్ణయించుట గాక అప్పటి పరిపాలనా సౌకర్యార్థము స్మృతులను లిఖించి ఆ స్మృతు మూలమున రాజ్య తంత్రమును నడుపుచువచ్చిరి. స్మృతు అనగా ఆ కాలం లోని రాజ్యాంగ చట్టములు. వీటిని నాటి క్షత్రియరాజులు తమ యధికారము "స్థిరోభవ వరదోభవ" యొనర్చుకొనుటకు బ్రాహ్మణాదులచే యిది వేదవిహి మగు ధర్మ మనుకొని ప్రజలు భ్రమజెందునట్లు స్మృతులు వ్రాయించిరి ఇ

బల పరాక్రమ వంతులగు క్షత్రియరాజుల ప్రాబల్యమునకు లొంగిపోయిన వేద విదులగు బ్రాహ్మణులు క్షత్రియుల ప్రీత్యర్థము స్మృతులు లిఖించిరి. దీనివలన బ్రాహ్మణులకు భిక్షాటన తప్ప రాజ్యాధిపత్యము రాలేదు. బ్రాహ్మణులు వస్తుతః విద్యావ్యాసంగములపై ఆధారపడి బ్రతికేవారు గాన వారు ప్రాణాలను పణముగా నొడ్డి యుద్ధముజేయు స్వభావము గలవారుకారు. అందుకే బ్రాహ్మణులకు భిక్షాటన తప్ప మరేదియు లభించలేదు. యాచక వృత్తి నీచాతినీచమైనది. దానిని బ్రాహ్మణులే పలుచోట్ల వర్ణించిరి. క్షత్రియరాజులు బ్రాహ్మణులకు భక్తితో పాదాభివందనముజేసి భిక్ష జేయుటకు సకల వర్ణములవారికి నాదేశించిరి. ఏల ననగా? భిక్షజేయునపుడు బ్రాహ్మణులకు మనోవేదన గలిగేయెడల వారు యీ వృత్తిని వదిలి మరేదైన గౌరవ ప్రదమగు వృత్తిని చేపట్టి పైకి రాకుండగ క్షత్రియాదులు కడు తెలివితో బ్రాహ్మణులను బిచ్చగాండ్రను జేసివేసిరి. క్షాత్రము బ్రాహ్మణ్యము జతగూడి సమాజమును చీల్చి చెండాడి, వారికివృత్తులు నిర్దేశించి స్మృతులను లిఖించి హిందూ సంఘములో అనైక్యతకు బీజావాపనము జేయుటేగాక యీ వృక్షమునకు నీరుబోసి పెంచిరి. ఈ యనైక్యతా వృక్షము రాక్షసి వట వృక్షమువలె పెరిగి శాఖోపశాఖలుగా విస్తరించి యుగయుగములుగా జీవించి యుండుటచే దాని వేళ్ళు పాతాళము వరకు పాతుకు పోయినవనుట లతిశయోక్తి కానేరదు.

అంటరానితన మనునది స్మృతులలోనే మనకు లభిస్తుంది. పురాణేతిహాసములలోను మరికొన్ని స్మృతులలోను చతుర్వర్ణములను గూర్చి తెలుపబడు చున్నదే కాని. అంటరాని వారుగా పంచమ వర్ణమొకటి నిర్ణయింపబడినదని తెలిపి యుండలేదు. అస్పృశ్యులుగా పరిగణింపబడుచు ఊరి కవతల శ్వానసూకరముల కంటె నీచముగా బ్రతుకువారిని గూర్చి విపులముగా వ్రాయబడి యుండ లేదు. పురుష సూక్తమునందు బ్రాహ్మణాది చతుర్వర్ణములను పేర్కొనుచుండు సందర్భమున శూద్రులవరకే తెలియజేయబడి యున్నది. కాని ఈ దురదృష్ట వంతులగు పంచములను గూర్చి వ్రాయబడలేదు. వీరికి యిదమిత్థమైన వృత్తి నిర్దేశ్యముగూడా గావింపబడి యుండలేదు. ఐతే ఈ పంచములను వారెవరు; వీరి యునికి హిందూ సంఘములో నెట్లు గలిగియున్నదనే ప్రశ్నకు ప్రత్యుత్తర మెవ్వరును చెప్పలేకున్నారు.

వేదములలో దస్యులను వారినిగూర్చి వర్ణింపబడియున్నది. దస్యులు వేదవిహిత కర్మలకు వ్యతిరేకులనియు, వారు ఆర్యులను బాధించువారనియు, వారి బారినుండి తమను గాపాడుమని పరమేశ్వరుని స్తోత్రములు జేసిన విధానము గలదు బహుశః వేద ధర్మపరాయణులు క్రమేపి తమ ప్రాబల్యమును బెంచుకొని దస్యులను వారలను ఊరి కవతలనుంచి వీరికి అస్పృశ్యతను ఆపాదించి అంటరానివారుగా వీరిని పరిగణించిరని రూఢిగా దోచుచున్నది. ఈ దస్యులే హిందూ సంఘములో జండాలులై రనుట సుస్పష్టమైన విషయము.

కొందరు ద్రావిడులను జాతినిగూర్చి చెపుతూ, దస్యులని వేదములో సూచించబడినవారే ద్రావిడులని నుడివెదరు. నేడు మనము భారతదేశమని పిలుచుచున్న యీ భూభాగముపై, పూర్వము ద్రావిడులే నివసించెడి వారనియు వారిపైకి ఆర్యులు దండెత్తివచ్చి వారిని ఓడించిరనియు జెప్పుట కలదు. ఈ యార్యులు మధ్య ఆసియానుండి సింధూ నదిని దాటి వచ్చిరని జెప్పుటకలదు. ఈ వాద మొకరీతిగా నిజమని దోచినను యిది సరియైన వాదము కాదని జెప్ప వచ్చును. ఈ వాదమునే నిజమని నమ్మినచో ఆర్యు లనువారు మహమ్మదీయుల వలె ఆంగ్లేయులవలె బయటినుండి వలస వచ్చినజాతి యని విశ్వసించవలసి వచ్చును. ఆర్య ద్రావిడ జాతులనే ద్విజాతి సిద్ధాంతమును లేవదీసి, హిందూ సమాజమును వర్గ వైమనస్యమున మరింత రెచ్చగొట్టి పరస్పర కలహములను స్వజాతి పోరాటములను లేవదీయుటకై ఇది ఆంగ్లేయులు పన్నిన పన్నాగమని తోచుచున్నది.

ఆర్య ద్రావిడ సిద్ధాంతమును కూలంకషంగా పరీక్షించినచో ఆర్యుల ద్రావిడుల వేదములు ఒకటే యని మనకు స్ఫురించకపోదు. ద్రావిడులు యజుర్వేద మందు గనుపరచిన బలులు మొదలైనవి యాచరింతురు. ద్రావిడు లనువారు పురాణములలో తెలుపబడు శంకరుని పూజింతురు. వీరినే రాక్షులని పురాణములలో వర్ణించిరి. హిరణ్యకశ్యపుడు, రావణుడు మొదలగువారు రాక్షసులని పురాణములు వర్ణించెను. వీరినే దస్యులని బహుశః వేదములు వర్ణించి యుంత వచ్చును. ఈ దస్యులను పంచములని రానురాను గణనలోకి తెచ్చియుందురని నమ్మకము గల్గుచున్నది. వేద ధర్మానుచరణములో ద్వివిధ శాఖలనే ద్వివిధ జాతులుగా జెప్పియుందురనుట సుస్పష్టము. ఈ యార్యావర్తమున దక్షిణదేశ

మొకటి గలదు. దీని నైసర్గిక విధానము ననుసరించి భాషా భేదము లుండుటచే ఆర్యద్రావిడు లనియెడు సిద్ధాంతము ఆంగ్లేయ పాలకులు లేవదీసిరని దోచుచున్నది. వీ రనునట్లు ఆర్య ద్రావిడుల మధ్య పోరాటములు జర్గినమాట వాస్తవమే యైనను ఇవి శాఖాభేదములపై జరిగిన యుద్ధములేగాని వలస రాజ్యముల మధ్య జర్గిన పోరాటములు కావు. ద్రావిడుల రాజు రావణుడు చతుర్వేద పారంగతుడు. ద్రావిడ దేశమున గల ఒక కిరాతకుడు వాల్మీకి యను పేరుబడసి రామాయణమును వ్రాయగలిగెను. సాంస్కృతిక పునాదులలోగల మౌలిక విషయములయందును- వేద పఠనమందును వీరికి వ్యత్యాసము కనుబడుట లేదు, కాని వీరిది యుద్ధమున ఓడిపోయిన శాఖ గావున ఆర్యరాజులు వీరిని అణచివేసి యూరి కవతలకు గెంటివేయ గలిగిరని మన మూహించుకొనుటకు సౌలభ్య మేర్పడుతున్నది. ఈ శాఖనే పంచమ శాఖగా పరిగణించిరని తోచుచున్నది. వీరే యంటరాని వారుగను నీచ చండాలాది నామములతో వ్యవహరింపబడిరి. యుగముల తరబడి యీ జాతి ప్రజలు కంకాళములై కదలుచు శీతాతప బాధల కోర్చుచు దుర్భర కష్టముల ననుభవించుచు వచ్చిరి. ఈ పంచమ వర్ణమునుండి బ్రహ్మ ఋషులుగూడా యుదయించగలిగిరి.

ఈ పంచమాది వర్ణములనుగూర్చి స్మృతులలో వ్రాయబడియున్నది. స్మృతులు లిఖింపబడిన పిదపనే చతుర్వర్ణముల నిమ్నోన్నతములను పంచమ జాతినిగూర్చిన అస్పృశ్యతయు నిర్దేశించబడెను. వేదశాస్త్రేతిహాస పురాణములలో అంటరాని తనమును గూర్చిన పట్టింపులుగాని యాచరణగాని వ్రాయబడియుండలేదని ముందే దెలుపనైనది. స్మృతుల యందు అంటరాని తనమును గూర్చి విపులముగా దెలుపబడియున్నది.

## స్మృతుల వివరణము

స్మృతులు నాల్గు. వీటిని మనుస్మృతి, గౌతమస్మృతి, శంఖలిఖి స్మృతి పరాశరస్మృతి యని జెప్పుదురు.

స్మృతుల విభజన యుగములను బట్టి జరిగెను.
కృతయుగమునకు- మనుస్మృతి

త్రేతా యుగమునకు- గౌతమ స్మృతి
ద్వాపరయుగమునకు- శంఖలిఖి స్మృతి
కలియుగమునకు- పరాశర స్మృతి

పైన సూచించిన స్మృతులు క్షత్రియరాజులు తమ పరిపాలన సౌలభ్య మునకు వ్రాయించిరి. ఇక పరాశరస్మృతి కలియుగమునకై లిఖింపబడినదిగా జెప్పుదురు. ఈ పరాశర స్మృతిలో మాల మాదిగజాతికి దండనలు వీరిని ముట్టుకొంటే మైల పడుదు మను విషయములు వాటికి ప్రాయశ్చిత్తములు లిఖింపబడియున్నవి.

పరాశరస్మృతిలో లిఖింపబడిన ఘోరదారుణమైన వ్రాతలు కొన్నిటి నిచట నుదహరించటమైనది.

శ్లో॥ చండాలం హతవా న్కశ్చిత్ బ్రాహ్మణో యది కంచన
ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్రం గోద్వయం దక్షిణాం దదత్ ॥
(పరాశరస్మృతి పాపప్రాయశ్చిత్తకాండ 19)

బ్రాహ్మణుడు మాలవానిని జంపినచో ఒక ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించి రెండు గోదానము లొనర్చిన పరిశుద్ధుడగును అని తాత్పర్యము.

దీనితో బ్రాహ్మణులు మాలమాదుగులను జంపి నరహత్యాపాతకమునకు గురియౌటలటుంచి మాలవారిని జంపినందుకు మైలబడి ప్రాయశ్చిత్తము జేసుకొని పరిశుద్ధులుగావలసి వస్తుందట దీనికి ఒక ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించ వలెనని తెలుపబడియున్నది.

ప్రాజాపత్యకృచ్ఛ్రమనగా మూడు దినములు ఉదయమందు భుజించి మూడు దినములు సాయంకాలము, మూడు దినము లయాచితముగా లభించిన దానిని భుజించి మూడు దినము లేమియును దినకుండ నుపవసించుటకు ప్రాజా పత్యకృచ్ఛ్రమని యందురు.

శ్లో॥ శ్వపాకం వాపి చండాలం విప్రః సంభాషతే యది
ద్విజైస్సంభాషణంకుర్యా త్సావిత్రీం తు సకృజ్జపేత్.
(పరాశరస్మృతి -ప్రాయశ్చిత్తకాండ 22)

షడంగవేత్తయగు బ్రాహ్మణుడు మాదిగవానితో గాని మాలవానితోగాని మాటలాడిన యెడల ఆ దోషము తొలగిపోవుటకు దైవజ్ఞులగు (జ్యోతిష్యాదులు తెలిసినవారు) బ్రాహ్మణులతో వెంటనే సంభాషించిన పవిత్రుడగును తక్షణమే. యట్టివారు దొరకని యెడల గాయత్రి మంత్రమును ఒకమారు జపించవలయును.

శ్లో॥ చండాలైస్సహ సుప్తం తు త్రిరాత్ర ముపవాసయేత్
చండాలైకపదంగత్వా గాయత్రీ స్మరణాచ్ఛుచిః ॥
(పరాశరస్మృతి - ప్రాయశ్చిత్త- 23).

చండాలునితోడ ఒక్క శయ్యయందు పరుండిన యెడల మూడు దినములుపవసింపవలయును. మాల మాదుగులు నడిచిన మార్గమందు నడిచిన యెడల గాయత్రి మంత్రము జపించిన పవిత్రులగుదురు.

శ్లో॥ చండాలదర్శనే సద్య ఆదిత్యమవలోకయేత్
చండాల స్పర్శనేచైవ సచేలం స్నానమాచరేత్ ॥
(పరా - ప్రాయ - 24)

మాల మాదుగులను జూచిన వెంకటే సూర్యుని జూచిన యెడల ఆ దృశ్య దోషము దొలుగును. వీరిని తాకిన వెంటనే సచేల స్నానము (ఒంటిమీది బట్టల యుక్తముగా) జేసిన పరిశుద్ధులగుదురు.

శ్లో॥ చండాల ఖాతవాపీషు పీత్వా సలిల మగ్రజః
అజ్ఞానాచ్చైకభుక్తేన్యదహోరాత్రేణ శుధ్యతి ॥ (పరా - ప్రా - 25)

మాలవాడు త్రవ్విన బావియందలి జలమును బ్రాహ్మణు డజ్ఞాన వశమున ద్రాగిన యెడల (అనగా తెలియక త్రాగినచో)ఒక యహోరాత్ర ముపవసించిన పవిత్రు డగును.

శ్లో॥ చండాల ఖాండ సంస్పృష్టం పీత్వా కూపగతం జలమ్
గోమూత్ర యావకాహార స్త్రి రాత్రా చ్ఛుద్ధి మాప్నుయాత్ ॥
(పరా - ప్రా - 26)

మాలవాండ్రు కుండలుంచిన బావియందలి జలమును త్రాగినవాడు

మూడు దినములు గోమూత్రము త్రాగి యవలపిండిని భుజించిన పవిత్రుడగును

శ్లో॥ చండాల ఘట సంస్థంతు యత్తోయం పిబతి ద్విజః,
తత్క్షణాత్క్షిపతే యస్తు ప్రాజాపత్యం సమాచరేత్. (పరా - ప్రా - 2

అజ్ఞానవశమున మాలవాని కుండయందలి జలమును త్రాగిన పిదప చండాలుని కుండయని దెలిసినచో ఆయుదకమును వెంటనే వమనము జే ఒక్క ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించిన పవిత్రుడగును.

శ్లో॥ యది నోత్క్షిపతే తోయం శరీరే యస్య జీర్యతే,
ప్రాజాపత్యం నదాతవ్యం కృచ్ఛ్రం సాంతపనం చరేత్ ॥

ఆ విధముగా త్రాగిన నీరును వమనముజేయగా యది బయల్వెడల లోపలనే జీర్ణించునెడల వానికి ప్రాజాపత్యకృచ్ఛ్రమనే ప్రాయశ్చిత్త విధి చాలదు దానికంటె గొప్పదగు సాంతపనకృచ్ఛ్రము నొనరించినగాని శుద్ధుడు గాజాలడు సాంతపన కృచ్ఛ్రమనగా : గోమూత్రము, గోమయము, గోక్షీరము, పెరుగు నేయి, కుశోదకము (గడ్డితో పవిత్ర మొనర్చిన నీరు) దీనిని క్రమముగా నొక్కొక్క దినము భుజించి యేడవనాడు యేమియు దినక యుపవాసముండ వలయును దీనినే సాంతపన కృచ్ఛ్రమందురు.

శ్లో॥ చరే త్సాంతపనం విప్రః ప్రాజాపత్య మనంతరః
తదర్థంతు చరేద్వైశ్యః పాదం శూద్ర స్తదాచరేత్ ॥

మాలవాని నీరు తెలిసి త్రాగిన యెడల బ్రాహ్మణుడు సాంతపన కృచ్ఛ్రము నాచరించవలెను. మాలవాని నీరుద్రాగిన క్షత్రియుడు ప్రాజాపత్య కృచ్ఛ్రము నాచరించవలయును. వైశ్యుడు మాలవాని నీరు త్రాగిన యెడల ప్రాజాపత్య కృచ్ఛ్రమును సగము నాచరించవలయును. మాలవాని బావినుండి గాని, కుండలోనుండిగాని శూద్రుడు నీరు త్రాగినచో ప్రాజాపత్య కృచ్ఛ్రములో నుండి ఒక పాదమును ఆచరించిన పరిశుద్ధులగుదురు.

శ్లో॥ చండాలీం వా శ్వపాకం వా అనుగచ్ఛతి యో ద్విజః
త్రిరాత్రముపవాసిత్వా ప్రాజానామను శాసనాత్ ॥

సశిఖం వపనం కృత్వా ప్రాజాపత్య ద్వయంచరేత్,
గోద్వయం దక్షిణా దద్యాచ్ఛుద్ధిం పారాశరోఽబ్రవీత్ ॥

(పరాశరస్మృతి)

చండాల స్త్రీతోగాని, శ్వపాకితోగాని (అనగా మాలదానితోనైనను మాదిగ దానితోనైనను(సంగమించిన బ్రాహ్మణుడు) బ్రాహ్మణుల యాజ్ఞానుసారము మూడు దినములు ఉపవాస మొనర్చి శిఖాసహితముగా క్షవరము జేసికొని ప్రాజాపత్యద్వయము నాచరించి గోద్వయమును దక్షిణగా నిచ్చిన పరిశుద్ధు డగును.

శ్లో॥ శ్వపాకీం వాథ చండాలీం శూద్రోవా యది గచ్ఛతి,
ప్రాజాపత్యం చరే త్కృచ్ఛ్రం చతుర్గోమిథునం దదేత్.

(పరాశర స్మృతి)

శూద్రుడు చండాల స్త్రీతోగాని, శ్వపాకితోగాని (మాలమాదిగ జాతి స్త్రీలతో) సంగమించిన యెడల ప్రాజాపత్యకృచ్ఛ్ర మాచరించి గోమిథున చతుష్టయమును (నాల్గు జతల ఎద్దులను ఆవులను)దానమిచ్చిన పరిశుద్ధు డగును.

ఇచ్చట మనకు స్మృతులవలన సూచించిన కొన్ని ప్రాయశ్చిత్తములు చదువుటకు నవకాశము లభించినది. మాల మాదిగల నెంత నీచాతినీచముగా స్మృతులు పేర్కొనినవో మనము తెలుసుకొనగలిగితిమి. సవర్ణుడు చండాలులను జంపి శిక్షలు దండనలు పొందుటకు బదులుగా, వ్రతములు ఉపవాసములు జేసి పరిశుద్ధు డగుటకై శాసనము లాజ్ఞాపించినవి. కుక్కలు మొదలగు నీచ జంతువులను జంపినవారికి ప్రాయశ్చితములు పేర్కొనబడి యుండలేదు. కాని మనుష్యులై స్వదేశీయులైన స్వకీయ సమాజాంతర్గతులైన తోటి మానవుల జంపినందుకు మైలపడి ప్రాయశ్చిత్తము జేసుకొనవలయునని స్మృతులు నిర్దేశించినవి.

ఈ స్మృతిని పరాశరుడు వ్రాసినట్లు జెప్పుదురు. ఇది యతనిచే వ్రాయబడినది గాదనియు, దీనిని పరాశరుని పేరుతో నెవరో వ్రాసి ప్రచురించియుండవచ్చునని తోచుచున్నది. పరాశరాది ఋషు లెచ్చటనేగాని. ఆది గ్రంథములలో అంటరాని వారిని గూర్చిన విధులు తెలియజేసినట్లు కానరావటము లేదు,"శ్వపాకీగర్భ సంభూతో పితా వ్యాసస్య సత్తమః" అని భవిష్యత్ పురాణములో

వ్రాయబడియున్నది. అనగా- మాదిగదాని కడుపున వ్యాసునితండ్రి యగు పరాశర మహాఋషి బుట్టినాడని తెలియజేయబడినవి. మన మీ విషయమును పరీక్షించి చూడగా శ్వపాకీగర్భ సంభూతుడగు పరాశరుడు శ్వపచులనుగూర్చి యిట్లు వ్రాయునా? యను సందేహము జనించును. మరికొంత తరచి చూచిన యెడల మహాఋషుల పేరుతో యివి మధ్యవర్తులు వ్రాసిన స్వార్థ పూరితములగు వ్రాతలని తేటపడగలదు.

ఇట్టి స్మృతుల మూలముననే హిందూమతము అప్రతిష్ఠ పాలైనది. స్మృతు లనియెడు రాజ్యాంగములు సృష్టించి సార్వభౌమాధికారాలు తమ గుప్పిట్లో బెట్టుకొని క్షత్రియులు పరిపాలన సాగించియుండినందున వాటి చెడు ఫలితములను నేటికిని మన మనుభవించుచున్నాము.

కావున మనలో స్మృతుల విషయము తెలియనివారు యీ తప్పిదమును వేదశాస్త్ర పురాణేతిహాసములకు నంటగట్టి దూషించుచుందురు. పురాణములు భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి ధర్మములను బోధించునట్టి ఉత్తమ గ్రంథములు వీటిలో కొన్నింటికి పరస్పర వైరుధ్యము లున్నప్పటికి యీ గ్రంథములు పఠన యోగ్యములై యున్నవి. వీనియందు క్రూర కఠోరములగు వ్రాతలు, వ్రాయబడి యుండలేదు. పురాణములలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనెడి నాల్గు వర్ణములను గూర్చియు, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసము లనియెడు నాల్గు విధముల యాశ్రమములను గూర్చియు తెలిపియున్నారు, భారతేతిహాసములో గల భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు స్పష్టముగా "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" అని సెలవిచ్చియున్నారు. గుణకర్మ విభాగములచే మనుజులను చతుర్వర్ణములుగా విభజన జేసితినని తెలిపియున్నాడు.

మరియు మహాభారతములోగల ఆరణ్య పర్వమున వైశంపాయనుడు జాతి వర్ణ భేదములను గూర్చి యిట్లు దెలిపియున్నాడు.

శ్లో॥ న కులేన న జాత్యా వా క్రియాభి ర్బ్రాహ్మణో భవేత్
చండాలోపి హి వృత్తస్థో బ్రాహ్మణ స్సయుధిష్ఠిర
ఏకవర్ణ మిదం పూర్ణం విశ్వమాసీ ద్యుధిష్ఠిర
కర్మక్రియా విశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్॥

సర్వే వై యోనిజా మర్త్యాః సర్వే మూత్రపురీషిణః
ఏకేంద్రి యేంద్రియార్థశ్చ తస్మాచ్ఛీలగుణై ర్ద్విజః
శూద్రోపి శీల సంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్
బ్రాహ్మణోపి క్రియాహీనః శూద్రా త్ప్రత్యవరో భవేత్
న జాతి ర్దృశ్యతే రాజన్ గుణాః కల్యాణకారకాః
జీవితం యస్య ధర్మార్థం పరార్థే యస్య జీవితం.

"కులము చేతను, పుట్టుకచేతను, ద్విజుడు గాడు. కార్యములచేత బ్రాహ్మణుడగును. ఓ యుధిష్ఠిరా! మంచి నడవడి గలవాడు చండాలుడైనను వాడే భూసురుడు. ఓ ధర్మనందనా! ఈ ప్రపంచ మేకవర్ణముతో నిండి యున్నది. కర్మక్రియా విశేషములచేత చతుర్వర్ణములు ప్రతిష్ఠింపబడినవి. నరులందరు యోనినుండి బుట్టినవారే. అందరును మూత్ర పురీషములు గలవారే. ఏక విధములగు యింద్రియములు వాటి ప్రయోజనము కలవారే. కావున సదాచార సద్గుణములచేత నెవడేగాని ద్విజుడగును. శూద్రుడైనను సదాచార సంపన్నుడు, గుణవంతు డగువాడు బ్రాహ్మణుడగును. బ్రాహ్మణుడైనను క్రియాహీనుడు తక్కువ వాడగును. ఓరాజా! జాతియం దేమియులేదు. గుణములే కళ్యాణ దాయకములు. ఎవని జీవితము ధర్మార్థమును పరోపకారము నగునో వాడే బ్రాహ్మణుడు" అని పై శ్లోకముల తాత్పర్యము.

అంతేగాక సామవేదీయ వజ్రసూచికోపనిషత్తులో-బ్రాహ్మణత్వ మున్నదే గాని బ్రాహ్మణజాతి లేదని తెలియజేయబడినది. ఉపనిషత్తులు వేదములనుండి దీయబడిన సారాంశములు. కావున నిచట పాఠకుల సౌకర్యమునకై వజ్రసూచికోపనిషత్తు నుదహరించటమైనది.

శ్రీ గురుభ్యోనమః. హరిః ఓమ్

## సామవేదీయ వజ్రసూచికోపనిషత్తు

శ్లో॥ యజ్ జ్ఞానా ద్యాన్తి మునయో బ్రాహ్మణ్యం పరమాద్భుతమ్.
తత్త్రైవ పరబ్రహ్మ తత్త్వ మహమస్మీతి చిన్తయే.
ఓం ఆప్యాయం త్వితి శాన్తిః

శ్లో॥ సచ్చిదానంద రూపాయ సర్వధీవృత్తి సాక్షిణే
నమో వేదాన్త వేద్యాయ బ్రహ్మణేనంతరూపిణే.
ఓం వజ్రసూచీం ప్రవక్ష్యామి శాస్త్ర మజ్ఞాన భేదనమ్
దూషణం జ్ఞాన హీనానాం భూషణం జ్ఞాన చక్షుషామ్.

"బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రా ఇతి చత్వారో వర్ణా స్తేషాం వర్ణానాం బ్రాహ్మణ ఏవ ప్రధాన ఇతి వేద వచనానురూపం స్మృతిభిరప్యుక్తమ్, తత్ర చోద్యమస్తి, కో వా బ్రాహ్మణో నామ, కిం జీవః, కిం దేహః, కిం జాతిః, కిం జ్ఞానం, కిం కర్మ, కిం ధార్మిక ఇతి,

తత్ర ప్రథమో జీవో బ్రాహ్మణ ఇతిచే త్తన్న, అతీతానాగతానేక దేహానాం జీవస్యైక రూపత్వాత్, ఏకస్యాపి కర్మవశా దనేక దేహసంభవా త్సర్వ శరీరాణాం జీవస్యైక రూపత్వాచ్చ, తస్మా న్న జీవో బ్రాహ్మణ ఇతి, తర్హి దేహో బ్రాహ్మణ ఇతి చే త్తన్న, ఆచండాలాది పర్యంతానాం మనుష్యాణాం భౌతికత్వేన దేహస్యైకరూపత్వా జ్జరామరణ ధర్మాధర్మాది సామ్యదర్శనాత్, బ్రాహ్మణ శ్శ్వేతవర్ణః, క్షత్రియో రక్త వర్ణః, వైశ్యో పీతవర్ణః, శూద్రః కృష్ణ వర్ణ ఇతి నియమాభావాత్. పిత్రాది శరీర దహనే బ్రహ్మహత్యాది దోష సంభ వాచ్చ,తస్మా న్న దేహో బ్రాహ్మణ ఇతి, తర్హి జాతి ర్బ్రాహ్మణ ఇతిచే త్తన్న, తత్ర జాత్యంతర జంతు ష్వనేకజాతి సంభవాత్, మహర్షయో బహవ స్సంతి, ఋష్యశృంగో మృగః, కౌశికః కుశాత్, జంబుకో జంబుకాత్, వాల్మీకో వల్మీ కాత్, వ్యాసః కైవర్త కన్యాయామ్, శశపృష్ఠా ద్గౌతమః, వసిష్ఠ ఊర్వశ్యామ్, అగస్త్యః కలశజాత ఇతి శ్రుతత్వాత్, ఏతేషాం జాత్యా వినా ప్యగ్రే జ్ఞానప్రతి పాదితా ఋషయో బహవస్సంతి తస్మాన్న జాతి ర్బ్రాహ్మణ ఇతి, తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతిచే త్తన్న. క్షత్రియాదయోపి పరమార్థ దర్శినోఽభిజ్ఞా బహవ స్సంతి తస్మా న్న జ్ఞానం బ్రాహ్మణ ఇతి, తర్హి కర్మ బ్రాహ్మణ ఇతిచే త్తన్న సర్వేషాం ప్రాణినాం ప్రారబ్ధ సంచితాగామి కర్మ సాధర్మ్య దర్శనాత్ కర్మాభి ప్రేరితాస్సంతో జనాః క్రియాః కుర్వంతీతి. తస్మా న్న కర్మ బ్రాహ్మణ ఇతి చే త్తన్న క్షత్రియాదయో హిరణ్యదాతారో బహవ స్సంతి,తస్మా న్న ధార్మికో బ్రాహ్మణ ఇతి తర్హి కోవా బ్రాహ్మణోనామ.

యః కశ్చి దాత్మాన మద్వితీయం జాతి గుణ క్రియా హీనం షడూర్మి షడ్భావేత్యాది సర్వదోష రహితం, సత్యజ్ఞానానందానంతరూపం స్వయం నిర్వికల్ప మశేష కల్పాధార మశేష భూతాంతర్యామిత్వేన వర్తమాన మంతర్బహిశ్చాకాశవ దనుస్యూత మఖండానంద స్వభావ మప్రమేయ మనుభవైక వేద్య మపరోక్షతయా భాసమానం. కరతలామలకవ త్సాక్షాదపరోక్ష కృత్య కృతార్థాయా కామరాగాది దోషరహిత శమదమాది సంపన్నో భావ మాత్సర్య తృష్ణాశా మోహాదిరహితో దంభాహంకారాదిభి రసంస్పృష్టచేతా వర్తతే, ఏవ ముక్త లక్షణ స్స ఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతి స్మృతి పురాణేతిహాసానా మభిప్రాయః, అన్యథా బ్రాహ్మణత్వ సిద్ధి ర్నాస్త్యేవ,

సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మ భావయేదాత్మానం సచ్చిదానందం బ్రహ్మ భావయే దిత్యుపనిషత్.

ఓం ఆప్యాయం త్వితి శాంతిః

*ఇతి వజ్రసూచికోపనిష త్సమాప్తా*

ఓం తత్సత్.



వజ్ర సూచికోపనిషత్తును, శాస్త్ర జ్ఞానమును సూచించుదానిని, జ్ఞాన చక్షువులను ప్రసాదించి అజ్ఞాన తిమిరమును పోగొట్టుదానిని జెప్పుచున్నాను.

మనకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనియెడు నాల్గు వర్ణములు గలవని తెలియుచున్నవి. వీరిలో బ్రాహ్మణుడు ప్రధానమైన వాడని వేద వచన రూపములైన స్మృతులు జెప్పుచున్నవి. ఇది వినినప్పుడే విషయము మన కాశ్చర్యకరముగా దోచును. బ్రాహ్మణు డనగా నెవడు? అత డెట్లు జీవించును? అతని దేహ మెట్లుండును? అతని పుట్టుక యెట్టిది? ఆతని జ్ఞాన మెట్టిది? ఆతని కర్మ లెట్టివి? అతని ధర్మము లెవ్వి? అను ప్రశ్నలు మనలో నుదయించును.

ప్రప్రథమములో జీవుడే బ్రాహ్మణుడుగాని అతని దేహములు బ్రాహ్మణములు గావని యనుకొనుటకు వీలులేదు. జీవుడే బ్రాహ్మణుడైన యెడల

అనేక దేహములలో (అనగా కుక్క నక్కలలో) బుట్టుచుండుట చేతను అనేక దేహములలో మెలగి పూర్వ కర్మలచేత జనన మరణములను నానా యోనులతో బుట్టుటకు లోనైనందున జీవుడు బ్రాహ్మణుడు కాడని రూఢిగా దెలియుచున్నది. ఐతే దేహమే బ్రాహ్మణుడు అను ప్రశ్న ముదయించును.

దేహము బ్రాహ్మణు డెన్నటికి కాజాలడు. దేహమే బ్రాహ్మణుడైతే చండాలాది పర్యంతముగల దేహములన్నియు పంచభూతములచేతనే నిర్మింప బడియున్నవి; వాటి తత్వములన్ని ఒక రీతిగా సమానములై యున్నవి. ఈ దేహములన్నిటికి జనన మరణములన్నియును సమానములే; ఈ దేహముల యవ తారములన్నియు ఒకేరీతి ప్రయోజనమును గన్పర్చుచున్నవి.

బ్రాహ్మణుడు తెల్లనివాడుగాను, క్షత్రియుడు యెఱ్ఱనివాడుగాను. వైశ్యుడు పచ్చనివాడుగాను, శూద్రుడు నల్లనివాడుగాను నుండునని ఖచ్చితములైన నియమములు లేవు. బ్రహ్మహత్యజేసిన తండ్రి శరీరము దహించిన కొడుకుకు అట్టి హత్యాదోషము కొంతవరకు సంక్రమించుచున్నందున దేహములు పరిశుద్ధ ములును, బ్రాహ్మణానుకూలములు గాజాలవు ఐతే పుట్టుక (జాతి) బ్రాహ్మణము గా వచ్చునను ప్రశ్న యుద్భవించును. ఎట్టి పరిస్థితులలో జాతి బ్రాహ్మణము గాజాలదు. కొన్ని సందర్భములలో జంతుజాతులలో మనుష్యు లుదయించిరి. ఉదాహరణకు ఋష్యశృంగుడు జింకకడుపున బుట్టెను. కౌశికుడు గడ్డిమోపులో బుట్టెను. జంబుక మహాఋషి నక్క కడుపున బుట్టెను. వాల్మీకి పుట్టలో బుట్టెను. వ్యాసమహర్షి బెస్తదానికి బుట్టెను. కుందేలునకు గౌతముడు బుట్టెను. వసిష్ఠ మహర్షి ఊర్వశికి బుట్టెను. అగస్త్య మహర్షి కుండలో బుట్టెను. అని శ్రుతులు దెల్పుచున్నవి. జాతి విహీనులైనవారు చాలామంది జ్ఞానాధికులైన మహాఋషులై వెలసిరి. అందుచేత జాతిచేత బ్రాహ్మణుకు కాజాలడని తెలియు చున్నది. ఐతే జ్ఞానము గలవాడు తెలివితేటలు కలవాడు బ్రాహ్మణుడని తెలుసు కొన వచ్చునా?

జ్ఞానమునుగూర్చి యాలోచించినచో క్షత్రియాదులలో అమేయ జ్ఞాన సంపన్ను లుదయించిరి. అందువలన కేవలము జ్ఞానవంతులే బ్రాహ్మణులు గాజాలరు. ఐతే కర్మ బ్రాహ్మణత్వమును సూచించునా?

కర్మ బ్రాహ్మణత్వము నెన్నటికి సూచించజాలదు. ప్రాణులన్నిటికి భూత భవిష్యద్వర్తమాన కర్మలుండును. (ఆగామి సంచిత ప్రారబ్ద) ఈ కర్మ లందరియందు కనబడును. కావున కర్మప్రేరితులు సుఖదుఃఖముల ననుభవించు చుందురు. అందువలన పూర్వకర్మ ఫలానుభవమువలన బ్రాహ్మణుడు కాజా లడు. సత్కర్మ నిరతులైన హిరణ్య దాతలెందరో క్షత్రియులలోగూడా జన్మిం చిరి. కాబట్టి ధర్మకార్యాచరణములు జేసినంత మాత్రమున బ్రాహ్మణుడు గాజా లడు.

ఐతే మరి బ్రాహ్మణు డెవడు?

బ్రాహ్మణు డనగా ఆత్మవేద్యుడైన,అద్వితీయుడైన, గుణక్రియారహితు డైన, షడ్భావ, షడూర్మి వికారదూరుడైన, సత్యజ్ఞానానంద అనంతరూప విలాసుడైన, స్వయం నిర్మితుడైన, నిర్వికల్పుడైన, సర్వభూతాత్ముడైన, సర్వాంతర్యామియగు, పరబ్రహ్మమును ఆకాశమువలె సర్వవ్యాపియైన యా దేవదేవుని చేతిలోని యుసిరికాయ చందమున, స్వానుభవైక్య సాధనచేత సిద్ధిం చుకొని, కృతార్థుడై కామరోషరాగాది వికార గుణ దూషితుడై శమదమాది సద్గుణ సంపన్నుడై ఆశాతృష్ణాభావమాత్సర్యములను వదిలి సర్వసముడై మెలగువాడే బ్రాహ్మణుడు "బ్రహ్మ మెఱిగినవాడే బ్రాహ్మణుండు" అనునట్లు ఇట్టి లక్షణ సంపన్నుడు పుట్టుకచేత యెవడేగాని, వాడే బ్రాహ్మణుడు జాతిచేత బ్రాహ్మణుడు గాడు- బ్రాహ్మణత్వము సాధనచేత సిద్ధించునుగాని, పుట్టుకతో బ్రాహ్మణత్వము సిద్ధించదు. అని వజ్రసూచికోపనిషద్ సారాంశము.

బ్రాహ్మణునిగూర్చి మహాభారతమునం దిట్లు లిఖింపబడి యున్నది.

సీ. ఎవ్వడు సత్యంబు నెప్పుడు బల్కు హిం
సా విదూరుఁడు గురుజన హితార్థి
ఇంద్రియంబుల నోర్చి నెల్లవారల దన
యట్ల కాజూచు ధర్మాభిరతుడు
కామంబు దగులండు కర్మంబు లారును
సముచిత సంప్రయోజ్యత నొనర్చు

నట్టి పుణ్యాత్ముని ననఘ బ్రాహ్మణు డని
యనిశంబు కీర్తింతు రమరవర్యు
లార్జవంబు శమము నధ్యయనంబును
పరమ ధనము సువ్వె బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగు సాధనంబులు
వేదవిహిత ముఖ్యవిధులు నెనయె.

(మహాభారతము - ఆరణ్యపర్వ పంచమాశ్వాసము-24వ పద్యం)

---

# హిందూ ధర్మము

## చతుర్థాశ్వాసము

హిందూధర్మ సిద్ధాంతములను మూడు విధములుగా జెప్పుదురు.

1. అద్వైతము 2. విశిష్టాద్వైతము 3. ద్వైతము.

ఈ మతమునకు రాను రాను అనేక శాఖ లుదయించినవి. అనేక ప్రవక్తలనేక విధముల ప్రవచనములు జెప్పిరి. కాని వీటిలో ముఖ్యమైనవి త్రివిధ సిద్ధాంతములనియే జెప్పుదురు. ఈ త్రివిధసిద్ధాంతములకు సిద్ధాంతకర్తలు గలరు. అద్వైత సిద్ధాంతము శ్రీ శంకరాచార్యులవారిచే నిర్ణయింపబడెను. విశిష్టాద్వైత సిద్ధాంతము శ్రీ రామానుజాచార్యులవారిచే నిర్దేశింపబడెను. ద్వైత సిద్ధాంతము శ్రీ మధ్వాచార్యులవారిచే ప్రకాశింపబడెను.

### -: అద్వైతకర్త శ్రీ శంకరాచార్యుల చరిత్రము :-

శ్లో॥ నారాయణం పద్మభవం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్ర మదాస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మదాస్య పద్మ
పాదం చ హస్తామలకంచ శిష్యం
తం తోటకం వార్తికకార మన్యా
నస్మద్గురూన్ సంతత మానతోస్మి॥

అనగా నారాయణుడు, బ్రహ్మ, వసిష్ఠులు, శక్తి, పరాశరులు, వ్యాసులు, శుకులు, గౌడపాదులు, గోవిందయోగి, శంకరాచార్యులు, పద్మపాదులు, హస్తామలకులు, తోటకులు, వార్తికకారులు ఇట్లు అద్వైత గురు పరంపరలు జెప్పబడియున్నవి.

హిందూధర్మవాదులు శ్రీ శంకరాచార్యులను గూర్చి యీ విధముగా చెలుపుదురు.

"భూలోకమున సన్మతము అడగి దుర్మతములు వ్యాపించి యుండగా దేవతలు కైలాసమునకుబోయి పరమ శివుని ప్రార్థించిరి. అంత యీశ్వరుడు ప్రసన్నుండై కుమారస్వామినిజూచి యిట్లనియె. భూలోకమున విష్ణువు సంకర్షణమూర్తియై యవతరించి దేవతాకాండమును వృద్ధిచేయుచున్నాడు. ఆదిశేషుడు పతంజలియై యవతరించి యోగకాండమును వృద్ధిజేయుచున్నాడు. గావున నిప్పుడు నీవు భూలోకమున కుమారిలభట్టువై యవతరించి జైమిని సూత్రమును వృద్ధినొందించుమని జెప్పెను. ఇట్లు కుమారస్వామి కాదేశించుటేగాక, ఇంద్రుని సుధన్వుడను రాజై యవతరించునట్లును, బ్రహ్మదేవుని మండనమిశ్రుడై యవతరించునట్లును అనుజ్ఞ జేసెను. ఇట్లే ఇంద్రుడు సుధన్వుడై పుట్టి భూలోకమేలుచుండెను. బ్రహ్మదేవుడు మండనమిశ్రుడై యవతరించి భట్టపాదులకు (కుమారిలభట్టులకు) శిష్యుడాయెను. భట్టపాదులు నాస్తికులను జయించుచు సుధన్వుని యొద్దకుబోయి యచ్చటగల బౌద్ధము మొదలగు నాస్తికమతములను జయించి కర్మకాండమును లోకమున స్థాపించుచుండిరి.

ఇట్లుండగా "కేరళ" మను మలయాళ దేశమున వృషభాచలమునందు పూర్వవాహినీ తీరమున శశలమనెడి కాలటి యగ్రహారంబున విద్యాధినాథులనెడి వారి కొక పురుష సంతతి కలిగెను. ఆ బిడ్డకు శివగురుస్వామియని నామకరణము జేసిరి. ఆ శివగురు క్రమక్రమముగా వృద్ధినొంది సకల కళాప్రవీణుడై మహాపండితుని కుమార్తెయైన ఆర్యాంబను పెండ్లాడెను. తర్వాత శివగురుస్వామి సంతానములేక మిగుల పరితపించుచు పరమేశ్వరుని గూర్చి తపము చేయుచుండగ వారి కోర్కె దీర్చుటకును, కైలాసవాసుడు లోకోద్ధరణమొనర్చ నవతరించుటకును తలిదండ్రులు శివగురుస్వామి ఆర్యాంబలని యెంచి వారికి క్రీస్తుశ. 677 అనగా కలియుగము మూడువేల యేబది ఎనిమిదవ సంవత్సరమునకు సరియగు ఈశ్వర నామ సంవత్సరము, వైశాఖ మాసము శుక్లపక్ష పంచమి భానువారము ఆర్ద్రానక్షత్రమునయం దవతరించిరి.

ఇట్లవతరించిన నా శిశువును నొక నా డొక గొప్ప సర్పము వచ్చి చుట్టుకొనెను. మరియొకనాడు శిశువు కనబడకుండగా తలిదండ్రులు చింతా

క్రాంతులై యుండ ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి ఆర్యాంబను వారింటనుండు గుమ్మడికాయ నిమ్మనగా నాయమ దాని నీయగా నాత డా గుమ్మడికాయను నేల మీద బడవేసెను. అప్పు డా శిశువు నేలబడి పగిలిన గుమ్మడికాయలోనుండి బయటకి వచ్చెను. మరియు నా శిశువుయొక్క హస్తములయందు త్రిశూలాది చిహ్నములు మెఱయుచునుండెను. శిరమునందు జల మూరుచుండెను. ఇట్టి శిశువును సాక్షాచ్ఛంకరుడని యందరును నెంచుచుండిరి. ఇవ్విధముగా శంకరులు భూలోకమున నవతరించినందుచే వారిని సేవించు నిమిత్తమై మహావిష్ణువు మొదలగు దేవతయి భూలోకమున నవతరించిరి. ఎట్లన? విష్ణువు పద్మ పాదాచార్యులుగాను, వాయువు హస్తామల కాచార్యులుగాను, అగ్ని తోటకాచార్యులుగాను, బ్రహ్మదేవుడు సురేశ్వరాచార్యులుగాను అవతరించిరి, సురేశ్వరాచార్యులకు విశ్వరూపాచార్యులనియు, మండనమిశ్రు లనియు, వివరణాచార్య లనియు పేర్లు గలవు. ఇట్లే దేవతలందరు భూలోకమున నవతరించిరి. సరస్వతీదేవి విష్ణుమిశ్ర భట్టాచార్యులకు పుత్రియై జన్మించి మండన మిశ్రులను వరించెను. మండన మిశ్రులవద్ద భూలోకమున జన్మించిన దేవతలు విద్యాభ్యాసము జేయుచుండిరి,

ఒకనాడు శంకరాచార్యులవారి తండ్రియగు శివగురుస్వామి, పూజచేసి బిల్వమాలిక శివలింగమునకు సమర్పించి యింటికివచ్చి చూచిన ఆ బిల్వమాలిక తన కొడుకు కంఠమున విరాజిల్లుచుండెను. అప్పుడు లింగాంతర్గతుండగు సాక్షాచ్ఛంకరులు నా యింట జననమందెనని తెలుసుకొని భయభక్తులతో మెలగుచుండెను. శిశు రూపములోనున్న శంకరులు అనేక అద్భుతములు గనుపరచిరి. ఈ బాలకుడు రెండవ సంవత్సరముననే అకారాది అక్షరము లుచ్చరించుచు నెవరేది యడిగినను స్వయముగా ప్రత్యుత్తరములు జెప్పుచుండిరి. మరియు లౌకిక వైదిక విద్యలన్నింటిని మూడవ యేటనే నేర్చిరి. ఆ మూడవయేట వీరి తండ్రియగు శివగురుస్వామి శంకరులకు ఉపనయనము గావించి పరలోకగతులైరి. అది మొదలు "భవతి భిక్షాం దేహి" యను వాక్యము చొప్పున భిక్షాన్నమును భుజించుచు నిత్యకర్మానుష్ఠానములను నెరవేర్చుకొనుచుండగా నొకనాడు అయాచితదీక్షితులను నొక బీద బ్రాహ్మణునింటికి భిక్షకై బోయిరి. అయాచిత దీక్షితులు పేదరికముచే బాధ పడుచుండుట జూచి శంకరులు లక్ష్మీదేవిని ప్రార్థించి అయాచిత దీక్షితులకు ధనము ననుగ్రహించిరి. శంకరులు యేడవ

సంవత్సరమునందు పరబ్రహ్మోపాసనము జేయుటయం దత్యంతాసక్తి గలవారై యుండగా దుర్వాస మహర్షి చనుదెంచి అష్టాంగయోగాదుల నుపదేశించిరి. ఇట్లుండ మలనాటియందు రాజ్యముజేయు సత్యవర్మయను రాజు తనకు పుత్రలాభము కలుగుటకు శంకరులను సేవించి సంతానము ప్రసాదించుడని ప్రార్థించిన శంకరులు ప్రసన్నులై పుత్రలాభము గలుగునట్లు దీవించిరి.

తర్వాత ఉపమన్యు, దధీచి, గౌతములు, అగస్త్యులు మొదలగు మునీశ్వరులు వచ్చి శంకరులకు సకల విద్యలను బోధించిరి. కొన్నాళ్ళకు తల్లియగు ఆర్యాంబ శంకరులకు వివాహము గావింపదలచి అగస్త్యాది మహర్షులనుగూర్చి, 'నా కుమారుడు వివాహంబై సత్పుత్రుని బడయగలడా?' యని యడుగ నప్పుడగస్త్యమహర్షి ఆర్యాంబను జూచి నీ కుమారరత్నము లోకాచార్యుడై వెలయగలడు గాని సంసార బంధనమునం దగులుకొన డనగా ఆర్యాంబ చింతాక్రాంతురాలై యుండెను.

అంత కొన్ని దినములు గడచి చనగ శంకరులు సన్యాసమును స్వీకరింప దలచి తల్లికి విన్నవింప నామె అంగీకరింపక దుఃఖించుచుండెను. అప్పుడు శంకరులు తల్లికి సంసార తాపత్రయములలోగల బాధలు విశదీకరించిరి. ఐనను తల్లి కొడుకు సన్యాసాశ్రమ స్వీకృతికి సర్వథా విముఖయై యుండెను. ఇట్లుండగా నొకనాడు నారదులును, దత్తాత్రేయులును, శంకరులకు విష్ణుతత్త్వోపదేశము గావించి చనిరి. ఆ దినముననే యమధర్మరాజువచ్చి శంకరులను స్తుతించెను. మరునాడుదయమున తల్లితోడ శంకరుడు నదికింబోయి స్నానము చేయుచుండగా శంకరుల పాదమును మొసలి పట్టుకొనెను. అప్పుడు శంకరులు తల్లిని జూచి యిప్పుడు నేను మొసలి నోటజిక్కి చావబోవుచున్నానుగాన, ఈ సమయముననైనను నాకు సన్యసించుటకు, అనుమతి యొసగుమనగా, ఆర్యాంబ యేమియు దోచక నీవు గోరినట్లు సన్యసించియైనను బ్రతికిన చాలునుగాని, మొసలి నోటనుండి నీవు విడువబడుటలే నాకు గావలసినదని దుఃఖభారముచే పలికెను. ఆ తర్వాత శంకరులు దాని నోటినుండి విముక్తుడై వచ్చి, కొన్ని దినములకు విధ్యుక్త ప్రకారముగా వైశాఖ శుద్ధ ద్వాదశి దినమునందు సన్యసించిరి. అనంతరము శంకరులు తల్లిని జూచి అమ్మా! నేనిపుడు సన్యాసిని గాన సంచారము జేయుటకై బోయెదను. నీవు గృహమునకుం జనుమన నామె పుత్రు

వాంఛచే మిగుల దుఃఖింపగా శంకరాచార్యు లిట్లనిరి: "తల్లీ ! గృహంబున వలసి నంత ధనమున్నది. నీకు అవసానకాలము సంప్రాప్తించెనేని నాకు దెలియజేసి నచో నేను జేయవలసిన కార్యములను జేసెదనని వచించి తల్లిచే ననుమతిబడసి యచ్చోటగల కృష్ణస్వామి యాలయమున నివసించిరి. ఆ రాత్రియందు స్వామి సాక్షాత్కరించి నన్ను వేరొకచోట ప్రతిష్ఠ జేయుమనగా, నట్లే ఆ స్వామిని తులసీ వనమున స్థాపించి, యచ్చట భూమియందున్న ధనముచే నాలయమును నిర్మించు నట్లుచటివారల కనుజ్ఞ యొసగి, కృష్ణస్వామి యనుగ్రహమును బడసి ఆచార్యుల నిమిత్తము వెదకుచు ప్రయాణమై పోవుచుండ, నర్మదా తీరమున తపముజేసెడు శ్రీ గోవిందయోగీంద్రులవలన తత్త్వోపదేశమును బడసినదేగాక, వేదవేదాంతయోగాది విద్యలన్నియు గ్రహించి యోగము మొదలగునవి యభ్య సించుచుండగా, చాతుర్మాస్యము సమీపించినంత నావ్రతమును నర్మదా తీరము నందే యచ్చటగల పెద్దలతోడ నా వ్రతమనుష్ఠించుచు వేదతత్త్వార్థ విచారము జేయుచుండ నొకనాడు నమిత వర్షము కురిసి ప్రవాహము అధికముగా రాగా అచ్చటగల పెద్దలందరును భయకంపితులైన శంకరులు తమ "కమండల" మును భూమియందుంచినంత ప్రవాహజలమంతయు నా కమండలములోనే యిమిడి యణగారెను. అపుడచటి యోగీశ్వరులాదిగాగలవారందరును శంకరా చార్యులను వినుతించిరి. ఆ తర్వాత కాశీక్షేత్రమునకువచ్చి, పన్నెండువేల పండితులచే నుతింపబడుచునుండగా బిందుమాధవస్వామి స్వప్నమున సాక్షాత్క రించి, రేపు నీకు శిష్యుడొకడు రాగలడని యానతిచ్చి యంతర్ధానమొందెను. ఆ మరునాడే అహోబిలమునుండి యొక బ్రాహ్మణుడు శంకరాచార్యులను సేవించి శంకరుల వలన పద్మపాదాచార్యులని పేరు బడసిరి. కాశీ క్షేత్రమున శంకరా చార్యులు అద్వైతమును బోధించుచుండగా ఆరువేల ద్వైతులు అద్వైత మత మున ప్రవేశించిరి. గోవిందపాదులు శంకరాచార్యుల కొసంగిన శ్రీ కైలాస చంద్రమౌళీశ్వరలింగము, గణపతి, శ్రీచక్రము, నవగ్రహయంత్రము, నృసింహ సాలగ్రామము, వీనిని పద్మపాదాచార్యుల కొసంగిరి. ఇట్లుండ నొకనాడు విశ్వనాథస్వామి చండాలవేషముదాల్చి శంకరాచార్యుల సమీపమునకురాగా ఆచా ర్యులు వానిని జూచి దూరముగా బొమ్మన నా చండాలుడు ఆత్మవిషయమై సమ భావము వహింపవలయునని చెప్పగా ఆచార్యులు వాని మాటకు సంతోషించి వానిని ప్రశంసించి "మనీషాపంచక"మను గ్రంథమును రచింప చండాలుడు నిజ

రూపము ధరించినంత ఆచార్యుల కానందముప్పొంగి "శివాత్మ పూర్ణానుభవస్తోత్ర మంజరి" అను గ్రంథమును రచించి వినుతించిరి. అప్పుడు విశ్వనాథస్వామి నాయంశమే నీవని వచించి యద్వైతము నుపదేశించిరి. ఆమీద శంకరులు సనందాది శిష్యులతోడ బదరికాశ్రమమునకుబోయి నారాయణాశ్రమముజేరి నారాయణ మునినిజూచి బ్రహ్మసూత్రములకు వ్యాసమహాముని యభిప్రాయము నెఱుగంగోరి వచ్చితి ననగా నారాయణముని శంకరులనుగని మీరు రచించు భాష్యము వారికి సమ్మతముగ నుండుననిరి. అట్లే శంకరులు తన పదహారవయేట బ్రహ్మసూత్ర భాష్యము మొదలగు అనేక గ్రంథములను రచించి శిష్యులకు బోధించిరి. ఇట్లు శంకరభగవత్పాదులు తన పదహారవ సంవత్సరములోనే అనేక గ్రంథములను రచించిరి. బదరికాశ్రమమునంగల అనేక మునులు శిష్యులై వేదాంతార్థములను దెలుసుకొనుచుండిరి, వారందరిలోను పద్మపాదాచార్యులు శంకరులకు ముఖ్యశిష్యులై యుండిరి. అనంతరము పద్మపాదాది శిష్యులతోడ బదరికాశ్రమమునుండి కాశికి రాగా అఘోర, రసేశ్వర, మృగేంద్రనాథ, భైరవ, అర్హతాది ఇరువది యేడుగురు మతస్థులు అద్వైతమునుగూర్చి శంకరులతో వాదించి తుదకు పరాజితులై అందరును అద్వైత మతము నవలంబించిరి. ఆ మీద శంకరులు శైవ. వైష్ణవ, శాక్త, గాణాపత్య, సౌర, కాపాల మతస్థులకు గల భేద వాదములను బోగొట్టి పంచాయతన, అభేద, సగుణ నిర్గుణోపాసనములు బోధించిరి. మరియు కాశియందు ఇరువదినాల్గువేల మంత్ర భాష్యమును శంకరాచార్యుల యొద్దను, పద్మపాదాది శిష్యులయొద్దను పఠించిరి.

ఇట్లుండ నొకనాడు శారీరకమీమాంసా భాష్యమును శంకరులు శిష్యులకు బోధించి శాంతి జేసిన యనంతరము సిద్ధ బ్రాహ్మణ రూపముతో వ్యాసుల వారు జనుదెంచి బ్రహ్మ సూత్రములలో కొన్నింటికి తాత్పర్యమును జెప్పుడన, శంకరులు చెప్పగా, వ్యాసులు సంతోషించి నిజస్వరూపమును ధరించినంత వ్యాసులను శంకరులు స్తుతించిరి. అప్పుడు వ్యాసులు వ్యాఖ్యానసింహాసనాచార్యాద్యనేక బిరుదము లొసంగి దీవించి చనిరి.

తర్వాత శంకరులు శిష్యులతోడ ప్రయాగకుపోయి త్రివేణి సంగమమున స్నానముచేసి భట్టపాదులను పోయి చూచి నపుడు, భట్టపాదులు బౌద్ధ గురువు యొద్ద విద్యాభ్యాసముచేసి అతనితో అద్వైతమే సత్యమైనదని వాదించి అట్టి

గురు నిందాపహరణార్థమై తుషాగ్ని జేసుకొని దాని యందు ప్రవేశించి దహింపబడుతుండగా, శంకరులు—"విప్రశ్రేష్ఠా! ఆత్మహత్య జేసికొనవలదు. నా కమండలపు జలములవలన అగ్నిని జల్లార్చెదను. నా యొక్క భాష్యమునకు వివరణమును గావింపు" డనగా, భట్టపాదులు వీరు శంకరాచార్యులని దెలుసుకొని, వినుతించి, "స్వామీ! తమ భాష్యమును నా శిష్యుడైన ప్రభాకరుని చేతికిచ్చి చదివింపు" డన, నట్లే పద్మపాదులు ప్రభాకరుల చేతికిచ్చి చదివింపగా భట్టపాదులు విని సంతోషించి, ఇట్టి భాష్యమునకు వివరణము ననావశ్యకము గాన, నిదియే ఆర్యావర్తమున శ్రేష్ఠమై వెలయగలదని వచించిరి. అనంతరము శంకరులు భట్టపాదులు దహింపబడుచున్న అగ్ని యందు జొచ్చి అభయహస్తముచే అతని శరీరమును దట్టి తారక మంత్రము నుపదేశించిరి. భట్టపాదుల శరీరమాద్యంతమును శీతలమయ్యెను. అప్పుడు భట్టపాదులు తమ శిష్యులను జూచి మీరందరును అద్వైత మత మవలంబించి శ్రీ శంకరాచార్యుల అభిమతము చొప్పున ప్రవర్తింపు డని అనుజ్ఞచేసి తారక మంత్రమును జపించుచు షణ్ముఖీ ముద్రను బూని బ్రహ్మ రంధ్రము నాడిచే అర్చిరాది మార్గముగ దేహమును విడిచి పెట్టిరి.

అనంతరము శంకరులు భాగీరథి యందు స్నానముజేసి అక్షయ వటము క్రింద వసించి శిష్యులకు వేదాంతమును బోధించుచుండిరి. కొంత కాలమున కచ్చోటు బాసి, నర్మదా తీరము నందలి మాహిష్మతీ నగరమునకేగి శిష్యుల నొక చోట నుండు నట్లు నియమించి, శంకరులు మాత్రము మండన మిశ్రుని యింటికి జనగా, తలుపులు మూసి యుండెను. అంత యోగాభ్యాసముచేత ఆకాశ మార్గమున మండన మిశ్రుని గృహము లోపలికి బోయిరి. అప్పుడు మండనమిశ్రునికి వేదవ్యాసులును, జైమిని మునియును, పితృకర్మమునకు నిమంత్రితులై వచ్చి యుండుట గని, శంకరులు యిదే సమయమని సమీపమునకు బోగా మండనమిశ్రులకును శంకరాచార్యులకును అగమన ప్రశ్నముల యందే వివాదములు జరిగెను. అట్టి సమయమున మండనమిశ్రులు నేడు పితృకర్మము నెఱవేరు నట్లనుగ్రహింపుడు, రేపు వాదింపవచ్చు ననగా నట్లే కానిమ్మనిరి. మఱునాడు మండనమిశ్రులతో వాదించి వారిని జయించిరి. అప్పుడు సరస్వతి వీణాది సాధనములతో నాకాశమార్గమున సత్యలోకమునకు బోవుచుండగా, శంకరులు దుర్గా మంత్రమును పఠించి ఆయమను పోనీయక బంధించి

పత్నులును సంతోషించి మహావైభవముతో నగరమునకు బోయిరి. శంకరులా నూరుగురు స్త్రీలతో రమించుచుండి, "అమరుక" మను గ్రంథమును రచించిరి. ఇట్లుండగా మంత్రులాదిగాగల వారు అమరకుని శరీరమున నెవరో పెద్దలు ప్రవేశించియున్నా రని తెలిసికొని, ఇక వీరిని విడిచిపెట్ట గూడదని నిశ్చయించి, నెచ్చ టెచ్చట మృత కళేబరములు గన్పించినను వెంటనే వాటిని దహింప వల సిన దని యనుజ్ఞ నొసంగిరి. అట్లే పరిచారకు లచ్చటచ్చట వెదకుచుపోయి శంకరుల దేహము దహింపగా, శంకరులు శిష్యుల వలన జరిగిన వృత్తాంతము నెఱిగి అమరకుని శరీరము విడిచి తమ శరీరములో జొచ్చి కరావలంబస్తోత్రము జేయగా నృసింహస్వామి ప్రత్యక్షమై శంకరులను బయటకు లేవదీసిరి. తర్వాత ఆకాశ మార్గముగా మండనమిశ్రుల యింటికి బోయి సరస్వతిని కలాశాస్త్రము నందు జయించిరి. ఆ మీద మండనమిశ్రులు శంకరాచార్యుల శరణమునుబొంది సన్యాసమును గైకొనగా, శంకరు లతనికి సురేశ్వరాచార్యులని నామమొసంగిరి. అనంతరము శంకరులు శిష్యులతో గూడ శ్రీశైలమునకు వచ్చి శిఖరకలా యంత్రమును ప్రతిష్ఠింపజేసి ద్వైతవాదులను జయించి, ఉగ్రభైరవుని దండించి, యచ్చోటు బాసి మహాబలేశ్వరమను గోకర్ణము, హరిహరము మొదలగు స్థలము లను దర్శించుకొని మూకాంబ క్షేత్రమను కొల్లూరికి వచ్చి యచ్చోట నొక బ్రాహ్మణ పుత్రుని బ్రతికించి మూకాంబను కలారోహణముచే వినుతించి యాదేవి యనుగ్రహమును బొంది యచ్చటికి సమీపమున నుండు శ్రీవల్లీ పురమున భిక్ష చేసికొని యుండిరి.

ఆ యగ్రహారమున ప్రభాకరభట్టులును వారిశిష్యు లనేకులును, శాస్త్ర వేత్తలైయుండిరి. ఆ ప్రదేశమునందలి వారెల్లను ప్రభాకరుల మతమును అను ష్ఠించుచుండిరి. ఆ ప్రభాకరుల కుమారుడు మాటలాడకయు, వినకయు మూగ చెవిటియై యుండెను, ప్రభాకరులు ఆ చిన్నవానిని బిలుచుకొని శంకరుల కడకు జని నమస్కరించి, "స్వామీ! వీనికి ఐదవయేట విద్యాభ్యాసము జేసితిని. వీడు చదువలేనివాడైనాడు. ఇప్పు డెనిమిదవ యేడు గాన ఉపనయనము గావించితిని. అధ్యయనము జెప్పినను వీనికి వినబడదు. వీని చిత్తవృత్తి దెలియకున్నది" యని విన్నపింపగా, శంకరు లా చిన్నవానిని జూచి 'నీవేల యిట్లు జడునివలెయున్నాడ' వనగా- ఆ చిన్నవాడు 'స్వామీ! తమ దర్శనమునకై వేచియుంటి' నని వచించి నదేగాక అద్వైతమును బోధించు పండ్రెండు వాక్యములను అరచేతి యుసిరి

కాయవలె అందరు నెఱింగి యుజ్జీవించునట్లు వచింపగా శంకరులు వారికి హస్తా మలకాచార్యులని నామకరణము గావించిరి. ఆ తర్వాత శంకరులు హస్తామ కులు మొదలగు వారితోడ శృంగగిరికి వచ్చి యచ్చోట శారదాపీఠము వ్యాఖ్యాన సింహాసనము భారతీ సంప్రదాయములను వీనిని స్థాపించి శిష్యులకు సూత్ర భాష్యము నుపదేశించుచు సురేశ్వరాచార్యులకు లోకాచార్యాభిషేకము గావిం చిరి.

అనంతరము శంకరాచార్యులకు అత్యంత ప్రీతిపాత్రులై సేవచేయు చుండిన శిష్యు లొకరికి ఆనందగిరి యని నామ మొసంగిరి. ఒకనాడు శిష్యులు వేదశాంతి పాఠమున కుపక్రమించినపుడు, ఆనందగిరి శంకరాచార్యుల కాషాయ వస్త్రము వుదుకుటకై నదికి పోయినందుచే శిష్యులు కొందరు ఆనందగిరి వచ్చిన మీద పాఠములు చదువుట కుపక్రమింపవచ్చు ననిరి. అప్పుడు పద్మపాదులు జెప్పిన దేమనగా వారెప్పుడు యితర కార్యములయందే యున్నారు గాన, వారు వచ్చునంత దాకా పాఠము లుపక్రమింప రాదా? యన శంకరాచార్యులు ఆనంద గిరికి భక్తియందున పద్మపాదులకు విద్యయందును గల ఆసక్తి దలంచి పాఠము నుపక్రమించిరి. భక్తియుక్తుడైన ఆనందగిరికి సర్వవిద్యలు వచ్చునట్లు శంకరు లనుగ్రహించిరి. తర్వాత ఆనందగిరి వచ్చినమీద నాతనిని కొన్ని ప్రశ్నము లడుగగా, పద్మపాదులకంటెను బాగుగా వివరించి, ఆచార్యులను తోటకవృత్తముల వినుతించిరి కావున ఆనందగిరికి తోటకాచార్యులని మరియొక నామము గలిగెను. మరియొకనాడు సురేశ్వరాచార్యులు ఆచార్యులను జూచి, 'స్వామీః నేనుచేయవలసిన కార్యమేది' యనగా, శంకరులు నా రచింపబడిన భాష్య మునకు వార్తికముజేయున ట్లను గ్రహించిరి. అట్లు ఆచార్యు లనుగ్రహించినను వారు దానిని రచింపలేరైరి. తర్వాత పద్మపాదాచార్యులు బ్రహ్మసూత్రములు ఐదు పాదములకు పంచపాదిక యని వాఖ్యానమును తక్కిన పదునొకండు పాద ములకు వివరణమను పేరుతో వ్యాఖ్యానము రచించిరి. అనంతరము సురేశ్వరా చార్యులు తనకు సూత్రభాష్యమునకు వ్యాఖ్యానముచేయ ప్రాప్తము లేకపోయెనే యని శంకరుల యొద్ద విన్నవింపగా అప్పుడు శంకరులు సురేశ్వరాచార్యులను జూచి మీరింక భూమి యందు యెనిమిది నూర్ల సంవత్సరములు జీవించి తపము చేయుచుండి మరుజన్మమున వాచస్పతి యను పేరుతో భూమియం దవతరించి యావజ్జీమును వ్యాఖ్యానములు రచించుట యందే కాలము గడుపువారై, ఆస్తిక

భాష్యము లారింటికిని వ్యాఖ్యానములు వ్రాసి వాని కన్నింటికిని సిద్ధాంతముగా నాభాష్యమునకు వ్యాఖ్యానమును వ్రాయుడని యనుగ్రహించిరి. ఆమీద పద్మ పాదాచార్యులు తీర్థయాత్రార్థమై గుర్వాజ్ఞను గైకొని బయలుదేరి పోయిరి. కొన్ని దినముల తర్వాత శంకరులు యోగదృష్టిచే తమ తల్లిగారి మరణావసానము నెఱింగి యాసమయమున తల్లికెదురుగబోయి నిలువబడగా, తల్లి శంకరులను జూచి 'నీవే నా కర్మక్రియలను జరుపవలయు'నని జెప్పగా నట్లే తల్లికి యూర్ధ్వదైహిక క్రియలు నెఱవేర్చిరి.

తరువాత శంకరాచార్యులు దిగ్విజయార్థమై బయలుదేరి అచ్చటచ్చటంగల అన్యమతస్థుల జయించుచు శుద్ధాద్వైత మతమును స్థాపించుచు రామేశ్వరము మొదలగు స్థలములను దర్శించుకొని చిదంబరమునకు వచ్చి శివగంగను నిర్మించి కాంచీపురికివచ్చి కామకోటి యంత్రమును ప్రతిష్ఠజేసి, తిరుమలకు వచ్చి ధనకలా యంత్రమును స్థాపించి, మరియు ననేక దేశములకు బోయి స్వమతస్థాపనము జేయుచు గంగాతీరమున నివసించి యుండిరి. అచ్చట చిరంజీవులైన గౌడపాదు లను సిద్ధు లొకరు దర్శనమిచ్చి 'నాకారికలకు నీవు భాష్యము జేసి కృతార్థుడ వైతివి గాన సంతోషించితి'నని చెప్పి ఆకాశమార్గముగ వెళ్లిపోయిరి. అనంతరము శంకరాచార్యులు కాశ్మీరమండలమునగల శ్రీనగరమునకుపోయి యచ్చట దేవర్షులచే నిర్మింపబడియుండు సర్వజ్ఞ పీఠము నధిష్ఠించి, గురుమండలాచార్య పట్టాభిషిక్తులై, ఆచోటు బాసి కేదార క్షేత్రమునకు బోయి యచ్చట నుండు మునులెల్లరకును వేదాంతమును బోధించి తమ యొక్క ముప్పది రెండవ సంవత్సరము ప్రాయమున దేవతలందరు పరివేష్టించి వెంటనంటి రాగ హిమవద్గిరికి జని సమాధిస్థితులైరి.

## అద్వైత సిద్ధాంతము

సత్యమైన పదార్థ మొక్కటియే యున్నది. అది బ్రహ్మము. మిగిలిన పదారములన్నియు మిథ్యా భూతములు. మాయ యనునది బ్రహ్మకల్పితము. బ్రహ్మము మాయతోగలిసి యొక ప్రధాన పురుషుడగును. అగ్నినుండి నిప్పు రవ్వలు బయలుదేరు విధంబున బ్రహ్మమునుండి వివిధమైన చేతన పదార్థములు పుట్టినవి. వస్త్రములందలి దారములు వస్త్రమునకు ముఖ్య కారణమై యుండినట్లు

బాహ్యమైన బ్రహ్మము సమస్తమునకు ముఖ్య కారణమై సమస్తమునందున్నది. అటులనే ప్రతివాని హృదయమందును ప్రకాశించుచున్నది. మానవ హృదయ మందును మాయ నివసించియున్నది. పరమ పురుషుని యందుండు మాయ సత్త్వగుణమునే కలిగియుండి "మాయ = అవిద్య" యను పేర్లచే పిలువబడు చున్నది. జీవుడు అవిద్య యను మాయతో గలిసియుండునంతవరకు తాను సత్త్వపదార్థమునకును, తాను జూచునట్టి యితర పదార్థములకును తాను భిన్న మని భావించును. అవిద్య జ్ఞానముచే నశించును, జ్ఞానమువలన పాపము జేయ కుండుటయు, సంధ్యావందనాది కర్మలు చేయుటయు మొదలుగాగల సత్కృత్యము లలవడును. అవిద్య నశించినచో జీవమునకు బ్రహ్మైక్యము గలుగును. ఇదియే మోక్షము. మాయ ననుసరించి యుండువరకు తనకు కనపడు పదార్థము లన్నియు సత్యములని, నిత్యములని, తలంచి యుండును, ఇట్లు అవిద్యచేత భ్రమింపుచుండుటయే సంసార మనంబడును. తత్త్వ మసీత్యాది వాక్యజన్య జ్ఞానంబు వలన అవిద్య నివర్తించును. ఇదియే మోక్షము.

మరియు నీయద్వైతమునందు ప్రతిబింబ వాదమనియు, అవచ్ఛేద వాద మనియు రెండు విధముల వాదములుగలవు.

ప్రతిబింబ వాదమనగా?

పరబ్రహ్మము అంతఃకరణమున ప్రతిఫలించును. అనగా అద్దములో మనముఖము ప్రతిఫలించునట్లే. ఇట్టి ప్రతిబింబములే జీవులు,

అవచ్ఛేద వాదమనగా?

ఆకాశము సర్వత్ర యేకరీతియే యైనను, యింటియందుండు ఆకాశమునకు అపరాకాశ మనియును, కుండ యందుండు ఆకాశమును ఘటాకాశమనియు వ్యవహరించునట్లు అంతఃకరణములతో నిమిడియుండు బ్రహ్మము జీవు డనబడును. ఇంతేగాక ఏకజీవవాదమనియు అనేక జీవవాద మనియు మరియు రెండు వాదములు కలవు.

ఏకజీవ వాదమనగా?

ఇప్పుడు గోచరమగు సాంసారిక శరీరములో నంతట జీవులువేరు. ఒకా నొక శరీరములో జీవుడున్నాడు. ఆజీవునకు స్వప్నమువలె కల్గినభ్రమయే

యీ సంసారమంతయున్నై యున్నది. ఆజీవునకు ముక్తి గల్గునప్పుడు సృష్టి సమాప్తి యగును. ఇప్పటికి యెవరును ముక్తులైయుండలేదు.

అనేక జీవవాద మనగా?

ఒక్కొక్క శరీరమున కొక్కొకజీవుడు గలడు. ఇప్పటికి కొందరు ముక్తులైరి. ఇకను కొందరు ముక్తులగుదురు. ఈ అద్వైత సిద్ధాంతమును సక్రమముగను విశేషముగను "విచార సాగర" మను గ్రంథమున దెలియదగును.

## అంటరాని తనమును గూర్చి జగద్గురు శ్రీ శంకరాచార్యులు వ్యక్తపరచిన అభిప్రాయము

ఈ యద్వైతకర్త శ్రీశంకరాచార్యులవారు అంటరానివారి యభ్యున్నతిని గూర్చియు, వారిలోగల యథమాథమస్థిని బోదోలుటకు ప్రయత్నించక పోయినను అతడు అస్పృశ్యులయెడ వ్యతిరేకిమాత్రము కాడు. ఆయన యద్వైతవాది యగుటచే జీవులందరు పరబ్రహ్మ స్వరూపులే యనియును, ఆత్మకు యేకత్వ ముండుటచే నొకే పరబ్రహ్మతత్త్వము అన్ని దేహములలో గలిగియున్నదనియు ప్రవచించిరి.

శంకరాచార్యులు బ్రాహ్మణకుల సంజాతులగుటచే పంచములయెడ వారు హేయభావము గలిగియుండిరి. ఒకనాడు శంకరులు కాశీక్షేత్రమునకు బోవు చుండ మార్గమధ్యమున నతని కొకచండాలు డడ్డుపడియెను. చండాల దర్శన ముచే మైలపడితినను భావమున నితడు దారిలోనిలుచున్న చండాలుని కడు కోపముచే మార్గము నుండి తొలిగిపొమ్మని యీసడించిపలికెను. అందులకా చండాలుడు 'స్వామి: తాము అద్వైత కర్తలుకదా? బహుదేహముల యందు నివసించు ఆత్మస్వరూపుడగు దేవుడు ఒకడే యనునది మీ సిద్ధాంతమైనపుడు, దేహేంద్రియాలతో నిమిత్తమేమున్నది? నాదేహస్థుడగు బ్రహ్మము వేరైనపుడు మీ యద్వైతమునకు యీజగతిలో స్థానమేలేదుగదా?' యనెను. అందుకు శంక రాచార్యస్వామి కొంత వరకు చండాలుని వాదము వాస్తవమే యను తలంపున ఆలోచనా నిమగ్నుడైయుండ నా చండాలుడు స్వామిని మరింత సమీపించి యిట్లనియె.

—: శంకర-చండాల సంవాదము :—

చం॥ స్వామీ? శరీరము దేనివలన నిర్మితమైనది.

శం॥ పంచభూతముల వలన.

చం॥ శరీరస్థమగు ఆత్మ యెవరు?

శం॥ పరబ్రహ్మ తత్వాభాసము.

చం॥ ఆ పరబ్రహ్మతత్వము నాలో ప్రవేశించి మలినమైనదా?

శం॥ లేదు. పరబ్రహ్మమున కాస్థితి బట్టజాలదు. అతడు పరమ పవిత్రుడు.

చం॥ అట్లైన యా పరబ్రహ్మమే నాలోనుండి నన్నంటి యున్నపుడు, అతడు మైలపడలేదుగదా? నన్ను జూచినను నన్ను ముట్టుకొనినను పవిత్ర మూర్తులగు తాము మైలపడుదురని భయపడు చుందురేల? అటులైనచో తాము పరబ్రహ్మమున కంటె గొప్పవారా?

శం॥ కాదు నాలోనున్న, నీలోనున్న బ్రహ్మ మొకటే. ఆత్మతత్వ మొకటే యగుటచే అంటరాని తనము మైలపడుదు మనుకొను భ్రాంతి కేవలము భ్రాంతియే. అది సత్యముకాదు. మిథ్య.

అని చండాలునకు శంకరులు చేతులెత్తి నమస్కరించగా నతడు విశ్వనాథుడై ప్రత్యక్షమాయెను. అపుడు శ్రీ శంకరాచార్యులు మనీషా పంచకమును రచించి చండాలుడైనను, సద్బ్రాహ్మణుడైనను నాకు బహ్మతత్వమున కేకత్వము బోధించినవాడే నా గురువని స్తోత్రము జేసెను. ఆ మనీషా పంచక శ్లోకములను దిగువ నుదహరించటమైనది.

## మనీషా పంచకము

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తి త్రీషు స్ఫురతాయా సంవిదుజ్జృంభతే
యా బ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం న.చ దృశ్య వస్త్వితి దృఢ ప్రజ్ఞా హి యస్యాస్తి చేత్
చండాలోఽస్తు స తు ద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ॥

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి త్రివిధావస్థల యందును ఏ పరబ్రహ్మ చైతన్యము మిగుల ప్రకాశించుచున్నదో, ఏ పరమాత్మ చైతన్యము పిపీలి కాది బ్రహ్మ పర్యంతము గల సమస్త శరీరముల యందును యుంటున్న చై సర్వత్ర వ్యాపించి సకల జగత్సాక్షియై వెలయుచున్నదో, అట్టి చైతన్యమే నేను యీదృశ్యవస్తువులు నేనుగాను అనియెడు దృఢబుద్ధి యెవనికి గలదో? అట్టివాడు చండాలుడే యగుగాక, సద్బ్రాహ్మణుడే యగుగాక అతడు నాకు గురుస్వరూపుడని నాదృఢమైన జ్ఞానము (అనగా విశ్వాసము)

శ్లో॥ బ్రహ్మైవాహ మిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయాశేషం మయా కల్పితం
ఇత్థం యస్య దృఢామతి స్సుఖతరేనిత్యే పరే నిర్మలే
చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ॥

తా॥ నేను పరబ్రహ్మమును యీదృశ్య జగత్తంతయు, ఆ పరబ్రహ్మచైతన్య ముచే విజృంభించి భాసించుచున్నది. అంతేగాదు ఈ సమస్త ప్రపంచము త్రిగుణాత్మకమగు నా మాయచే కల్పితమైనది యనెడి దృఢబుద్ధిచే నిత్య అతిశయ, సుఖ స్వరూప, నిర్మల (మాయలేక శూన్యుడగు) పరమాత్మను గుఱించి యెవడు విశ్వసించునో అతడు చండాలుడేగానిండు, సద్బ్రా హ్మణుడు గానిండు అతడే నాగురుసమానుడని నా నిశ్చితాభిప్రాయము.

శ్లో॥ శశ్వన్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచా గురోః
నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజశాంతాత్మనా
భూతం భావి చ దుష్కృత ప్రదహతా సంచిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం త్వవపు రిత్యేషా మనీషా మమ॥

తా॥ ఈ దృశ్యజగత్తంతయు యెల్లప్పుడు నాశన శీలమైనది అని గురూపదేశ ముచే నిశ్చయము జేసికొని, ఈ విధమగు నిశ్చల శాంత చిత్తముతో నిత్యము నిరంతరముగా పరబ్రహ్మ విచారముజేయుచు జ్ఞానాగ్నితో భూత భవిష్య ద్వర్తమాన దుష్కృతములను దగ్ధమొనర్చుకొనుచు నా యీశరీరమును ప్రారబ్ధమునకు అర్పించితినని నా నిశ్చిత మతిని వ్యక్త పరచుచున్నాను.

శ్లో॥ యా తిర్యఙ్నరదేవతాభి రహమిత్యంతః స్ఫుటా గృహ్యతే
యద్భాసాహృదయాక్ష దేహవిషయా భ్రాంతి స్వతో చేతనాః
తాం భాస్యైః పిహితార్కమండలనిభాం స్ఫూర్తిస్సదా భావయన్
యోగీ నిర్వృతమానసో హి గురురి త్యేషా మనీషా మమ॥

తా॥ పశుపక్ష్యాదులయొక్కయు, దేవమానవులయొక్కయు అంతఃకరణమున వెలుగుచు యే పరబ్రహ్మ చైతన్యముచేత దేహేంద్రియాదులకు హృదయమునకు విషయములకు వ్యాపారములు స్వయముగ చైతన్యవంతములై విలసిల్లుచున్నవో, అనగా యే పరబ్రహ్మముచేత జడములగు దేహేంద్రియాదులన్నియు చైతన్యవంతములై ఆయా వ్యాపారములయందు ప్రవర్తిల్లుచున్నవో, ఆ పరమాత్మయే సూర్యమండలమును ప్రకాశింపజేయుచున్నాడనియు, మేఘమండలమును వర్షింపజేయుచున్నాడనియు, అన్నిట వ్యాపించి సూర్యభగవానుని తేజస్సుతో సమానముగ స్వయంప్రకాశితుడౌతున్నాడని నిశ్చయించి ఆ స్వయంజ్యోతి స్వరూప పరబ్రహ్మమును నిరంతరము ధ్యానించుచు సంతుష్టాంతరంగుడగు యోగివరుడైన బ్రహ్మజ్ఞానియే నాకు గురుస్వరూపుడని నా దృఢ నిశ్చయము.

శ్లో॥ యత్సౌఖ్యాంబుధిలేశ లేశత ఇమే శక్రాదయో నిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాంతకలనే లబ్ధ్వా ముని ర్నిర్వృతః
యస్మి న్నిత్యసుఖాంబుధౌ గలితధీ ర్బ్రహ్మైవ న బ్రహ్మవిత్
యః కశ్చిత్ ససురేంద్రవందితపదో నూనం మనీషా మమ॥

తా॥ ఏ పరిపూర్ణానంత సుఖసముద్ర మందలి బిందులేశములచే దేవేంద్రాదులు సుఖశాంతులు గలవారగుచున్నారో, అంతేగాక ఆయా సుఖములను చెంది సంతృప్తులగుచున్నారో, మననశీలురగు మునులును, సర్వ సంకల్పములను నశింపజేసుకొని ప్రశాంతచిత్తులై నిరతిశయ సుఖస్వరూప పరబ్రహ్మ తత్వమును బొంది శాశ్వత సౌఖ్యమును పొందుచున్నారో, నిత్య సుఖసముద్రతుల్యుడగు యే పరబ్రహ్మమునందు సంలగ్నమానసులై బ్రహ్మానందసాగరమున మునిగినచిత్తముతో సర్వ

దృశ్యములను మరచి అఖండ పరిపూర్ణ బ్రహ్మానందము ననుభవించుచు ఏ పురుషుడు పరబ్రహ్మస్వరూపియై వెలయుచున్నాడో, అట్టి పరబ్రహ్మ తత్వజ్ఞాని కేవలము పరబ్రహ్మవేత్త మాత్రుడేగాక అతడు సాక్షాత్ పరబ్రహ్మమే, అట్టివాని పాదములకు దేవతలకు రాజగు దేవేంద్రుడు గూడా వందనము లిడును- అని నా దృఢ నిశ్చయము.

అనగా పరబ్రహ్మమును దెలిసికొనిన వాడెవడేగాని చండాలుడైనను సద్బ్రాహ్మణుడైనను నా గురుతుల్యుడు. ;అతనికే దేవేంద్రాది దేవతలుగూడా, పాదాభివందనములిడుదురని శంకరులవారు ముక్తకంఠమున మనీషాపంచకమును ప్రవచిస్తూ వ్యక్తపరచిరి. అంటరానితనమునకు అద్వైతముతో తావులేదనిగదా ఆదిశంకరుల అభిప్రాయము ! ఇప్పుడు సమాజములో శంకరులవారి మనీషా పంచకమునకు గౌరవాదరణలు నశించి మత కుల వైషమ్యములకు తావేర్పడుట దుఃఖ భాజనము; దురదృష్టకరము



# హిందూ ధర్మము

## పంచమాశ్వాసము



## విశిష్టాద్వైత సిద్ధాంతము

విశిష్టాద్వైతకర్తలు శ్రీ రామానుజాచార్యులవారు. అద్వైత సిద్ధాంతములో విభిన్నాభిప్రాయము ఉత్పన్నమై సంఘములో దుర్నీతి దుష్టవ్యాపారములు ప్రబలి అద్వైతము పేరుతో గొప్ప యనర్ధకములు సంభవించుచుండ విశిష్టాద్వైత కర్త శ్రీ రామానుజులు సంఘములో వారి సిద్ధాంతమును ప్రచారము జేసి తమ పీఠములు స్థాపించిరి. వీరి చరిత్రయు సాంప్రదాయమును దెలిసికొనుట ముఖ్యము.

### శ్రీ రామానుజాచార్య చరిత్రము

శ్లో॥ అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యా నశేషాన్గురూన్
శ్రీమన్ లక్ష్మణ యోగిపుంగవ మహాపూర్ణం మునిం యామునం
రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం
సేనేశం శ్రియ మిందిరాసహచరం నారాయణం సంశ్రయే॥

ఈ శ్లోకార్ధమున అస్మదాచార్యులనుండి నారాయణమూర్తి వరకు పరంపర ననుసంధింపబడినను, సంప్రదాయము నారాయణమూర్తి నుండి అస్మద్గురు పర్యంతము వ్యాప్తమైనది.

విశిష్టాద్వైత మతమును శ్రీమన్నారాయణమూర్తి శ్రీదేవి విష్వక్సేనులు శఠకోపమునులు నాధమునులు, పుండరీకాక్షులు, రామమిశ్రులు, యామునాచార్యులు, మహాపూర్ణులు శ్రీరామానుజాచార్యులు నుద్ధరించిరి.

ఈ విశిష్టాద్వైత సంప్రదాయకర్తలనేకులు రామానుజులకు పూర్వమవతరించినను, సంప్రదాయ స్థాపనాచార్యులని జగత్ప్రసిద్ధి నొందినవారు శ్రీరామానుజాచార్యులే యైరి.

శ్రీ వైకుంఠమునందు నారాయణమూర్తి చింతతోనుండగా, ఆదిశేషులు స్వామిని జూచి దేవరవారిట్లుండుటకు కారణమేమన, నారాయణమూర్తి యిట్లనియె. "నేను లోకోద్ధరణ నిమిత్తము భూలోకమునం దవతరించగ నన్ను నరులు అప్రాకృతునిగా నెఱుంగక ప్రాకృత పురుషునిగ నెంచిరి. అనంతరము విష్వక్సేనాదులను భూలోకమునం దవతరించి చేతనోద్ధరణము జేయుట కనుజ్ఞయొసంగగ వారు మదాజ్ఞ ప్రకార మవతరించియు, పాపులచే సంభాషణము జేసిన తిరిగి వైకుంఠవాసమునకు ప్రతిబంధకమగునని తలంచి వారు స్వస్థానములకు జేరుకొనిరి. గావున యిపుడు నీవవతరించి లోకము నుజ్జీవించునట్లు జేయవలయు" ననగా ఆదిశేషులు స్వామివారి యాజ్ఞ ప్రకారము నవతరించెదనని విన్నపించి తనకు మాతాపితలు తగిన వారెవరని యాలోచించు చుండిరి.

ఇట్లుండగా శ్రీభూతపుర మనెడు శ్రీ పెరుంబూదూరియందు హారీతగోత్ర ఆపస్తంబ సూత్ర యజు శ్శాఖాధ్యాయియు, యజుర్వేదశిక్షా శ్రౌతాది వివర గ్రంథకర్తయునగు సర్వక్రతు సోమయాజులని పిలువబడు కేశవాచార్యులు తమ ధర్మపత్నియైన కాంతిమతి తోడ పుత్రప్రాప్తికై తిరువలిక్కేణికిం జని సోమోపరాగమున (చంద్రగ్రహణమున) కైరవిణీ తీరంబున స్నానంబు జేసి పుత్రకామేష్టి చేయగా, పార్థసారథిస్వామి ప్రత్యక్షమై పుత్రప్రాప్తియగు వరమిచ్చి యేగినంత నా దంపతులు భూతపురంబు జేరిరి. అనంతరము కాంతిమతీదేవి గర్భంబున ఆదిశేషులు శాలివాహన శకము తొమ్మన్నూట ముప్పది తొమ్మిది కలియుగము నాలుగువేల నూటపదునెనిమిది, హూణశకము వెయ్యిన్ని పదునేడింటికి సరియైన పింగళసంవత్సరము చైత్ర శుక్లపంచమియందు అవతరించిరి.

శ్లో॥ కల్యబ్దే దివ్యకుంభే బుధజనవిదితే వత్సరే పింగళాఖ్యే
చైత్రే మాసే గతేషు ద్వియుత దశదినే స్వేదమానే హిమాంశౌ
పంచమ్యార్ద్రా సమేతే సురగురు దినసే కర్కటాఖ్యే చ లగ్నే
శ్రీమద్రామానుజార్య స్సమజని నిగమాంతార్థ సంరక్షణార్థం॥

ఇట్లు ఆదిశేషులు అవతరించగా భూలోకమున గల సమస్త ప్రాణులకును మహదానందము కలిగెను. కాంతిమతి భ్రాతయైన శ్రీశైలపూర్ణులు భూతపురి వచ్చి వారికి రామానుజాచార్యులని నామమిడిరి. ద్వాంత్రింశల్లక్షణములతో గూడిన రామానుజులకు కేశవాచార్యులు అన్నప్రాశనాది కర్మలు జరిపించి ఉపనయనము గావించి యెనిమిదవ యేట వేదవేదాంగముల నుపదేశించి పదునారవ యేట వివాహము గావించిరి. తరువాత కొంతకాలమునకు కేశవాచార్యులు పరమపదించగా, రామానుజాచార్యులు విధ్యుక్త ప్రకారము సకల కర్మలు నెరవేర్చి భార్యతోగూడి మాతృశుశ్రూష చేయుచుండిరి. పూర్వపక్షాది గ్రంథపరిశోధనము చేయదలంచి కాంచీపురియందుండు అద్వైతియగు యాదవ ప్రకాశులయొద్ద చదువుచుండగా, అచ్చటికి రామానుజాచార్యుల పినతల్లి కుమారుడైన గోవిందభట్టరును వచ్చి చదువుచుండిరి.

ఒకనాడు రామానుజాచార్యులవారికి యాదవ ప్రకాశులు జెప్పిన శ్రుత్యర్థ విరోధవాక్యములు రామానుజులకు సహింపక దుఃఖించుచుండగా అది దెలిసికొన్న యాదవ ప్రకాశులు యెటులైన రామానుజులను హతమార్చవలయునని సమయమును జూచుచు, గంగాయాత్రావ్యాజముచే శిష్యులనందఱిని వెంటబెట్టుకొని పయనంబై వింధ్యారణ్యము జేరిరి. అప్పుడు యాదవప్రకాశుల దురుద్దేశమును గోవిందభట్టరు దెలిసికొని రహస్యముగా రామానుజాచార్యులకెఱింగించిరి. అది విన్న రామానుజు లా రాత్రికిరాత్రే కీకారణ్యములో జొచ్చి వేఱొక మార్గముగ తప్పించుకొని పోవుచుండగా, శ్రీ వరదరాజస్వామి పెరుందేవియు బోయవేషము దాల్చి ఆచార్యుల కగపడి, 'స్వామీ! తమరెక్కడికి బోయెద'రని యడుగ, ఆచార్యులు 'మేము కాంచిపురికేగెద'మని చెప్పగా, 'మేముగూడ నచ్చటికే బోవుచున్నాము రం'డని వారిని వెంటబెట్టుకొని కొంతదూరము నడువగా చీకటిపడి నందున ఒక మ్రానిక్రింద నందరు శయనించిరి. కొంతసేపటికా బోయ దంపతులు నీరుగొనితెచ్చెదమని చెప్పి వెళ్లి, తిర్గివచ్చి 'యెటు నీరు దొరుకుట లేదు, మీరు మాకొఱ కింత జలము కొనితెం'డని యాచార్యులతో నుడువ రామానుజులు పోయి నీరుదెచ్చునంతలో తెల్లవారెను. వారు తిర్గివచ్చునంతలో బోయ దంపతు లచట నదృశ్యులైపోయిరి. అప్పుడు వారిని గానక వెదుకుచు గోపురాదులను గని ఇది యేయూరన నచ్చటివారు కాంచీపురంబని జెప్పగా, రామానుజు లాశ్చర్యమొంది, ఇది వరదరాజస్వామి మాయయేయని తెలిసికొని,

జరిగిన వృత్తాంతము కాంచీపూర్ణులను పెద్దలకు దెల్పగా వారు ప్రతిదినమును మీరు తెచ్చే బావిలోని జలములను స్వామి తిరుమంజనమునకై యిచ్చుచుండుడని నియమించిరి. రామానుజు లట్లే జేయుచుండిరి.

శ్రీరామానుజులు తప్పించుకొని పోయిన యుదంతము యాదవ ప్రకాశులు తెలుసుకొని, శిష్యులతో కాశికివెళ్లెను. కాశికిపోయిన తర్వాత గోవింద భట్టరును (రామానుజులకు యాదవ ప్రకాశుల దురుద్దేశమును దెలిపిన యతని పినతల్లి కుమారుని) శైవమతస్థుని జేయుటకై యాదవ ప్రకాశులు యోచించి గోవింద భట్టరుకు గంగానదికి స్నానమునకై తీసుకొనిపోయి అతనిని గంగలో మునుగుమని యాజ్ఞాపించెను. యాదవ ప్రకాశుల మాట కాదనలేక గోవింద భట్టరు గంగలో మునిగి పైకి లేవగా యాదవప్రకాశుల మాయవలన గోవింద భట్టరు చేతిలో శివలింగము వచ్చి నిలిచియుండెను. ఆ తంత్రమును జూచి గోవిందభట్టరు యాదవ ప్రకాశుల వారికి నమస్కరించి మీరు గొప్ప శివశక్తి సంపన్నులని స్తుతించి వెంటనే శైవమతమును స్వీకరించిరి. యాదవ ప్రకాశులు గోవిందభట్టరువారి పేరుమార్చి "ఉళ్ళంగై కొండ నాయనారను" శైవనామ మిడిరి. తర్వాత అందఱును కాశినుండి తిరిగివచ్చునపుడు, ఈ ఉళ్ళంగై కొండ నాయనారు వారు కాళహస్తిలో నిలిచిపోయిరి. యాదవ ప్రకాశులు కంచికి వచ్చి రామానుజుల వృత్తాంతమంతయు విని భయపడి, శ్రీరామానుజులను పిలిచి బుజ్జగించి శిష్యులతోగూడ నుండునట్లు జేసి శాస్త్రార్థములు బోధించుచుండిరి.

ఈ వృత్తాంతమెల్లను శ్రీరంగమునందుండు యామునాచార్యులు విని, కంచికివచ్చి తమ శిష్యులైన కాంచీపూర్ణులను గని రామాజు లెక్కడున్నారని అడగ కాంచీపూర్ణులు, రామానుజులు శిష్యులతో గూడి పాఠములు చదువుచున్నారని నుడివిరి. అపుడు రామానుజుల వారితో మాటలాడుటకు వలనుపడక, శ్రీరామానుజులు శిష్యులతో కాంచీ పూర్ణులవెంట కోవెలకు వచ్చునప్పుడు నక్షత్రముల మధ్య చంద్రునివలె ప్రకాశించు వీరే రామానుజులని కాంచీపూర్ణులు యామునాచార్యులకు జూపించిరి. అపుడు యామునాచార్యులు దర్శన స్థాపనాచార్యులగుదురని మంగళాశాసనముజేసి తిరిగి శ్రీరంగమునకు వెళ్లిరి.

అనంతరము కాంచీపురము నేలు చోళరాజన్యుడు తన కుమార్తెకు పట్టి పీడించుచున్న బ్రహ్మరాక్షసుని బోద్రోలుటకు మంత్రవేత్తయైన యాదవ ప్రకాశు

లను పిలువనంపగా యాదవప్రకాశులు రాజగారి భటులతో "నేను అక్కడికి రాకుండగనే యిచ్చోటనుండియే బ్రహ్మరాక్షసిని బోదోలుదును జూడుడు. నా పేరు జెప్పిన చాలును బ్రహ్మరాక్షసి పారిపోవు"నని నుడివిరి. భటులు వెళ్లి యాదవ ప్రకాశులు జెప్పినట్లు బ్రహ్మరాక్షసి గ్రస్తయగు రాజకుమారి ముందు నుడువ, నామెపై నావేశించిన బ్రహ్మరాక్షసి వారలకు బదులు జెప్పుచు 'మీరు వెళ్లి యాదవ ప్రకాశుల పుట్టుక పూర్వజన్మము నాకు దెలియునని జెప్పుడు. అవసరమైతే నాకడకు యాదవ ప్రకాశులువచ్చి నన్నడిగిన నతని పుట్టుపూర్వోత్తర ములు జెప్పెదను. వెంటనే యీవిషయము యాదవప్రకాశులకు తెలియజేయు'డన భటులువెళ్లి యాదవ ప్రకాశులతో బ్రహ్మరాక్షసి యుదంతము తెలిపిరి. అప్పుడు యాదవ ప్రకాశులు బ్రహ్మరాక్షసి కడకేగి నాపుట్టు పూర్వోత్తరాలేమిటో తెలుపుమనగా బ్రహ్మరాక్షసి యిట్లనియె.

"ఓ యాదవ ప్రకాశా! నీ పూర్వజన్మమున మధురాంతకము చెఱువు గట్టున ఉడుమువైయుంటివి. అచట నీవు శ్రీవైష్ణవ ప్రసాదోచ్ఛిష్టమును భుజించి నందున నీవు యీ జన్మమున బ్రాహ్మణుడవై జన్మించితివి. ఇట్టి నీవు నన్ను పొమ్మనిన నేపోదునా? మారామానుజాచార్యుల యానతియైనచో బోయెద"ననగా, చోళరాజు రామానుజులను బిలిపించి బ్రహరాక్షసిని బారదోలి మమ్ము రక్షించుడని ప్రార్థింపగా, రామానుజులు బ్రహ్మరాక్షసితో వెళ్లి పొమ్మని వచింప వెంటనే బ్రహ్మరాక్షసి తొలిగిపోయెను.

ఇట్లుండ నొక్కనాడు యాదవ ప్రకాశులకును రామానుజులకును జరిగిన వాక్యార్థమునందు యాదవ ప్రకాశులు రామానుజాచార్యుల మహత్త్వగుణ మును జూచి యీర్ష్యజెంది యికముందు నావద్ద చదువ వద్దనగా శ్రీరామానుజులు యాదవప్రకాశుల వద్ద చదువుమాని వరదరాజస్వామి కోవెలకు తిరుమంజన మునకై నీరుగొని తెచ్చు కార్యక్రమము మాత్రము జేయుచుండిరి. ఇట్లు రామాను జాచార్యులు యాదవప్రకాశులతో వాదించి చదువుమానిన వృత్తాంతమును యాము నాచార్యుల వారికి దెలిసి, తాము రచించిన స్తోత్ర రత్నమును మహాపూర్ణులను వారి చేతికిచ్చి దీనిని నా ఆనవాలుగాజూపి శ్రీరామానుజులను యిచటికి బిలుచు కొని రమ్మని పంపగా, మహాపూర్ణులు కంచికి పోయి వరదరాజును దర్శించి యామునాచార్యుల వారి స్తోత్ర రత్నము ననుసంధింపగా రామానుజులు విని

యాశ్చర్యమును నొంది మహాపూర్ణులతో నీస్తోత్రరత్నమెవరి విరచితమని యడుగ, వారిది యామునాచార్య విరచితమని యెఱింగింపగా తోడనే వారి దర్శనార్థమై మహాపూర్ణుల తోడ శ్రీరంగమునకు వేంచేయగా నక్కడ కావేరీ తటంబున వైష్ణవులంత విషాద విషణ్ణహృదయులై గూర్చున్న వారలనుగని కారణంబడుగ యామునాచార్యుల వారు పరమపదమందిరని జెప్పిరి. ఆ వార్త వినిన రామానుజులు దుఃఖాగ్ని మగ్నులై కొంతవడికి వారి చరమ విగ్రహమునైన దర్శింపవలయునని యెంచి ఆచరమ విగ్రహమును సేవింపగా, వారి చేతివేళ్ళు మూడు మాత్రము ముడుచుకొని యుండగని యచ్చటవారినిం జూచి యిట్లెప్పుడు నుండుట కలదాః యనగా, ముందెప్పుడు వీరికిట్లు లేదు, యిప్పుడే యిట్లున్నదనిరి. అప్పుడు రామానుజాచార్యులు యామునాచార్యులకు కోరికలేమైనా గలవాఃయని వారినడిగిరి అంత నా వైష్ణవులు యామునాచార్యులకు పరాశరుల ప్రభావమును వెలిబుచ్చవలయుననియును, బ్రహ్మసూత్రములకు భాష్యము జేయవలయుననియు, తిరువాయ్ మొళికి వ్యాఖ్యానము వ్రాయవలయుననియునూ తలంచియుండిరనిరి ఆమీద రామానుజులు ఈమూడు కార్యములను ఆచార్య కటాక్షముచే నేను నెఱవేర్చెదనిరి. శ్రీరామానుజు లిట్లు పలుకగానే శ్రీయామునాచార్యుల వేళ్లు ముడుత వదిలి యధాస్థితికి వచ్చెను. అప్పుడా వైష్ణవులందరును దేవర వారే దర్శనోద్ధారకు లగుదురుగాక యని మంగళాశాసనము జేసిరి.

ఆతరువాత రామానుజులు యామునాచార్యుల వియోగమునకు చింతించి రంగనాథుని సేవింపక కాంచీపురిని జేరిరి. కాంచీపూర్ణులకు శ్రీరంగమున జరిగిన వర్తమాన మంతయు వినిపింప వారును స్వాచార్య వియోగమునకు చింతించుచుండిరి. ఇట్లుండ నొకనాడు రామానుజులు కాంచీపూర్ణులను జూచి దేవరవారు దాసుని గృహంబున భుజించి శేషమును కృపజేయవలయునని ప్రార్థింపగా కాంచీ పూర్ణులు సమ్మతించి యట్లే రామానుజులవారి యాతిథ్యమును స్వీకరించిరి. ఇంతలో రామాజుల వారి పత్ని గృహమంతయు శుద్ధిజేసి స్నానము జేయుచుండగా యిట్లేల జేయుచున్నావన, అన్యజాతివారైన కాంచీపూర్ణుడు భుజించిన కారణంబున నిట్లు చేయుచున్నా నన రామానుజులు భార్యపై కోపించి తమ యిష్టసిద్ధి కాకపోయినందులకు చింతనొంది కాంచీపూర్ణుల కడకు జని నేను సంకల్పించుకొనియుండు సిద్ధాంతములు వరదరాజస్వామికి సమ్మతమాః కాదాః దానిని స్వామిని యడిగి తెలియజేయుడనగా నట్లే కాంచీపూర్ణులు వరదరాజస్వామి

నడుగగ మేము పరతత్వము, భేదమే దర్శనము ప్రపత్తియే ఉపాసనము,అంత్య కాలమునందే ధ్యానింపవలయునను నియమములేదు. దేహావసానమున మోక్షము సిద్ధము. మహాపూర్ణుల నాశ్రయించి ప్రపత్తిజేయుము ఇది రామానుజుల కెఱిగింపు'మని వరదరాజు దెల్పగా, నట్లే కాంచీపూర్ణులు రామానుజుల కెఱింగించిరి.

ఇది యిట్లుండగా, శ్రీరంగమునందు మహాపూర్ణులు, దర్శనోద్ధారకులగు రామానుజాచార్యులను సేవింపనెంచి వైష్ణవ బృందముతో ప్రయాణమై వచ్చుచు మధురాంతకము జేరిరి. శ్రీరామానుజులు మహాపూర్ణులను దర్శించుటకై బయలుదేరి మధురాంతకము వద్ద కలిసికొని మిగుల సంతోషించి, అచ్చటనే మహాపూర్ణులచే సమాశ్రయణమును బొందిరి. తర్వాత అందరుగలసి కాంచీపురమునకు జేరిరి. రామానుజులు మహాపూర్ణుల వద్ద దర్శన గ్రంథములను పఠించిరి.

కొన్ని రోజులు గడిచిన పిదప రామానుజులవారి యింటికి ఒక వైష్ణవుడు అతిథిగావచ్చి ప్రసాదమిప్పింపుడని యడుగ, రామానుజులవారి పత్ని ప్రసాదముండియు పెట్టకపోయెను. అది తెలుసుకొనిన రామానుజులు ఇట్టి పత్నివలన మహా పాతకములు గలుగునని చింతించిరి. ఇంతలో శ్రీరామానుజులకు దర్శనములు పఠింపించిన మహాపూర్ణుల సతీమణితో రామానుజుల పత్ని కలహించినందున, మహాపూర్ణులు కాంచీపురి యందుండిన మానహానియగునని తలంచి శ్రీరంగమునకు వెళ్ళిపోయిరి. ఈ విషయము రామానుజుల కెంతో హృదయ దహనకరమై, భార్యను పుట్టింటికి బంపివేసి వరదరాజస్వామినే ఆచార్యులనుగా బడసి త్రిదండ సన్యాసమును స్వీకరించి యతిరాజాభిధానమును బడసిరి.

ఇవ్విధముగా రామానుజులు యత్యాశ్రమ స్వీకారమును బొందిన మీదట, దాశరథులును, కూరేశులును, రామానుజులవారి సన్నిధియందు పంచసంస్కారమును బొంది శిష్యులై సేవించుచుండిరి. అనంతరము శైవులై రామానుజులను వ్యతిరేకిస్తూ వచ్చిన యాదవ ప్రకాశులును రామానుజుల వైభవమును, మహిమను దెలిసికొని, రామానుజుల చరణముల నాశ్రయించి త్రిదండ సన్యాసమును స్వీకరించి గోవింద జీయరను నామమును బొంది పంచ సంస్కారాదులచే పరిశుద్ధులైరి.

యతిరాజ శేఖరుడగు శ్రీరామానుజాచార్యుడు మహాపూర్ణుల నాశ్రయించి రహస్యార్థముల నుపదేశింపుడని ప్రార్థింపగా వారు కొన్నింటిని దెలిపి,మిగిలినవి ఉపదేశించుటకు తిరుకోట్టియూరు గోష్ఠీ పూర్ణుల కధికారముగలదు గాన యచ్చటికేగి వారితోడనా యుపదేశములను బడయుమనిరి. అంతట రామానుజులు తిరుకోట్టియూరికి బోయి గోష్ఠీపూర్ణుల సందర్శించి దండములు సమర్పించి తమ యభీష్టమును విన్నవించిరి. గోష్ఠీ పూర్ణులు రామానుజుల దృఢభక్తిని పరీక్షజేయ నెంచి మొగమిచ్చి మాటలాడ కుండిరి. ఆకారణ మెఱుంగకయే రామానుజులు మరలి శ్రీరంగమునకు విచ్చేసిరి. తర్వాత శ్రీరామానుజులు పదునేడు మారులు తిరుకోట్టియూరికి బోయి ఊరక గోష్ఠీపూర్ణుల దర్శించి తిరుమంత్రార్థోపదేశమును బొందకయే వచ్చుచుండిరి.

మఱియొకమారు రామానుజులు గోష్ఠీ పూర్ణుల శిష్యులను జూచి, తన సంగతి తెలియజెప్పి తన యభీష్టమును నెఱవేర్చి రక్షింపవలసినదిగా గోష్ఠీపూర్ణులకెఱిగింపుడని ప్రార్థింప వారు గురువగు గోష్ఠీపూర్ణుల కా సంగతి దెలిపిరి. అంత వారు హర్షించి యతిరాజును బిలిచి త్రిదండ పవిత్రములతో రావలసినదని యాజ్ఞాపించగా, రామానుజులవారు త్రిదండ తుల్యులగు దాశరథులతోడను, పవిత్రతుల్యులగు కూరేశుల తోడను గోష్ఠీపూర్ణుల కడకు జన, అప్పుడు వారు యతిరాజులకు చరమార్థరహస్యోపదేశ మొనర్చి దీనిని యితరుల కెఱుకజేసినచో దుర్గతి వాటిల్లును గాన రహస్యముగా దీనినుంచుకొని తరింపు మని సెలవిచ్చిరి.

అప్పుడు రామానుజులు మహాగుప్తమైన యీ చరమార్థ మంత్రమువలన లోకములోని జనులందరు తరింపవలసియుండ దీనిని నే నొకడనే తరించుటకు గుప్త పరుచుకొనిన, లోకోపకారము కానేరదని యెంచి, ఈ దాసుడొక్కడు దుర్గతి పాలైనను లోకులెల్లరు దీనివలన యుజ్జీవింపబడుటయే యుత్కృష్టతమ మనియెంచి గోపురమెక్కి తిరుమంత్రము లోకోపకారార్థము సర్వమానవ కల్యాణమునకై తెలియజేసి లోకుల నందరను చరమార్థ మంత్రోక్తముచే పవిత్రులను గావించిరి. ఈ విషయమును దెలిసికొన్న మంత్రదాతయగు గోష్ఠీపూర్ణులు యతిరాజులవారి సమున్నతాశయమునకు మెచ్చి, వారిని 'మన్నాథా!' యని పిలిచి తక్కిన రహస్యార్థములను మరల నుపదేశించెదనని చెప్పి, కొన్నాళ్లకు యతిరాజులకు గోష్ఠీపూర్ణులు తక్కిన మంత్రరహస్యముల నుపదేశించిరి.

ఆతర్వాత యతిరాజులు దిగ్విజయార్థమై శిష్యులతోడ బయలుదేరి చోళ మండలములోని కుమతులను ఖండించి తిరుక్కురుంగుడికివచ్చి 'నంబి' గారికి మంత్రోప దేశముజేసి వారివలన ఉడయవరులను పేరును వడసి యచ్చోటి నుండి తిరువనంతపురము మొదలగు స్థలములలోగల శంకర జైన బౌద్ధాది మత ములను జయించి, ఉత్తర మధుర సాలగ్రామము మొదలగు క్షేత్రములను సేవించుకొని, సరస్వతీ పీఠమునకు రాగా, సరస్వతీ దేవి ప్రత్యక్ష స్త్రీరూపము దాల్చి యెదుర్కొని చని తనకుగల సంశయార్థములను దెలిసికొని రామానుజా చార్యులకు శ్రీ భాష్యకారులని నామ మొసంగెను ఆ తర్వాత జగన్నాథము మొద లుగా గల క్షేత్రములను సేవించుకొని తిరుపతికి వచ్చి పాషండులు వేంకటేశ్వరు నకు విభూతి రుద్రాక్షలు ధరించియుండుట దెలిసి వారితో బోరాడి విష్ణు చిహ్నము లతో ప్రకాశించు స్వామిని పాషండుల కగుపరచి పాషండులను బారదోలి శ్రీరంగమునకు వేంచేసి యచటనే యుండిరి అపుడు శ్రీరంగనాథస్వామి యొక్క ప్రసాద మహిమచే కూరేశులకు గలిగిన కుమారులను కటాక్షించి పెద్ద శిశువు నకు శ్రీ పరాశరభట్టరు అనియును, చిన్న శిశువునకు శ్రీనివాస భట్టరనియును నామకరణ మొనర్చిరి. ఆ తర్వాత చోళ దేశపు రాజు శివుడే పరదైవమని వాదిం చుచు యతిరాజులను దీనినొప్పుకొమ్మని నిర్బంధించగా నపుడు శ్రీరంగమును విడిచి చోళరాజును క్రిమికంఠుడగు నట్లు శపించి, తొండనూరికి బోయి యచటి రాజ కుమార్తెకు బట్టిన బ్రహ్మరక్షస్సును బారదోలి అచటగల జైనమతస్థులను జయించి, ఆంధ్ర పూర్ణులను మహానుభావులను కటాక్షించి. అచట నుండి తిరు నారాయణ పురమునకేగి సన్నిధి కైంకర్యము నెఱవేర్చి అచట వసించియుండగా తిరునారాయణస్వామి స్వప్నమున సాక్షాత్కరించి రామప్రియులనెడి ఉత్సవ మూర్తి ఢిల్లీ నగరమున వేంచేసియున్నారని యానతీయగా రామానుజులు ఢిల్లీకి బోయి రామప్రియులను "మత్సంపత్కుమారా" యని పిలువగా నాడుచు వచ్చిన స్వామిని తిరునారాయణ పురమునకు వేంచేపు జేసుకొని వచ్చిరి. ఇంతలో పన్నెండేడ్లు గడిచెను శ్రీరంగమున చోళుడు శివుడే పరదైవమని కూరేశులను ఒప్పు కొనుమని నిర్బంధించిరి. అట్లు ఒప్పుకొననియెడల కన్నులు దీయించెదనని బెదిరించగా. అపుడు కూరేశులు దుర్మార్గుని జూచిన కన్నులను నేనే తీసివేసెదని జెప్పి తమ నేత్రములను తామే యుత్పాటించుకొని రనియు, క్రిమికంఠుడైన చోళుడు మృతి నొందెననియు యతిరాజులు విని మేలుకోట నుండి శ్రీరంగమునకు బోయి వరదరాజ స్తవముచే కూరేశులకు తిరుగ నేత్రముల ననుగ్రహించి, యచ్చటనుండి కూరేశులు దాశరథులు మొదలగు వారితోడ కాంచీపురికి వేంచేసి యచ్చోటు

బాసి తిరుమలకు బోయి గోవిందరాజస్వామిని ప్రతిష్ఠంజేసి మరల శ్రీరంగమునకు వేంచేసి నాచ్చియార్ తిరుమొళిలో సుందర భుజులు తిరుమలకు వేంచేయువేడుక జనింపగా నచ్చటికి బోయి దివ్యాన్నము నారగింపుజేసి యచ్చటనుండి శ్రీవిల్లి పుత్తూరికినిబోయి గోదాదేవివలన "గోదాగ్రజుడు" అను నామమును బొంది, దివ్యాన్నము నారగింపు జేసి యటనుండి తిరునగరికినిబోయి శేషాంశ సంభూత మైన తింత్రిణీ వృక్షమును సేవించి కురుకేశులను స్వీకారము జేసుకొని, అచ్చటి నుండి మరలి శ్రీరంగమునకు వేంచేసిరి.

ఇట్లు యతిరాజులు దిగ్విజయము జేసి శ్రీ వైష్ణవ మతమును స్థాపించి తమ తర్వాత రాబోవు పరంపరకు విచ్ఛిత్తి జరుగకుండ డెబ్బది నల్వురు సింహాసనాధిపతులను నియమించి, వారిలో నల్వురకు భాష్యసింహాసనమును, తదాధిపత్యమును బిరుదములతో నొసంగిరి. అంతేగాక యతిరాజుల వారి శిష్యకోటి యందు జేరిన యేడునూర్ల జియ్యంగార్లను, పండ్రెండు వేల పరమైకాంతులును, వేనవేలు చాత్తాది వైష్ణవులును, అనేకులు అమ్మంగార్లు మరికొందరు భగవత్కైంకర్యపరులును యతిరాజులగు-రామానుజాచార్యులచే నియమితులై కైంకర్యాదికములు జేయుచుండిరి.

అనంతరము శిష్యజనుల ప్రోత్సాహముచేత రామానుజులవారు కురుకేశులను "తిరువాయి మొళికి" "ఆరాయి రప్పడి" యను వ్యాఖ్యానమును రచియించుట కనుజ్ఞ యొసంగిరి. కురుకేశులు యతిరాజుల యాజ్ఞమేరకు ఆ వ్యాఖ్యానము రచించిన మీదట దానికి భగవద్విషయమను నామమొసంగి కురుకేశులకు ఉభయవేదాంత ప్రవచన సింహాసనాధిపత్యము నను గ్రహించిరి. తర్వాత కూరేశులు పరమపదించగా వారికి భట్టరువుగారి వలన చరమ కైంకర్యముల నన్నిటిని నెరవేర్పగలిగిరి.

ఆ మీద తమ శిష్యకోటికి ఆళ్వారాచార్యులను ప్రతిష్ఠజేయుటకు నియమింపగా శిష్యులు యతిరాజులవారి దివ్యవిగ్రహమును కూడ ప్రతిష్ఠజేయుటకు అనుజ్ఞగోరగా వారి యిష్టము నెఱవేరునట్లు తమవంటి దివ్యవిగ్రహము నొకదాని నిర్మించుకొనుడని చెప్పినదేగాక, శఠకోపులు తమ జీవితకాలమునందు భవిష్యత్కాలమున నవతరింపబోవు శ్రీరామానుజుల విగ్రహమును నిర్మించి శిష్య పరంపరగా తిరువారాధనముగుచుండు విగ్రహమును ప్రతిష్ఠచేయుట కనుజ్ఞ

యొసంగి శ్రీరంగనాథుని సేవించి స్వామియనుమతిబొంది మఠమునకు వేంచేసి యామునాచార్యుల శ్రీపాద తీర్థమును గ్రోలి తమ నూటయిరువదియవ సంవత్సర మగు దుర్మతి సంవత్సర మాఘ శుద్ధ దశిమి యందు బ్రహ్మరంధ్రమును భేదించు కొని అర్చిరాదిమార్గమున పరమపద మలంకరించిరి.

శ్రీరామానుజాచార్యులవారిచే రచియింపబడిన గ్రంథములు శ్రీభాష్యము, వేదాంతదీపము, వేదార్థ సంగ్రహము, గీతాభాష్యము, గద్యత్రయము, భగవదా రాధనక్రమము మొదలగునవి. రామానుజాచార్యులకు తర్వాత యీ సంప్రదాయ మును రామానుజాచార్యులవలెనే వ్యాపింపజేసినవారు యతీంద్రప్రవణులను మణ వాళ మహాముని లని తెలియదగినదై యున్నది. ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము ననుసరించినవారు యిరుతెరుగులవారై యున్నారు. రామానుజులవారి సిద్ధాంత మును "తెన్‌గల" యనియు వేదాంతదేశికులవారి సిద్ధాంతమును "వళకళై" యనియు చెప్పబడును.

హిందూమత సిద్ధాంతములను సమగ్రముగా తెలుసుకొనగోరువారి సౌకర్య మునకు అది గురువర్యుల చరిత్ర నిందు నుదాహరించుటమైనది. కొంత విసుగు దల గలిగించినను వీరి చరిత్రలను ఆమూలము పఠించుటయుక్తమని గ్రహించ వలసిన యావశ్యకతగలదని విజ్ఞులను కోరటమైనది.

ఇక యీ విశిష్టాద్వైత సిద్ధాంతములో అంటరానితనమునకు బొత్తిగా చోటులేదని తెలుపుట అతిశయోక్తికానేరదు. ఈ రామానుజమత సిద్ధాంత పురుషులలో పన్నిద్దరాళ్వారాదులుగలరు. అనగా పన్నెండుగు ఆళ్వారులు (పెద్దలు). వారిలో తిరుప్పాణ్యాళ్వారులు మాదిగవారును, పంచనంబులలో మార్నేరునంబి మాలవారును యనునది లోకవిదితమైన విషయము. ఇచ్చట మార్నేరునంబిగారి యుదంతమును కొంత తెలియపరచి, ఈ విశిష్టాద్వైత సిద్ధాంతములో అస్పృశ్యత యెలా ఖండింపబడినదో ఈ తరమువారికి తెలియ జేయుట ముఖ్యమని భావించి యీ దిగువ విషయము నుల్లేఖించటమైనది.

మార్నేరునంబిగారు పంచములని యింతకుముందే తెలియజేయనైనది. ఇతడు తనకు ప్రాణావసానదశ సమీపించుచున్నదని తెలుసుకొని, పెరియనంబి గారికి యీ విషయము తెలియజేయించెను. పెరియనంబిగారు బ్రాహ్మణులు. వీరిరువురు యామునాచార్యులవారికి శిష్యులు. మార్నేరునంబికడకు పెరియ

నంబి రాగా వారితో మార్నేరునంబిగారిట్లనిరి. "అయ్యా! తాము పెద్దలు. నాకు మరణమాసన్నమైనది. ఈ శరీరము పూజ్యులగు గురువరేణ్య స్వాములు యామునాచార్యులకు శేషత్వమందినదిగాన ప్రాకృతులెవరును యీ శరీరమునకు బ్రహ్మమేధ సంస్కారాదులు జేయగూడదని నా యభిమతము. దేవరవారు నాకు ఊర్ధ్వలోక క్రియలుజేయుదురా?" అని పెరియనంబిగారి నడిగిరి. అది విని మహోదారమనస్కులగు పెరియనంబిగారు చరమదశలోనున్న మార్నేరునంబి గారిని సేవించుచు మరణతరుణములో వారి ప్రక్కనే గూర్చుండియుండి వారికి అంత్యసంస్కారాలాచరించుటకు అంగీకరింప మార్నేరునంబిగారు ప్రాణోత్క్ర మణ సమయమున నిట్లనిరి.

"నాన్ యిందపడి యిందపడి యిందపడి సెయిదాల్,
నీర్ అందపడి అందపడి అందపడి సేయంగళ్"

దీని యర్థమేమనగా నేను ఈ రీతిగా—ఈ రీతిగా—ఈ రీతిగా—జేసితినేని మీరు ఆరీతిగా—ఆరీతిగా—ఆరీతిగా జేయగలరు. అనుచు క్రమాలంకార సందర్భనముగా మార్నేరునంబిగారు సెలవిచ్చిరి. దీని తాత్పర్యమేమనగా:— "నేను దైవనామ స్మరణజేయుచు ప్రాణములు విడిచినయెడల మీరు పదిరోజుల శౌచముపట్టి కర్మనాచరించవలెను. నేను గురునామ స్మరణజేయుచు ప్రాణ ములు వదిలినచో, మూడు దినములు మాత్రమే మైలపట్టి కర్మలాచరించుడు. నేనెవ్వరిని తలపకుండ ప్రాణములు విడిచితినేని మీరు సంస్కారాదులే జేయ వలసినదిగాని మైలపట్టి కర్మనాచరించవలసిన పనిలేదు. అని తెలుప వారి యవసానాజ్ఞను శిరోధార్యముగా భావించిన పెరియనంబిగారు మార్నేరునంబిగారికి సకలవిధులతో ఊర్ధ్వదైహిక సంస్కారా లాచరించి వారి మృతశరీరము నంటి నందుకు స్నానము సహితమాచరించక, కట్టుబట్టలుగూడా వదలక తిర్వారాధనము గావించుకొని సాపాటుకానిచ్చుకొనిరి. పంచమునకు బ్రాహ్మణుడు సంస్కారా దులుజేయుటలేమి, కట్టుబట్టలతో మైలను పాటించక తిర్వారాధన భోజనము లేమి యని మనకు వింతగలగకమానదు. కావున వైష్ణవమత సిద్ధాంతములో అస్పృశ్యతకు తావే లేకుండినదనుట కీఉదాహరణముచాలును. వైష్ణవసిద్ధాంతములో భగవంతునకంటే భక్తునకే యెక్కువ ప్రాముఖ్యత నిచ్చిరని చెప్పుటకలదు.

# విశిష్టాద్వైత సిద్ధాంతము

ఈ విశిష్టాద్వైత సిద్ధాంతములో సంప్రదాయభేదములు రెండు విధములై యున్నవి. ఒకటి ("తెన్‌గల సంప్రదాయము") రెండవది "వళకళ సంప్రదాయము"

వీరివాదము యీ తీరుగా జెప్పబడియున్నది.

| | తెంగల సంప్రదాయము | వళకళ సంప్రదాయము |
|---|---|---|
| 1 | ఈశ్వరకటాక్షము ఎవని యందైనను నిర్హేతుకముగా గల్గును. | ఈశ్వర కటాక్షము సహేతుకముగా నుండును |
| 2. | మోక్ష లాభము యీశ్వరుని కొరకే గాని జీవునికొరకు గాదు. | మోక్షలాభము జీవునకేగాని. ఈశ్వరునకు గాదు. అధికార భేదము. |
| 3. | కర్మజ్ఞాన భక్తి యోగములు మూడును ఆచార్య నిష్ఠయు మోక్షమునకు స్వతంత్రోపాయములు | కర్మజ్ఞానాదులు భక్తికి అంగములే గాని స్వతంత్రోపాయములు కావు. |
| 4. | లక్ష్మీదేవి జీవికోటివలె అణుస్వరూపురాలేకాని సర్వవ్యాపకురాలు కాదు. | లక్ష్మీదేవికి కూడా యీశ్వరునివలె సర్వవ్యాపకత్వముకలదు. |
| 5. | మోక్షమునొసంగు శక్తి లక్ష్మీదేవికి లేదు. | మోక్షమునొసంగు శక్తి లక్ష్మీదేవికి కలదు. |
| 6. | ఈశ్వరుడు ఆశ్రితుల దోషములను భోగ్యముగా దలంచునట్టి వాత్సల్యగుణములు గలవాడు. | భక్తులయొక్క దోషములయందు లక్ష్యముంచకపోవుటయే వాత్సల్యమనంబడును. |
| 7. | భగవంతుడు పరులదుఃఖముల జూచి దుఃఖించునట్టి దయాగుణము గలవాడు. | పరుల దుఃఖములజూచి సహించకుండుటయే దయ యనంబడును. |
| 8. | ప్రపత్తి భక్తివలె మోక్షమునకు సాధనము కాదు. | ప్రపత్తి భక్తివలె మోక్షమునకు సాధనమే |
| 9. | ప్రపత్తికి స్వరూప యాథాత్మ్య జ్ఞానముగలవాడే యధికారియగును. | ప్రపత్తికి యకించనుడే యధికారి యగును. |

| | |
|---|---|
| 0. ప్రపత్తికి సర్వధర్మ పరిత్యాగము ఆవశ్యకము. | ప్రపన్నుడు ఆసక్తి చేత సర్వధర్మ పరిత్యాగములను స్వాభావికముగనే విడువగలడు. |
| 11. చేతనులందరును పరతంత్రులుగాన భక్త్యాద్యుపాయములు పారతంత్ర్య స్వరూప విరుద్ధములై యున్నవి. | ప్రపత్తి కాక తక్కిన భక్త్యాద్యుపాయములు అధికారుల భేదము ననుసరించి యుండును. |
| 12. ప్రపన్నుడు శాస్త్రవిహిత కర్మములాచరించుట ఇతరు లట్లాచరించుట కొరకు. | ప్రపన్నుడు శాస్త్రవిహిత కర్మముల నాచరించుట భగవదాజ్ఞననుసరించి భగవత్ప్రీతికొరకు, |
| 13 ప్రపన్నుడు ప్రపత్తికి పూర్వ ధర్మము లైనవానిని ఆచరింప నక్కరలేదు. | ప్రపన్నునకు ప్రపత్తికి పూర్వధర్మములు ప్రపత్తికి యంగమైయుండుటం బట్టి ఆచరింపవలయును. |
| 14. ప్రపన్ను లందరికిని భగవదనుగ్రహము కలుగదు. | ప్రపన్నులందరకును భగవదనుగ్రహము కలుగును. |
| 15. ప్రపన్నుడు పాపములు జేసినను పూర్వప్రపత్తిని యనుసంధించి నంతనే నివర్తియగును. | ప్రపన్నుడు పాతకములు జేసినయెడల మరల ప్రపత్తిని సక్రమముగా జేయవలయును |
| 16. ప్రపన్నుడు హీనకులస్థుడైనను శ్రేష్ఠకులజునివలె గౌరవింప దగినవాడు. | హీనకులస్థుడైన ప్రపన్నుడు వర్ణాశ్రమ ధర్మవిరోధము లేని మాటలందే మాత్రమే గౌరవింపదగినవాడు |
| 17. ఈశ్వరుడు అణుస్వరూపులైన జీవుల యందు అంతర్యామియై యున్నాడు. | ఈశ్వరుడు అణు స్వరూపులైన జీవుల యొక్క దేహాంతరాళము వ్యాపించుట అసంగతము. |
| 18. విరజానదికి ఆవలనుండు నిత్యమైన కైవల్యమును బొందినవాడు మరల జన్మనొందడు. కైవల్యము నొందిన వానికి పరమ పదము గలుగదు. | విరజానదికి ఈవలనుండు అనిత్యమైన కైవల్యము ననుభవించిన తర్వాత పరమ పదమును గూడా పొందవచ్చును. |

ఈ పైన చెప్పబడినవి ముఖ్యమైన ధర్మములు. ఇట్లే వడకళవారును, తెన్గలవారును ధరించు తిరుమణియందును వ్యత్యాసము కలదు. వడకల వితంతువులు ముండనము జేసికొందురు. తెన్కల వితంతువులు ముండనము జేసికొనరు, వడకళవారు స్త్రీ శూద్రులకు ప్రణవోక్తముగా తిరుమంత్రము నుపదేశింపరు, తెన్గలవారు స్త్రీ శూద్రాదులకుకూడా ప్రణవోక్తముగా సంప్రదాయ సహితముగా తిరుమంత్రము నుపదేశించెదరు.

---

# హిందూ ధర్మము

## షష్ఠాశ్వాసము



## ద్వైత సిద్ధాంతము

ఈ సిద్ధాంతమును స్థాపించినవారు మధ్వాచార్యులు. వీరికి పూర్వజ్ఞులని మరియొక పేరుకలదు. గాన ఈ సిద్ధాంతమును పూర్వజ్ఞ సిద్ధాంతమనియును, మధ్వ సిద్ధాంతమనియు, తత్త్వవాది సిద్ధాంతమనియు, బ్రహ్మవాది సిద్ధాంత మనియు జెప్పుట కలదు.

### శ్రీ మధ్వాచార్యుల చరిత్రము

భూలోకమునందు బుద్ధ మతము, అద్వైత మతము వలన ప్రబలిన చెడు గును నివారించుటకు వేదవేదాంతములకు వాస్తవికమగు అర్థములను కల్పించు టకు మాధ్వ సిద్ధాంతకర్త కలియుగమున నవతరించెనని మాధ్వుల వాదము. లోకోద్ధరణార్థము బ్రహ్మ శ్రీహరితో మొరబెట్టుకొనగా, త్రేతాయుగమున హను మంతుడుగను, ద్వాపరయుగమున భీముడుగను నవతరించిన శ్రీ భగవదంశ మగు వాయుదేవుడే కలియుగమున వేదవేదాంతముల నిజార్థ నిరూపణమునకు, లోకులను తరింపజేయుటకు మాధ్వులుగ వెలయగలిగిరట.

ఇట్లుండగా శంకరాది దుర్మతములచే దుఃఖమునొందిన జనులు తరించు టకు, రజితపీఠ మనెడు "ఉడిపి" యందు అనంతేశ్వరస్వామి యుత్సవమును దర్శించుటకు వచ్చియుండగా నడుచుటకు, మాట్లాడుటకు చేతగాని యొకనిమీద అనంతేశ్వరస్వామి ఆవేశమైనందున, వాడు అత్యాశ్చర్యకరముగ ధ్వజస్తంభము మీదకెక్కి శీఘ్రకాలమున మీ మనోవ్యాకులమును దీర్చునట్టి సర్వజ్ఞపురుషుం

దవతరించి లోకములో విస్తరించిన దుర్మతముల ఖండించునని చెప్పగా, జను లందరు సంతోషించి స్వామిని వినుతించి అశక్తుడగువాడిట్లు ధ్వజస్తంభమెక్కి పల్కనందుచే భగవంతుడావేశమై పల్కినాడనియు ఇది నిశ్చయముగా జరుగ గలదనియు విశ్వసించియుండిరి.

ఇట్లుండ రజతపీఠముతో జేరిన శివరూప్యమనెడు వాజక గ్రామమందు నివసించే మధ్యగేహభట్టు అను బ్రాహ్మణుడు సకల విద్యా పారంగతుడై— వేదవతియను కన్యను పెండ్లిజేసుకొని ధర్మము తప్పక సత్కర్మలు జేయుచు అద్వైత మతసూక్తులను ఖండించుచు, ఈ యద్వైతమును రూపుమాపుట కెవ్వరు అవతరింతురోయని చింతించుచు, భార్యాసహితముగ 'ఉడిపి'కి పోయి అనంతే శ్వరస్వామి సన్నిధియందు పన్నెండేండ్లు నివసించి పాలను మాత్రమే సేవించుచు సత్పుత్రుని కృపజేయుటకు ప్రార్థించుచుండగా అతని భార్య వేదవతి గర్భము దాల్చెను. ఆమె చూలింతరాలైనమీదట మధ్వగేహభట్టు స్వప్నమున స్వామి ప్రత్యక్షమై ఇక నీవు నీమందిరమునకు వెళ్ళుమని యనుజ్ఞనీయ నాదేవుని యానతి బడసి యతడు స్వగృహమునకు వెడలిపోయెను. అనంతరము క్రీస్తుశకము 1119-కి సరియగు శాలివాహన శకము 1040 విళంబినామ సంవత్సరము ఆషాఢ బహుళ చతుర్థియందు వాయుమూర్తి యంశము వేదవతి గర్భమున పురుష శిశు రూపమున జన్మించెను.

ఇట్లవతరించిన వాయుమూర్తికి మధ్యగేహభట్టు వాసుదేవాచార్యులని నామ కరణము గావించెను. ఒకనాడు శ్రీ భట్టుగారు తన పుత్రు నెత్తుకొని అనంతే శ్వరస్వామి సన్నిధికిబోయి అతనిముందు పుత్రునుంచి అనేక రీతుల స్తుతించి పుత్రునితో దిరిగి యరణ్యమార్గమున చీకటిలో వచ్చుచుండ దారిపొడుగున భూత ప్రేత పిశాచములు కేల్మోడ్చి వాయుమూర్తియగు వాసుదేవాచార్యులను వినుతించె నట అదిజూచి మధ్యగేహభట్టునకు అత్యంతాశ్చర్యము జనింప, ఈ కుమా రుడు మానవమాత్రుడు కాదని నిశ్చయించి యిల్లుజేరెను. తర్వాత వేదవతి అయిదారు నెలలు గడచిన తన బిడ్డను బంధురాలగు నొక కన్యవద్దనుంచి ఇంటి పనులు జేసుకొనుచుండ ఆ బిడ్డ ఏడ్పు లంకించుకొని యెంతకూ మానడయ్యెను. బిడ్డ నూరడించుటకై పశువులకొరకై పక్వము జేసిన ఉలవ గుగ్గిళ్ళను కొన్ని పసివాని ముందుబోయగా వాటి నాతడారగించమొదలుబెట్టి కొంచెము కొంచెముగా

నలుబది సేర్ల గుగ్గిళ్ళను తినివేసెను. అదిజూచి యందరు నాశ్చర్యమొంది యితడు మహాత్ముడని వినుతించిరి. మరియొకనాడు ఏడాది వయస్సుగల యీ శిశువు యెద్దుతోక బట్టుకొని కీకారణ్యము ప్రవేశించి యచట నిర్భయముగా నాడుకొను చుండెను. ఆ సంగతి గోపాలకులవలన తెలిసికొని యాతని తలిదండ్రు లచ్చటికి బోయి బిడ్డను తిర్గి యింటికి గొనితెచ్చుకొని సంతోషించిరి.

మధ్యగేహాభట్టు అప్పుల వానిచే నిర్బంధ పరుపబడి భోజనమునకుగూడా వెళ్ళకుండా అప్పులవారు నిర్బంధించుచు అడ్డగింప వాసుదేవాచార్యుడను యీ బాలకు డచ్చటికేగి ఆటకొరకు దాచియుంచిన కొన్ని బీజములు వారికిచ్చిన అవి ధన రూపమున వారికగుపింప అప్పులవారు సంతోషముతో వెళ్ళిపోవుచు మధ్యగేహాభట్టును విడిచిపెట్టిరి. కొంతకాలమునకు మధ్యగేహభట్టు సొమ్ము దీసుకొనిపోయి అప్పులవారికీయ వారు నీవివ్వవలసిన సొమ్ము నీకుమారుడు బీజములుగా యిచ్చినవాటిచే మాకు ముట్టినది. మాకు సొమ్ము నీయనక్కరలేదని జెప్పి పంపించిరి.

కొన్నాళ్ళకు మధ్యగేహబట్టు మొదలగువారు తమ బంధుజనుల వివాహార్థము బయలుదేరిపోయి అన్య గ్రామమున నుండగా వాసుదేవాచార్యులు యెవరికి తెలియకుండ, ఒంటరిగా తండ్రి తదితరులకు జెప్పకుండ వివాహ స్థలమును వదలి "నారికేళి" యనుచోటికి వచ్చి అచట శ్రీహరి దర్శనము జేసికొని యచ్చోటుబాసి "ఉడిపికి" వచ్చి అనంతేశ్వర స్వామిని సేవించుచు నచటనే యుండిరి. అప్పుడా వాసుదేవాచార్యుడు యెటకు వెళ్ళినాడోయని, సంగతి దెలియక మధ్యగేహాభట్టు కొడుకుకై విలపించుచు "ఉడిపి"జేరి స్వామివారి సాన్నిధ్యమున కుమారునిజూచి సంతసించి, 'నాయనా! నీవు అరక్షుడవు, బాలుడవు ఒంటరిగా యిచ్చటికెట్లు జేరితివి, నీకురక్షులుగా ఎవరైన యుండి ఇచటికి తెచ్చి విడిచిరా? లేక నీవొకడవే యిచటికి రాగలిగితివా తెలుపు' మన, "తండ్రీ! నాకు యీ 'ఉడిపి' యందుండు అనంతేశ్వరస్వామియు విమానముందుండు చండికాదేవియే రక్షకులై యిచ్చటికి తెచ్చి విడిచిరి. నాకింతకంటె రక్షకులెవరు?" అన మధ్యగేహాభట్టు సంతసించి స్వామిని అనేకరీతుల సంస్తుతించెను అనంతరము వాసుదేవాచార్యులు "ఉడిపి" యందే విద్యాభ్యాసము జేయుచుండెరి. ఒకానొకప్పుడు ఒక గ్రామమున జరిగిన వివాహమందు వాసుదేవాచార్యులు

పుస్తకము చదివినందున వారి వాగ్వైఖరికి మెచ్చి అచ్చటి పెద్దలు ఘృతవల్లి యను గ్రామమును వాసుదేవాచార్యులకు దానము జేసిరి. ఘృతవల్లికి ఒకనాడు వాసుదేవాచార్యులు పోయి అక్కడ శివభట్టు అనువారు పురాణ కాలక్షేపము జేయుచుండ విని, 'అతనితో నీవుజెప్పు పురాణ విశేషము సిద్ధాంతమునకు విరోధముగా నున్న'దని ఆక్షేపించి తానే పురాణమును ప్రజలకు సిద్ధాంతీకరించి వినిపించిన అచ్చటి వారందరు మహదానందము నొందిరి. ఒకప్పుడు తండ్రియగు మధ్యగేహభట్టుకు తెలియని విషయము లెన్నింటినో వాసుదేవాచార్యు డతనికి బోధించుచుండిరి. ఇంకా వాసుదేవాచార్యున కప్పటికి ఉపనయనము జరుగకుండెను. ఒక శుభ ముహూర్తమున మధ్యగేహభట్టు కుమారునకు నుపనయనము గావించెను. అంతటితో వాసుదేవాచార్యులు క్రమముగా బ్రహ్మచర్యాది ఆశ్రమ నియమములు నెరవేర్చుచుండిరి. ఇట్లుండగా ఒకనాడు వాసుదేవాచార్యుల నొక పాము గరచెను. పాము కరచిన వెంటనే అది మృతిబొందెను. కరవబడినవాడు బ్రతుకుట కరిచిన పాము వెంటనే మరణించుట జూచిన జనులు ఈ వింతకు పరమాశ్చర్య నిమగ్నులై యీతని మాహాత్మ్య మమోఘమని తలంచిరి. వాసుదేవాచార్యులు సహాధ్యాయులతోగలిసి వేదాధ్యయనము జేయుకాలములో ఉపాధ్యాయుడు వాసుదేవాచార్యునిజూచి నీవు వృధా కాలక్షేపము జేయుచున్నాడవనియు, శ్రద్ధగా చదువుటలేదనియు నిందారోపణ జేసిరి. అందుకు వాసుదేవాచార్యుడు ఉపాధ్యాయుని సమక్షమున నిలిచి సకల వేదాది గ్రంథ రహస్యముల నన్నింటిని నన్నర్గళముగా పఠించి ఉపాధ్యాయులకు పరమాశ్చర్యము గలిగించుటేగాక అతని సంతోషమునకు పాత్రులై కడు మన్నన లందిరి.

ఆ తర్వాత వాసుదేవాచార్యుడు తను దేశోద్ధారమున కవతరించిన సంగతి గుర్తుకురాగా తాను సన్యాసాశ్రమును నవలంబించుటకు నిశ్చయించి తనకు సన్యాసమునొసంగు అధికారిని వెదుకుటకై బయలుదేరిరి. ఇట్లుండ అతి వైరాగ్య శీలురగు అచ్యుత ప్రేక్షులగు యతీశ్వరులొకరు హస్తినావతియందు వసించుచుండి యచ్చోటు బాసి "యుడిపి" కి వచ్చి అనంతేశ్వర స్వామిని సేవించుచుండిరి. అప్పుడొకరిపై అనంతేశ్వరస్వామి ఆవేశించి, అచ్యుత ప్రేక్షాచార్యుల నుద్దేశించి "నీ యొద్దకొక శిష్యుడు రాబోవుచున్నాడు. వానికో నా నిజస్వరూపము నెరుగుమని" చెప్పెను. అత డామాటలు విని సంతోషించుచుండగా వాసుదేవాచార్యులు అచ్యుత ప్రేక్షాచార్యుల సన్నిధికి వచ్చి నిలిచిరి, అతనిని సన్యాస

మిప్పించుడని ప్రార్థించిరి. పుత్రశోకముచే పరితపిస్తూ వచ్చిన మధ్యగేహభట్టును, అతని సతీమణియగు వేదవతిని అచ్యుతప్రేక్షాచార్యులు జూచి, జాలిగొని వాసు దేవాచార్యులతో నీవిప్పుడు సన్యాసమును గ్రైకొనవలదని జెప్పి, వేత్రవతీనదీ తీరమునందుండు మఠమునకు వెళ్లిపోయిరి. వాసుదేవాచార్యుడు తన పట్టుదల వదలక అతని వెంబడించి వేత్రవతీ తీరమునకుజేరి యచటనే నివసించియుండెను. అప్పుడొకరిపై అనంతేశ్వరస్వామి ఆవేశమై అచ్యుతప్రేక్షాచార్యుల నుద్దేశించి "నీకు తగిన శిష్యుడగు పూర్ణప్రజ్ఞునొకని నిచ్చెద పుచ్చుకొమ్మని" వాసుదేవా చార్యులను దెచ్చిచూపెను. అప్పుడు అచ్యుతప్రేక్షాచార్యులు యితనిని శిష్యునిగా జేకొనెను. ఒకనాడు వాసుదేవాచార్యుడు అచ్యుతప్రేక్షాచార్యుల వద్దకు వెళ్ళి "స్వామీః నాకు భాగీరథీనదికివెళ్ళి స్నానమాచరింపవలయునని కోరికగల్గుచున్నది. తాము సెలవిచ్చినచో భాగీరథికి వెళ్ళివచ్చెద"ననుచుండ, అచటగల నొకనిపై అనంతేశ్వరస్వామి ఆవేశమై "నీవు భాగీరథికిపోగూడదు ఇచటనుండు సరో వరములో భాగీరథి గలదు దానిలో స్నానముజేయు"మనెను, అది విని వాసుదేవా చార్యు లచటికి బోయిచూడ భాగిరథిదేవి యతనికా సరోవరమున దర్శనమిచ్చెను. దానిలో స్నానమాచరించి యితడు కృతకృత్యుడాయెను, ఇప్పటికా సరోవర మునకు మధ్వాచార్యుల జ్ఞాపకార్థము పన్నెండేండ్లకొకసారి గంగాదేవి వచ్చు చుండునట.

ఆ తర్వాత వాసుదేవాచార్యులు నిజజననీ జనకుల నూరడించి మీకు నేటికి మూడు లేక ఐదవ దినమున ఉదయము సింహలగ్నమునందు దీర్ఘాయుష్మంతు డగు మగశిశువు కలుగబోవుచున్నాడు. వాడు కలిగిన తర్వాత నేను సన్యాసము స్వీకరించెద నని చెప్పిరి. అలాగే వారికి మఱియొక కుమారుడు పుట్టగా నతనికి విష్ణుతీర్థులని నామకరణ మొనరించిరి.

ఆతర్వాత వాసుదేవాచార్యులు యత్యాశ్రమమును స్వీకరించి వేదాంతోప దేశములుజేయమొదలిడెను. ఆవేదాంతోపదేశములకు అద్వైతులు మొదలగువారు వచ్చివినుచుండిరి. మఱియొకప్పుడు తమయొద్ద నెప్పుడుండిన భాగవత పాఠభేద మును సహితము సవరించి ఆగంతకులకు యుక్తియుక్తముగా వేదవ్యాస హృదయమును బోధించిరి. అదిజూచిన గురువులగు అచ్యుతప్రేక్షులు వాసుదేవుని యెడ కడుసంతసించి బ్రహ్మమీమాంసాది శాస్త్రములనితరులైన శిష్యులకు వాసుదే

వాచార్యుడే బోధించునట్లు నియమించిరి. ఇట్లుండగా అచ్యుత ప్రేక్షాచార్యుల స్నేహితుడైన ఒక అద్వైత సన్యాసి శిష్యబృందముతోడ "ఉడిపి"కి వచ్చి వాసు దేవాచార్యులతో "లోకము అసత్యము" అను వాదము జేసి ఓడిపోయెను. వాసు దేవాచార్యుడా సన్యాసికి నిజము దెలియజేసి విజయమును పొందిపంపించివేసెను. మరియొకమారు బౌద్ధమతస్థుండగు బుద్ధిసాగరుడను వాడు వీరితోవాదముజేసి ఓడిపోయిరి. అంతేగాక అనేక మతవాదులను వాసుదేవాచార్యులు జయించిరి. తర్వాత వయోవృద్ధులైన లికుచాన్వయ బ్రాహ్మణయతిశ్రేష్ఠు లొకరు వాసుదేవా చార్యులనుంచి శంకరాచార్యుడు జేసిన యపార్థములను నిజార్థములుగా బోధించుట కనువగు రీతి బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానమురచింపుడని తెలుప వారియను మతిని బడసి యట్లే గావించిరి.

ఆతర్వాత అచ్యుతప్రేక్షాచార్యుల తోడ దిగ్విజయార్థమై బయలుదేరి విష్ణుమంగళ దేశమున కుంబోయి యొకబ్రాహ్మణునియింట భిక్షజేసి యిన్నూటి కంటె నెక్కుడగు అరటి పండ్లను మధ్వాచారులు (వాసుదేవాచార్యులు) భక్షింపగా అందరుఆశ్చర్యమొందిరి అనంతరమచ్చోటగల మాయావాద మతస్థులనందరిని జయించి, క్షీరనదినిదాటి అనంతశయనమునకుబోయి స్వామిని దర్శించి యచ్చోట పండిత సభయందు బ్రహ్మసూత్ర ప్రవచనమును జేయుచుండగా, అద్వైతులు కొందరచ్చటికివచ్చి వాదింపజొచ్చిరి. అప్పుడు మధ్వాచార్యులు వారినందరిని జయించి ప్రణుతులందిరి. అచటినుండి వెడలి కన్యాకుమారి మొద లుగా గల పుణ్యతీర్థములయందు స్నానముజేసుకొని రామేశ్వరమునకుబోయి, రామలింగేశ్వరునియం దంతర్గతుడగు విష్ణువును నుతించి, అచటినుండి తిర్గివచ్చుచు మార్గమధ్యమునందు అద్వైతాది మతవాదులను జయించిరి. అటుపిమ్మట సేతువు నందు చాతుర్మాస్యవ్రతాద్యనుష్ఠానములను నెరవేర్చుకొని, యామీద శ్రీరంగ మునకువచ్చి స్వామిని దర్శించి, అచ్చోటుబాసి క్షీరనదికివచ్చి యందుండు పల్లి కొండ దేవస్థానమునకువచ్చి యచ్చటగూడిన పండితసభయందు కుమతులైన పండితులను జయించి విష్ణుసహస్రనామములకు అర్థశతకమునుజెప్పిరి, అపుడా బ్రాహ్మణులు సంతోషించి వీరు సర్వజ్ఞులని ప్రశంసించిరి, ఇట్లు దక్షిణదేశమును జయించుకొని "ఉడిపి" జేరిరి.

ఆమీద మధ్వాచార్యులు వేదముయొక్క వ్యాకులత్వమునకు సహింపని వారై, శిష్యులతోడ తమ 17వ యేట బదరికాశ్రమమునకు బోవ నిశ్చయించి,

గీతా భాష్యమును రచించి బదరికి ప్రయాణమై బయలుదేరి, మార్గమధ్యమున యవనదేశమున ప్రవేశించి ఆ దేశపు రాజుచే సన్మానము బొందిరి. అనంతరము బదరికాశ్రమముజేరి యందలి నారాయణాశ్రమమునకుబోయి తాను రచించిన గీతా భాష్యమును స్వామికి సమర్పించి నమస్కరించి పఠింపగా, మధ్వాచార్యుల యెడ నారాయణస్వామి కడుసంతోషించెను. అటు పిమ్మట మధ్వాచార్యులు బదరికాశ్రమమునందుండు అనంతమఠమున నివసించి అనశనవ్రతమును కాష్ఠ మౌనముతో నిర్వర్తించిరి. తర్వాత వ్యాసులు మధ్వాచార్యులను బదరి కాశ్రమములోనుండు తమ మఠమునకు వచ్చునట్లనుజ్ఞ జేయగా నట్లే వ్యాసా శ్రమమునకు బోవుటకు నిశ్చయించిరి. ఆయన శిష్యులతో సత్యతీర్థులనువారు మాత్రము ఆచార్య విశ్లేషమునకు సహింపక వెంబడించిరి. మధ్వాచార్యులు మాత్రము వాయుస్వరూపులుగావున నొక గుట్టపై యడుగుంచి మరియొకగుట్టకు వేరొక యడుగుంచుచు పోవుచుండిరట. సత్యతీర్థులకు గురువుల వెంటనంటి పోవుటకు శక్యముగాక మఱలి యనంతమఠము వచ్చిచేరిరి.

మధ్వాచార్యులు వ్యాసాశ్రమమునకుబోగా నచ్చటనుండు ఋషులెల్ల నెదుర్కొని సన్మానించిరి. మధ్వాచార్యులు వ్యాసులవారికి నమస్కృతులొనర్చగా వ్యాసులు మాధ్వులను తమ రెండుచేతులతో నెత్తి యాలింగనముజేసికొని యుక్తా సనమున గూర్చుండజేసిరి. ఆ తర్వాత మధ్వాచార్యులు తామురచించిన బ్రహ్మ సూత్రభాష్యమును సమర్పించగా వ్యాసులు దానినిజూచి సంతోషించిరి. అనంతరము మధ్వాచార్యులు ఋగ్వేద భాష్యము, ఉపాధిఖండనము, ప్రపంచ మిథ్యాత్వానుఖండనము, తత్త్వవివేకము మొదలగు ముప్పదియేడు గ్రంథములను రచించి వ్యాసులకు వినిపించిరి. వ్యాసులు సంతసించియొసంగిన ఎనిమిది సాలగ్రామములనుదీసుకొని తిరిగి శిష్యసమేతముగా బయలుదేరివచ్చుచు,ద్వారకకు జేరగా వారికచట ఒక ఓడలో శ్రీకృష్ణ విగ్రహములభించెను, దానికలదియున్న గోపీచందనమును విగ్రహమును గైకొని ఉడిపిజేరిరి. తాను వ్యాసాశ్రమము నుండి గ్రహించితెచ్చిన సాలగ్రామములలో నొకదానిని ఉడిపిలోస్థాపించుటేగాక, ఆ శ్రీకృష్ణ విగ్రహమును గూడా అచట ప్రతిష్ఠించిరి. తర్వాత ఆరు సాలగ్రామ ములను సుబ్రహ్మణ్య క్షేత్రమున ప్రతిష్ఠించిరి. మరొకదానిని మధ్యతాలము నందు ప్రతిష్ఠజేసిరి, తుదకు "ఉడిపి" యందే స్థిరనివాసముజేయుచు తాను రచించిన గ్రంథములకు వ్యాఖ్యానముజేయునట్లు జయతీర్థులనెడి తమ శిష్యుల

కనుజ్ఞయొసంగి, పద్మనాభతీర్థులు, నరహరితీర్థులు. అక్షోభ్యతీర్థులు, అను నల్వురు శిష్యులను ద్వైతసంప్రదాయ ప్రవర్తకులుగ నియమించి డెబ్బదియేడు సంవత్సరముల ఆరు నెలల ఇరువది దినములు, స్వసంప్రదాయస్థానము నధిరోహించి తర్వాత శిష్యులైన పద్మనాభతీర్థులకు స్వస్థానమును పట్టాభిషేకము జేసి బదరికాశ్రమునకుబోయి, వ్యాసాదిమహర్షులతోడ సద్గ్రంథకాలక్షేపము జేయుచు మధ్వసిద్ధాంతము భూలోకమున వృద్ధియగునట్లు భగవంతునిప్రార్థించుచు నారాయణ సామీప్యములోనుండిపోయిరి.

(ఇతడు మృతుడైనట్లు దెలుపబడలేదు)

## ద్వైత సిద్ధాంతము

శ్రీహరియే సర్వోత్తముడైన దేవుడు, జగము సత్యము. జీవపరమాత్మలకు భేదముకలదు. ప్రాణి సమూహమంతయు తారతమ్యానుగుణముగా విష్ణువు యొక్క కింకరులు, స్వాత్మసుఖానుభవమేమోక్షము. నిర్మలమైన భగవద్భక్తియే మోక్షమార్గోపాయము. ప్రత్యక్షాది ప్రమాణత్రయము ప్రమాణము. సమస్త వేదశాస్త్రేతర సమధిగమ్యుడైనవాడు శ్రీహరియొక్కడే పరత్వము అని ముఖ్య సిద్ధాంతము.

ఈ ద్వైతసిద్ధాంతము దాదాపు వైష్ణవసిద్ధాంతమగు విశిష్టాద్వైతమునుబోలి యుండినది. విశిష్టాద్వైతములో అస్పృశ్యతనుగూర్చి యెట్టివిధులు గలవో దీనిలోగూడా యట్టివిధులేగలవని నమ్ముటకు వీరి సిద్ధాంతములలోగల "ప్రాణి సమూహమంతయు తారతమ్యానుగుణముగా విష్ణువుయొక్క కింకరు" లనియెడు దానిని ప్రామాణికముగా దీసుకొనవచ్చును. కాని వీరు అస్పృశ్యతనుగూర్చి అంతగా పట్టించుకొనలేదు. దానిని అమలులోనుంచుట ధర్మమని ప్రచారము గూడాజేయలేదు. ఇది దాదాపు వైష్ణవసిద్ధాంతమేగాన దీనికి అత్యంత ప్రత్యేకత కలుగలేదు.

# హిందూ ధర్మము

## సప్తమాశ్వాసము

~~~

## హిందూధర్మ ముఖ్య విధులు

ఇంతవరకు హిందూమతములోగల త్రివిధసిద్ధాంతములు-సిద్ధాంతకర్తల జీవిత చరిత్రములు తెలియజేయబడినవి. వీరుగాక యితరులెందరో యీ మత సిద్ధాంతములను ప్రచారముజేసిరి. వారిలో ముఖ్యులు వల్లభాచార్యులు. వీరిది శుద్ధాద్వైతసిద్ధాంతము. ఈ వైష్ణవ సంప్రదాయానుకూలురలో చైతన్యులు వంగదేశములో జన్మించిన కృష్ణభక్తులు. వీరు అంటరానితనమును నిర్మూలించుట కనేక రీతుల శ్రమించుటేగాక మాలమాదిగలకందరికి వైష్ణవమతమిప్పించిరి.

సర్వసాధారణముగా హిందూమతములోకి అస్పృశ్యతను జొప్పించినవారు రాజగురువులు-రాజులు, స్మృతులలోదప్ప ఇతరగ్రంథములలో అంటరానితనమునుగూర్చిన పట్టింపులు లేవు. వర్ణాశ్రమాచారాదులు విపులముగా స్మృతులలోనే జెప్పబడియున్నవి.

హిందూమతములోగల కొన్ని విశిష్ట విధులను తెలుసుకొనుట ప్రతివారి కావశ్యకమై యున్నది. ఈ మతములో అతి ముఖ్యమైన ధర్మవిధులు ఐదు.

1. అహింస 2. సత్యము 3. అస్తేయము 4. బ్రహ్మచర్యము 5. అపరిగ్రహము
~~~

## అహింస :

అహింస యనగా, ఏయొక ప్రాణినైనను హింసించకుండుటయని యర్థము. ప్రాణులను చంపుట- బాధించుట- కృశింపుట- శోషింపుట క్షోభపెట్టుట మొదలగునవి హింసయనబడును. ఈ హింస లేనితనమే అహింస.

అహింసావ్రత నియమము కడుదుస్తరమైనది. దీని నాచరించుట మానవ మాత్రులతరముగాదని తేలిపోయినది. హింసాహింసల స్వరూపములనుగూర్చి మహాభారతములో ధర్మవ్యాధుడు కడువివులముగా తెలియజేసెను. ప్రతివాడు అంతోయింతో ఓపినకొలది హింసజేయనిదే జీవయాత్రసాగుట దుస్తరమని తెలిపినాడు. ఎట్టివానికైనను హింసజేయకతప్పదని నుడివినాడు. సమస్త ప్రాణికోటిచే నిండిన యీ జగత్తులో మనముపీల్చే యూపిరిలోనే లక్షలాది జీవములు బలియౌతున్నవనియు, మనము త్రాగునీటిలో యెన్నియో జీవములు హతమగుచున్నవనియు, మన భోజనాదికములలో కొన్ని లక్షల జీవసమూహము సంహరింపబడుతున్నవనియు నిష్కర్షగా దెలిపియున్నాడు కాని యవి అల్పప్రాణులు. దృగ్గోచరములైన అధికప్రాణులనిధనమే హింసయని కొందరు వాదింపవచ్చును. సృష్టిలో గల స్థూలసూక్ష్మ శరీరస్థమగు ప్రాణిమాత్రుడు సమానుడేయని సిద్ధాంతీకరణజేయువారు లేకపోలేదు. ఐనను కొంతలోతుగా పరిశీలిస్తే చీమను చంపిన తప్పులేదుగనుక యేనుగునుచంపిన తప్పునది వాదనకు నిలువజాలదను విషయమును తెలియజేయుచున్నది. అహింసావ్రత తత్పరుడైనవాడు అల్ప ప్రాణుల నారగించి అధికప్రాణుల రక్షణజేయుచు నేనెప్పుడు హింసజేయలేదని భ్రమపడునని ధర్మవ్యాధుడు వ్యక్తపరిచినాడు.

కూరగాయలు భుజించు శాఖాహారికి హింసలో నిమిత్తము లేదనియను కొనుటకు వీలులేదు. నాగలితో భూమిని దున్నినపుడు కోట్ల ప్రాణులు హతమైపోవును. పంటలు పండించే సమయంలో కీటక సంహారము మొదలగునవి జేయవలసివచ్చును పంటకోసి కుప్పనూర్చి ధాన్యము దంపి, చెఱిగి, పక్వముజేసి భుజించువేళలలో యెనలేని జీవకోటి నిధనమునకు పాల్పడవలసివచ్చునను సత్యమును గుర్తుంచుకొన దగినదైయున్నది. వాటిని మనము గణన లోకి తీసుకొనక, మేము హింస నాచరించలేదను భ్రమకు లోనౌతున్నాము. మనమెప్పుడు హింసచేయలేదని జెప్పుట కర్తులము కాము. కొందరు మనకనుల

యెదుటనే అధిక ప్రాణులను మత్స్య మేషాది జంతు మాంసములను భుజించు చుందురు. వారందరును పాపాత్ములు—హింసాపరులును, వీటిని భుజించనివారు పుణ్యాత్ములు అహింసావ్రత తత్పరులు కానేరరు. వీరిలో ప్రాణిహింస జేయలేదని జెప్పుయధికార మెవరికినిలేదు.

స్థూల శరీరయుక్తములగు జంతు మాంసములు దినుట పాపహేతుకమని జెప్పునప్పుడు వాటికంటే సంఖ్యలో లక్షలకొలది ప్రాణులను హరించువారిమాట యేమని ప్రశ్నించుట పొరపాటుకాదు. ఈ విషయముపై ధర్మవ్యాధుడు ధర్మ సూక్ష్మములను చాలా లోతువరకు వెళ్ళి పరిశీలనజేసి విశదపరిచినాడు. గావున మాంసభక్షణ పాపము గాదను వాదమునకు బలము లేకపోలేదు.

మాంస భక్షణ జంతుహింసజేయక లభింపదుగాన, మరి హింస దేనినందు రను సందేహము బొడముట సహజము. ఇక్కడ హింసయనగా సాధులను బాధించుట—సజ్జనులను శోషించుట, మోసగించుట. సత్ప్రవర్తకులను మానసి కంగా హింసజేయుటకే యెక్కువ ప్రాధాన్యత లభించుచున్నది. కాని మాంస భక్షణకుకాదు.

ధర్మవ్యాధుడు మాంసముల నమ్మేవాడుగాన అతని వాదము మాంస పక్షపాతముతోగూడినదై యుంటుందని కొందరనవచ్చును. దీనికి మరొక ఉదాహరణము మనకు వాల్మీకి రామాయణములో లభించుచున్నది.

శ్రీరామునితో అనుజ్ఞగొని ఆంజనేయుడు సీతాన్వేషణకొరకు దక్షిణదిశకు వెళ్ళి సముద్రమును లంఘించి, లంకాపురిలో ప్రవేశించి, లంకనంత కలయ వెదకుచుపోవగా, తుదకు అశోకవనములో శింశుపా వృక్షముక్రింద సీతాదేవి దర్శనము లభిస్తుంది. జానకిని జూచిన హనుమంతుడు కడు సంతోషమున ఆమెతో సంభాషించి తన్నెఱింగించుకొని శ్రీరామచంద్రుడు తనతో ఆనవాలుగా బంపిన ముద్రికను ఆమెకందీయ సీతాదేవి దానినందుకొని సంతోషించి శ్రీరాముని గూర్చిన యోగక్షేమముల నడుగ నాయాంజనేయుడు రాముని దైన్యస్థితినిగూర్చి సీతతో నిట్లు తెలియజేసెను.

శ్లో॥ న మాంసం రాఘవో భుఙ్క్తే న చాపి మధు సేవతే,
వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పఞ్చమమ్

—వాల్మీకి రామాయణము

( షట్త్రింశస్సర్గ: 41వ శ్లోకము )

తా॥ ఓ సీతాదేవీ! శ్రీరాముడు మాంసమునుగాని, మద్యమునుగాని సుఖకాలము నందువలె అనుభవించుటలేదు. అయితే ప్రాత స్సంగమ మధ్యాహ్న అపరాహ్ణ సాయంరూపములైన కాలములలో ఐదవ కాలమునందు వాన ప్రస్థులకు భుజింపదగిన కందమూలాది ఫలములను అనుదినము భుజించు చున్నాడు. (ఈ శ్లోకార్థముచే పదియవదైన మన్మధావస్థలలో 'అరతి' యను దానిని సూచించును, )

సీ॥ నిన్ను బాసినగోలె నియతితో నంచిత
స్థండిలశయనుడై యుండు నెపుడు
మధుసేవజేయడు మాంసంబు ముట్టడు
నిద్ర యెన్నడు బోడు నిద్రగన్న
గల నిన్ను పేర్కొను గమనీయఫలపుష్ప
కాంతాదివస్తువుల్ గన్నయపుడు
''హా సీత హా సీత''యనుచు మానముదూల
వలవంతలో గుందు వగల బొగలు

గీ॥ వేడియూర్పుల నిగిడించు విరహవహ్ని
వేగు సిపోక దలపోయు విన్నబోవు
వినుతవిక్రమ కథలందు వేడ్కలేదు
పడతి చెఱబోయె నని లజ్జ పలవరించు.

—భాస్కర రామాయణము సుందరకాండము 303 పద్యము

దీనివలన శ్రీరామచంద్రుడు మాంసభక్షణమేగాకుండ, మద్యపాన మొనర్చుచుండెడివాడని తెలుచున్నది. అట్టి యవతారపురుషుని దేవాలయములు నిర్మించి మనము పూజించుచున్నాము. అతడు పూజింపబడుటకు శమదమాది

సద్గుణములే కారణము. అంతేగాక బ్రహ్మచర్యము, పితృవాక్య పరిపాలనము, శౌర్యౌదార్యాది గుణవిశేషము లా పురుషోత్తముని పూజనీయుని గావించినవి. మరియొకచోట రామునిగూర్చి హనుమంతుడిట్లు దెలిపియున్నాడు.

మ॥ రవిరోచిష్ణుడు భాసహిష్ణుడు రణప్రస్ఫారనానాజయో
త్సవవర్ధిష్ణుడు సచ్చరిత్రుడు సురక్షాకేళివిష్ణుండు నా
హవవీరారినిరాకరిష్ణుడును సత్యాలంకరిష్ణుండు ప్రా
భవలక్ష్మీప్రభవిష్ణుడున్ గుణగణభ్రాజిష్ణుడున్ జిష్ణుడున్

( భాస్కర—సుంద. 283 పద్యము )

ఒక్కమాటలో చెప్పవలసివచ్చినచో, మాంస భక్షకుడు అస్పృశ్యుడును పాపాత్ముడు కాదని తెలియుచున్నది. మాంసము తపస్స్వాధ్యాయ వ్రతధర్మ నియమపరులకు దప్ప సర్వసాధారణులకు నిషేధింపబడియుండలేదు. తపో నిష్ఠాత్ములకు మధుపాన మాంస భక్షణములచే యింద్రియ ప్రకోపము జెంది యింద్రియ వివశులై నిష్ఠాభంగము జరుగు ప్రమాదము లేర్పడును గావున వారి కది నిషిద్ధమని తెలియజేయబడినది.

ఆ॥ సగర నల డిలీప నృగు భగీరథ ముఖ్య
నృపులు వార్షికంపు నెలలు నాల్గు
మాంసభక్షణంబు మానుట నుభయలో
కంబులందు పెంపు గాంచి రంద్రు

- భారతము —అనుశాసనిక, పద్యము 301

భీష్ముడు ధర్మరాజుకు ధర్మవిధులు బోధించుచు మాంస భక్షణము తపో నిష్ఠాగరిష్ఠులు సత్క్రియాశువులు కొంతకాలమైనను మానవలయునని తెలిపి యున్నాడు.

సగరుడు, డిలీపుడు, నృగుడు, భగీరధుడు మొదలగు మహారాజులు సంవత్సరమునకు నాల్గునెలలు మాంసభక్షణము మానివేసి ఉభయలోక విఖ్యాతిని బొందిరని వక్కాణించినాడు. (తక్కిన యెనిమిది నెలలు వీరు మాంస భక్షణము జేసిరని గదా భావము) పైన గనుపరచిన ఉదాహరణములవలన క్షత్రియాదు లకేగాక తదితరులకును మాంసము నిషిద్ధము కానిద్రై, తపోనియమాదులు

సలుపు నపు డది నిషిద్ధమను భావమును వ్యక్తీకరించునదై యున్నది. మాంస భక్షులైన శ్రీరామచంద్రాదులు పాపాత్ములు కానపుడు సామాన్యులు పాపులెట్లు గుదురను సందేహము పొడము చున్నది. స్పృశ్యాస్పృశ్యములు మాంసాదులు భుజించినందువలన నిర్ణయింప బడజాలవు.

ఇచ్చట మనము గమనించదగిన ముఖ్యాంశము : హింసయనగా ? మోసము, దౌర్జన్యము, శోషణ, అబద్ధము, పరపీడనమని తేటపడుచున్నది, మన పూర్వజులగు పెద్దలు పాపపుణ్యములను గూర్చి తెలుపుతూ ఇట్లనిరి.

శ్లో ॥ శ్రూయతాం ధర్మ సర్వస్వం
యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ
పాపాయ పర పీడనం

అన్ని ధర్మములయందును, అన్ని గ్రంధములయందును, కనబడు వినబడు మౌలిక సత్యమొకటే యనియు, అది పరులను పీడించుట పాపము, పరోపకారము జేయుట పుణ్యమని పై శ్లోకార్థము. పైన గనుపరచిన శోషణ, దౌర్జన్యాది దుర్గుణములు గలవాడే హింస జేయువాడని ధర్మనిర్ణయము.

ఇక అహింసకు తపమునకు అవినాభావ సంబంధమున్నదనుట నిర్వివాదాంశము. తపస్సునకుగల సాధారణ నియమములు భగవద్గీతలో త్రివిధములుగా పేర్కొనబడి యున్నవి. అవి వాచిక, మానసిక, కాయిక తపస్సులని స్పష్ట పరుపబడి యున్నది.

### కాయిక తపస్సు

శ్లో ॥ దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

—భగవద్గీత

తా ॥ దేవతలను, ద్విజులను, గురువులను ప్రాజ్ఞులను (తెలిసినవారిని) పూజించుటలు మరియు శుచిర్భూతుడై ఋజుమార్గవర్తనుడై యుండుటలు, బ్రహ్మచర్యము-అహింసయు శరీరక తపస్సులని తెలియజేయబడు చున్నవి.

## వాచిక తపస్సు

శ్లో ॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

తా ॥ కఠినముగా పరుషముగా మాట్లాడకుండుటయు, సత్యమును ప్రియత్వమును హితమునుగల్గి మాట్లాడుట స్వాధ్యాయియగుట (ఎల్లప్పుడు చదువుట) అభ్యసించుట మొదలగునవి వాగ్రూపతపస్సులని జెప్పబడుచున్నవి.

## మానసిక తపస్సు

శ్లో ॥ మనః ప్రసాద సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహం
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥

తా ॥ మనస్సునందు అంతఃకరణములయందు దయయు మెత్తదనము కలిగి యుండుటయు, ఇంద్రియ నిగ్రహుడై యుండుటయు, మౌనియై మిత భాషియై యుండుటయు, భావపారిశుద్ధ్యము (చిత్తశుద్ధి గలిగి యుండుట) మొదలగునవి మానసిక తపస్సులని తెలియజేయబడుచున్నవి.

సదాచార సంపన్నుడైన సాధారణుడు పైన సూచించిన త్రివిధ తపస్సులు గలవాడైయుండుటచే ఉత్తముడుగా పరిగణింపబడును. మానవధర్మసాధారణ నియమముల ననుసరించు ప్రతి పౌరుడు దీని నాచరించవచ్చును. కాని యింతకంటె యసాధారణములైన కఠోర తపోనియమములు గలవు. అవి యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులను అష్టాంగ యోగములు. మహాత్ములు యీ యోగముల నభ్యసించి ఊర్ధ్వరేతస్కులై కడు కఠోర తపస్సుల నాచరించిరి. ఇట్టి తపస్సంపన్నులకు మాంసాదులు వర్జించుట మున్నగునవి యావశ్యకములు. ఇవి సాధారణ నియమాదుల ననుసరించు వారికెట్టి నిషేధము సూచింపబడలేదని బోధపడుతున్నది. ఐనను తగుమేరకు మద్యమాంసాదుల వర్జించి అహింసావ్రత తత్పరుడై మానవుడు సంచరించుట శ్రేయోదాయకమని యెరుగవలెను.

## సత్యము : —

సత్యమనగా ? దేనినైనను యున్నదున్నట్లు జెప్పుట. ఉన్నదున్నట్లు తెలిసికొనుట-ఊహించుట లేనిదానిని ఉన్నదానివలె కల్పించి కల్లలు జెప్పకుండుట అబద్ధము లాడకుండుట యనుదానినే సత్యమని జెప్పుట కలదు.

కాని కొన్ని వేళలయందు సత్యమును నిర్ణయించుట కడు దుస్తరమని తెలియుచున్నది. అన్ని వేళలయందు ఉన్నదానినున్నట్లు జెప్పకూడదనియు, అది పైకి మీకు సత్యమువలె కన్పించినను ఘోరతరమైన యబద్ధముకంటెను యెక్కువగు దుష్ఫలితముల నిచ్చునదిగా ఋజువైన యుదంతములు చాలావరకు గలవనియు, భారత గ్రంధమున ధర్మవ్యాధుడు సత్యవ్రత పరులను హెచ్చరించెను

ఉ॥ భూతహితంబుగా బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు ద
ద్భూతభయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు ప్రా
ణాతురుడైనచో పరిణయంబునయందును బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూత్రముల్.

—భారతము, అరణ్య పర్వము, పంచమాశ్వాసము 62

కొన్ని సమయములలో జీవులకు హితకరముగా బొంకు (అసత్యవాక్కు) సత్యఫలము నిచ్చును. జీవులకు భయావహమైన యథార్థవాక్కు అనృత వాక్ఫలితమునిచ్చును. ప్రాణాతురులను, పరిణయాతురులను మొదలగువారిని గాపాడు వేళలలో సమయోచితమును గమనించి సత్యాసత్యముల పల్కుటలు నెఱుంగదగినవని కౌశికునితో ధర్మవ్యాధుడు వచించెను.

కాబట్టి సత్యాసత్యముల గుణదోషములను గుర్తెరిగి సందర్భోచిత ఔషధ ప్రయోగమురీతిగ దానిని వాడవలసియున్నది. అంతేగాక మౌలిక ధర్మసూత్రములగు ''సత్యం వద'' ''ధర్మం చర''యను శ్రుతి నిర్దేశితములను దృష్టిలోనుంచుకొని చాలావరకు సద్ధర్మమార్గవర్తనముననే సంచరించుచు సత్యమునే మాట్లాడవలయును. సత్యవచోవిభవమువలన హరిశ్చంద్ర—ధర్మరాజాదులు యైహికాముష్మిక సుఖములను బడయగలిగిరి. కొందరు సత్యమును గూర్చి తెలుపుతూ, దీనికి శుక్రనీతిని జోడింతురు. వారట్లు జేయుటచే సత్యముయొక్క స్వరూపమే మారిపోవును.

భాగవత పురాణములోగల బలిచక్రవర్తి చరిత్రములో శుక్రాచార్యు డొకచోట బలిచక్రవర్తినిగూర్చి యిట్లనియె.

నవలంబించిన ఉత్తరక్షణము దివాలా దీయుననుట లతిశయోక్తి కానేరదు. అంతేగాక నేడు మనముందు ప్రాపంచిక భోగభాగ్యముల ననుభవించు వారందరు అస్తేయము నవలంభించిన వారు కారు. వారంతయు స్తేయకర్మానుచరణపరులే యని తెలుసుకొనవలసియున్నది. అస్తేయ వ్రతపరులు బా లుపడి దరిద్రు లగుట జూచి మనో దౌర్బల్యముగల వారలందరు స్తేయమునే యాశ్రయింతురు. కాని అస్తేయ విసర్జనము తాత్కాలికముగా తాపము, దుఃఖము, దారిద్ర్యము గలిగించినను, తుదకు ఆత్మసౌఖ్యము, శాంతిపథము, గౌరవముగలిగించునదిగాన అస్తేయ వ్రతమే యందరకు నవశ్య కర్తవ్యము.

## బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యమనగా? ఇంద్రియనిగ్రహమని తెలియదగినదై యున్నది. ఇంద్రియములన నేమిటో తెలిసికొనుట ముఖ్యము. మానవ మాత్రులకు ఇంద్రియములు పదియని నిర్ణయింపబడెను. వీటినే దశేంద్రియములని యందురు. వీటిలో జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. పంచ జ్ఞానేంద్రియములనగా? 1. త్వక్కు (తోలు) 2. చక్షువు (కండ్లు) 3. శ్రోత్ర (చెవులు) 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణం (ముక్కు)

పంచ కర్మేంద్రియములనగా? 1. వాక్కు (మాట) 2. పాణి (చేతులు) 3. పాద (కాళ్ళు 4. పాయువు (గుదము) 5. ఉపస్థ (మర్మస్థానం).

పంచ కర్మేంద్రియములకు ప్రత్యేకవిధు లెవ్వియులేవు. ఇవి కేవలము జ్ఞానేంద్రియములకు లోబడి దాస్యముజేయుచుండును. కాబట్టి కర్మేంద్రియ ప్రాముఖ్యతనుగూర్చి తెలుపుట కెట్టి వివరణలేదు.

ఇక జ్ఞానేంద్రియ పంచకము మానవ కోటిని తమకు వశులను గావించుకొని వారిని కల్లోల పరచుచుండును. పంచ జ్ఞానేంద్రియములకు వాటి వాటికి తగిన విధులున్నవి. వాటినే పంచతన్మాత్రలని యందురు. ఈ పంచేంద్రియములకు ఐదు విధముల అలవాట్లని తెలియ నగును. అవి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. ఇట్టి పంచ తన్మాత్ర సంబంధమును పంచేంద్రియముల కెట్లుండునో వాటిని గూర్చి యిట్లు దెలుపుదురు.

శబ్ద (ధ్వని) స్పర్శ (తాకుడు) రూప (రూపము) రస (రుచి) గంధ (వాసన) ములని వీటికి అభిధానములు. శ్రోతకు మంచి శబ్దము లవసరము. త్వక్కుకు మంచి స్పర్శము అవసరము. ఆఘ్రాణమునకు మంచివాసనలు (సుగంధములు) అవసరము. అనగా పంచేంద్రియములు పైన సూచించిన తన్మాత్రలకు అలవాట్లు బడి పోవును. మనుజులకివి యెంత యెక్కువ లభించునో అంత సుఖపడుతున్నామని జెప్పుదురు. చెవులకు సంగీత గీత వాద్యాదులును, కనులకు కమనీయ సుందర దర్శనీయ వస్తు సముదాయములును, చర్మమునకు సుందర స్త్రీసంభోగాది చర్మ సుఖములును, నాలుకకు షడ్రసోపేతములైన మధుర పదార్థ సంయోగమును, ముక్కునకు సుగంధ ద్రవ్యాఘ్రాణ తృష్ణయు కలిగి యుండుటచే వీటికొరకు మనుజుడు పడరాని పాట్లు పడవలసి వచ్చును. వీటిని పొంద గోరిన నరుడు శ్రమించి, ఇతరులను వంచించి, జయించి, సంపాదించ ప్రయత్నించును. ఈ యింద్రియాదుల కెంత సంపాదించి పెట్టినను తృప్తినందవు. ఇంకా కావలయునని మనుజుని తొందర పెట్టుచుండును, మనకు వీటినెంత కూర్చినను తక్కువేయను భ్రాంతి కలుగుచుండును. వీటికి లోబడిన మనుజుడు వీటి పీడనుండి బయటపడుట కష్టతరమైపోవును. కావున యీ చాపల్యము నెంత తగ్గించుకుంటే, అంతమంచిదని పెద్దలుపదేశింతురు. ఈ యింద్రియ చాపల్య రాహిత్యమునే బ్రహ్మచర్య మని యందురు. దీనికి ప్రమాణముగా

శ్లో॥ మాతృవ త్పరదారాం చ
పరద్రవ్యాణి లోష్ఠవత్
ఆత్మవ త్సర్వభూతాని
యః పశ్యంతి స పండితః

బ్రహ్మచర్య వ్రతాచారుడు పరస్త్రీని తల్లిగాను, పరద్రవ్యమును మంటి బెడ్డగాను, సమస్త ప్రాణులను తన ప్రాణముతో సమానముగాను జూచునను భావమును విజ్ఞులు ప్రబోధింతురు. ఇంద్రియాదులనే గుఱ్ఱములను కళ్లెముతో స్వాధీన పరచుకొని వాటిని తగురీతి నుపయోగ పరచు కొనుచు, జీవయాత్రా పథమున శరీరమను రథమును నడిపి శాంతియను ధ్యేయమును బొంది పరమ గతియను గమ్యమును జేరుట యను దానినే బ్రహ్మచర్య మని యందురు.

ఐనను యీ వ్రతము నాచరించుట సామాన్యుల తరముగాదని తెలియుచున్నది. దీనిని ఓపినకొలది మనుజు డాచరించి జీవయాత్రను సలుపవలసిందని యిట్లు తెలియజేయబడినది.

శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనా
స్తేపి స్త్రీముఖ పంకజం సులలితందృ ష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నం సఘృతం పయో దధియుతం భుంజంతి యే మానవాః
తేషా మింద్రియనిగ్రహో యది భవే ద్వింధ్యః ప్లవేత్సాగరే.

తా॥ విశ్వామిత్రుడు, పరాశరుడు మొదలగు బ్రహ్మఋషులు కేవలము గాలి-నీరు-పర్ణములు తినువారు, గొప్ప తపస్సంపన్నులు ఆడదాని ముఖము జూచినంతనే మోహవివశులై వారి వలలో బడిపోయిరి. సాధారణులైన మానవులు వరియన్నము, నేయి, పాలు, పెరుగు మొదలగునవి భుజించువారలుగదా? వారికి యింద్రియ నిగ్రహము సాధ్యమగునా?

సాధారణులు ఇంద్రియ నిగ్రహమును నాచరించిరని యెవరైన వాదించినచో వింధ్యాద్రి పర్వతము సముద్రములో తేలుచున్నదను మాటకు నెంతయాశ్చర్య పడవలసినదో అంతే ఆశ్చర్యమును వారి యింద్రియ నిగ్రహమును గూర్చి పడవలసినదని పై శ్లోకమునకు భావము.

కావున బ్రహ్మచర్యమూ కడకు కష్టసాధ్యమని తెలిసికొని సాధ్య మైనంత మేరకు దీని నాచరించినవారు నుభయలోకముల ప్రశస్తి గాంతురని తెలియవలెను.

## అపరిగ్రహము :

అపరిగ్రహమనగా ? లభించినదానితో తృప్తిపడే స్వభావము. సమస్తము తనకే కావలయుననే దుర్వాంఛ లేకుండుట. యదృచ్ఛాలాభ సంతుష్టుడై, దొరికిన దానితో తృప్తిపడి యిక నింతటితో యిది చాలునను తృప్తిని వ్యక్తపరచుటకే అపరిగ్రహమని పేరు.

ఈ లోకమున అశాంతి ప్రబలుటకు ముఖ్య కారణము "ఇది చాలదు యింకా కావలయు"నను స్వలాభేచ్ఛయే యనునది జగద్విదితమైన విషయము.

తనకు లభించినదే తనదగును కాని, తనకు అబ్బనిది తన'కక్కఱలేదను యభి ప్రాయమునకు కట్టుబడియుండు స్వభావమునే అపరిగ్రహమని తెలియపలెను. ఈ వ్రతము మానవుని జీవితములో శాంతిని చేకూర్చును. "మేకనోటికి తాటి కాయా ?" యను సామెతగా తన నోటికి రేగుకాయ యబ్బుతుందేగాని, తాటికాయ యబ్బదను నిశ్చయముతో మేక తన యంతస్థును తాను దెలిసికొని వ్యవహరించ వలయుననియు, అట్లే మానవులు తమకు రానిదానికొరకై అరాటపడి యాపద లను కొని తెచ్చుకోగూడదని హెచ్చరించుదానికై బుద్ధిమంతులు అపరిగ్రహ మత్యంతాచరణీయమని యుద్బోధింతురని పెద్దల నిర్ణయము. మనుజుడు తనకు గల దానితో సంతోషింపక ఆశాపాశబద్ధుడై కోరికలనే గుఱ్ఱాలపై స్వారీ జేయ గూడదని అనుభవజ్ఞుల యభిప్రాయమై యున్నది.

క. వ్యాప్తిన్ బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైన పదివే లంచున్
తృప్తిం బొందని మనుజుడు
సప్త ద్వీపములనైన చక్కంబడునే ?

—భాగవతము

తానున్నచోట నుండక విస్తరించుచు, లోకమంతయు తనకే దక్క వలయునను కోరికతో తృష్ణకు లోబడి తనకు ప్రాప్తమగుదానినే పదివేలనుచు సంతోషించుచు తృప్తిపడని నిరంతర వ్యాకుల చిత్తుడైన మనుజుడు సప్తద్వీప సముద్ర ముద్రిత మహీవలయాధికారము తనకు హస్తగతమైనప్పటికిని చాలునని వచింపడు. దీనినే అత్యాశ, పేరాశ, దురాశ యని యభివర్ణింతురు.

ఒక యూరిలో తల్లికొడుకు లిద్దరు కొద్దిపాటి భూమిపై వ్యవసాయము జేసికొని జీవించుచుండిరి. తల్లికొకడే కొడుకైనందున నతనియెడ యామెకు వాత్సల్యము మెండుగా నుండెను. ఒకనాడు కొడుకు పొలము దున్నుచుండ తల్లి విత్తనములు వేయుచుండెను. నాగటి కొనకు తగిలిన వరహాలు నిండిన బంగారు బిందె యొకటి పెల్లగింపబడి వీరికి దొరకగా ఈ పెన్నిధి లభించిన పేదలు దానిని జూచి పట్టరాని యుత్సాహ సంతోషములతో భద్రపరచుకొనిరి.

అంత కొడుకు తల్లిని జూచి "అమ్మా! యింటికిబోయి యన్నము గొని" తెమ్మని యనగా యావిడ వెంటనే యూరనున్న యింటికిజేరి ఇంట్లోగల అన్న

మును మూటగట్టుకొనుచు ప్రలోభమున మతిజెడి యిట్లు వితర్కించుకొనదొడగెను. "మా వాడు వరహాలమూట దొరికినందుకు ఉబ్బిపోయి తనకే సొమ్మంత దక్కుతుందని మిడిసిపడుతున్నాడు. ఈ సొమ్ము పెద్దదాననగు నాకే రావలసి యున్నది. వీడు ఒక్క వరహాకైనా కాదుకదా చిల్లిగవ్వకైనా అర్హుడు కాగూడదు. ఇది వానిచేత జిక్కినపక్షమున దుర్వ్యయముతో మొత్తం ధనము పాడైపోవు''నని నిశ్చయించి అన్నములో విషము గలుపుకొని కొడుకు వద్దకు జేరెను.

ఇక్కడ కొడుకు తల్లివలెనే ఆలోచించి ధనము దానికి దక్కకుండ జేయవలయునని తలచి, ఆమెను చంపనిశ్చయించుకొని, సమీపించిన తల్లిపై నాగలినెత్తివైచి చంపి అమె మృతకళేబరమును పిడకల కుచ్చెలో వేసి దహించి స్నానముజేసి పీడ విరగడైపోయిందిగా సంతోషిస్తూ మాతృమిశ్రిత విషాక్త భోజనము లారగించి తక్షణమే యమాలయమున కతిధిగా వెళ్ళెను. దీనికి ప్రమాణముగా

శ్లో॥ హలాగ్రేణ హతా మాతా
విషాన్నేన హత స్సుతః
మాతా పుత్ర విరోధాయ
హిరణ్యాయ నమోనమః ॥

తా. నాగలిచేత తల్లి జంపించితివి. విషముచేత కొడుకును పొట్టబెట్టుకొంటివి, తల్లి కొడుకులకు తగువులు బెట్టి ఘోర శత్రుత్వమును కల్పించు ఓ బంగారమా ! నీకు నమస్కృతులని పై ప్రమాణమున కర్థము.

కాబట్టి లోభముచేత అమాయకులైన మాతాసుతుల మతిజెరచి, ప్రేమానురాగముల రూపుమాపి ధనసంచయేచ్ఛను వారిలో రగుల్కొల్పి ఒకరితో నొకరిని చంపించిన గుణమునే పరిగ్రహమనియు, దాని విసర్జించుటలే అపరిగ్రహమని యందురు. కావున ఉత్తములు ఆశా కార్పణ్యములకు లోబడక పరస్పర సహనముతో దూరదృష్టి నవలంబించి చరింతురు. ఇది సజ్జనులకు అవశ్యాచరణీయమైన వ్రతము. మితసంచయేచ్ఛ యుండవలసిందేగాని, అంతులేని ఆశలు పాపహేతుకములు.

ఇట్టి యుత్తమోత్తమములైన ఐదు వ్రతముల నాచరించుటచే ఆత్మశక్తి వృద్ధిజెంది మహాత్ములగుదురని హిందూ మతవాదుల దృఢనిశ్చయమై యున్నది.

మానవులు తమ శరీరాభివృద్ధికి (అంగపుష్టికి) పంచభక్ష్య పరమాన్నములు భుజించి బలము చేకూర్చుకొనునట్లు, ఆత్మబలమునకై పైన సూచించిన పంచ వ్రతములే పంచ భక్ష్యములు. వీటిని విధ్యుక్తముగా నాచరించినవాడు మహాత్ముడు, ఆత్మబలోన్నతుడు నగును.



# హిందూ ధర్మము

## అష్టమాశ్వాసము

~~~

## కొన్ని ముఖ్య విశేషములు

### పూర్వజన్మము :

హిందూమతములో పూర్వజన్మమును విశ్వసించు ఆచారమున్నది. మానవుడు క్రిమి కీటకాది పశు పక్ష్యాది జన్మలెత్తి తుదకు మానవ జన్మను ధరించునని జెప్పుదురు. భగవద్గీతాది గ్రంథములలో, పుట్టినవాడు తప్పక చచ్చుననియు, చచ్చినవాడు తప్పక పుట్టుననియు, ఆత్మకు నాశములేదు. శరీరమునకు నాశము—మార్పు లుండునని తెలుపబడి యున్నది.

ఒక జీవుడు సమస్త యోనులలో పుట్టుచు గిట్టుచు తుదకు తదనుగుణ్యముగా కర్మ శరీరముతో తల్లి గర్భమున తండ్రి వీర్య రూపమున ప్రవేశించుననియు, తదాదిగా దేహి దేహమునకు షడ్భావ వికారములు గల్గునని యు చెప్పుదురు.

షడ్భావ వికారములనగా ?

1. ఆస్తే 2. జాయతే 3 వర్ధతే 4. పరిణమతే 5. అపక్షీయతే 6. వినశ్యతే–అను ఆరు దశలు గల్గుటలని నిర్వచింతురు. వీటినిట్లు దెల్పుదురు.

ఆస్తే యనగా? తల్లి గర్భములో ప్రవేశించి స్థితుడౌట,

జాయతే యనగా? జనని గర్భమునుండి బయటపడుట లేక జననమొందుట.

వర్ధతేయనగా? జన్మించినది మొదలుకొని దినదిన ప్రవర్ధమానముగా పెరుగుట.

పరిణమతే యనగా? బాల్యదశనుదాటి యౌవనదశలో ప్రవేశించి సర్వాంగ శోభితుడుగా పరిణామమంది యువకుడౌట,
~~~

అపక్షీయతే యనగా? అంగమున చర్మము ముడుతలుబడి వెంట్రుకలు తెల్లబడి పండ్లాది కండ్లకు చత్వారములు వచ్చి కృశించి క్షీణించి పోవుట.

వినశ్యతే యనగా? అవయవములు స్వాధీనము తప్పిన పిదప మృతుడౌట.

ఈ షడ్భావ వికారములు శరీరమునకేగాని ఆత్మకుకేవను వాస్తవమును భగవద్గీత చక్కగా సిద్ధాంతీకరించుచున్నది.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేஉర్థే
న త్వం శోచితు మర్హసి.

—భగవద్గీత

ఓ అర్జునా! పుట్టినవాడు తప్పక చావవలసిందే. చచ్చినవాడు తిరిగి పుట్టవలసిందే. దానినుండి తప్పించుకొనుట కెవ్వరికి శక్యముకాదు. అందు వలన మృత్యువునుగూర్చి ఆలోచించుటకు నీవు అర్హుడవుకావు. కావున నీ కర్త వ్యము నీవు నెరవేర్చుచుండుము. అని అర్జునునకు శ్రీకృష్ణపరమాత్ముడు బోధించెను.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోஉపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవానిదేహీ.

—భగవద్గీత

తా॥ నరుడు పాతబట్టలను వదలి క్రొత్తబట్టలను ధరించునట్లు యీజీర్ణ శరీరమును వదిలి, మరొక శరీరమును యీ దేహస్థుడగు ఆత్మ (దేహి) పొందు చుండును. (ఆత్మ స్థిరుడు అవ్యయుడు—నాశములేని వాడని యర్థము)

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో
న శోషయతి మారుతః

తా॥ ఈ ఆత్మ ఆయుధములచేత నరుకబడదు. అగ్నిచేత కాల్చ బడదు. నీళ్ళచేత తడిసిపోదు. వాయువుచేత (వేడిచేత) యెండింపబడదు. (దీనికి నాశములేదు. ఎట్టి పదార్థముచేతనైననుగాని ఆత్మ సంహరింపబడదని యర్థము.)

ఇట్టి తాత్త్విక విషయ నిరూపణమువలన దెలియుచున్న విషయమేమంటేః ఈ మతములో ఆత్మకు చావులేదనియు, దేహమునకు చావు పుట్టుకలు గలవను వాదము ధృవీకరింపబడుచున్నది. ఆత్మ శాశ్వతుడైనపుడు పునర్జన్మ యనునది యనివార్యమని నమ్మవలసి వచ్చును.

కొన్ని యితర మతములవారు పునర్జన్మ సిద్ధాంతమును బొత్తిగా విశ్వ సించకుందురు, ఈ జన్మలోనే సమస్తము ననుభవించుచుందురనియు మరణా నంతరము దేహస్థుడగు ఆత్మ దేహమునే యంటిపెట్టుకొనియుండి ప్రళయవేళ ఒకరోజుననే ప్రాణులందరికి తీర్పుజెప్పబడునని తెలుపుదురు. సృష్ట్యాదినుండి జనించి మరణించినవారలందరికీ ఒకే ఒకరోజున తీర్పు జెప్పుదురట. ఇది కడు దురూహ్యమైన విషయము. వీరు దెలుపుదానిలో నిజమున్నదో లేదో కాని, హిందువులు దెలుపు పునర్జన్మ యుదంతములు, ఈ యిరువదియవ శతాబ్దములో చాలావరకు మన దేశములోనే గాకుండా, యితర దేశములయందును బయల్పడిన సందర్భము లెన్నియో గలవు. వాటిలో కొన్నిటి నిచట వాదనాసౌలభ్యము కొరకు నుదహరించటమైనది.

(కొన్ని వార్తాపత్రికల ఆధారము)

"మే 15 తారీకు 1965లో వచ్చిన ఒక వార్తా వివరాలు యిలా ఉన్నవి. స్వామీ ప్రకాశానంద్ అనే సాధువు తన 12 దవ యేటనే సన్న్యాసమును పుచ్చు కొన్నాడు. తనకు 21టవ యేడు నిండడముతోనే పూర్వ జన్మ వివరాలు జ్ఞాపకము వచ్చి, అప్పటి తల్లిని, చెల్లిని కలుసు కొన్నాడు. పాటియాలా లోని

బె[రా[గ్రామంలో వారు నివసించేవారు. ముప్పై యేండ్ల క్రింద చనిపోయిన గణేశ్‌దాస్ యను తనకొడుకు యితడేనని తల్లియును, నా సోదరు డితడేనని చెల్లెలును నమ్ముతున్నారు. అప్పటి సంగతుల నెన్నింటినో జెప్పి యెన్నియో వస్తువులను గుర్తించి, ఆసాధువు వారి కానమ్మకము గల్గించి నాడట. ఆసాధువు యీ వివరాలను బట్టి చనిపోయిన తొమ్మిది సంవత్సరాలకు తిర్గి పుట్టినా డన్న మాట. ఈ విధంగా పూర్వ జన్మ సంగతులు జ్ఞాపకము వచ్చి చెప్పే సంగతులు అప్పుడప్పుడు వార్తలు వస్తూనే యుంటాయి.

ఈ మధ్య అమెరికాలో, నమ్మదగిన ఆధారాలతో ఋజువు జేయబడిన యిలాంటి పూర్వ జన్మ వివరాలు జెప్పిన వారిలో, ప్రపంచము మొత్తం మీద సుమారు మూడు వందల మందిని గురించిన అనేక వివరాలతో ఒక పుస్తకం అచ్చువేసినారట. దీనిని బట్టి మన భగవద్గీతలో చెప్పినట్లుగా శరీరానికే గాని ఆత్మకు చావులేదని అది పదే పదే పుడుతూ ఉంటుందని తిరిగి ఋజువౌతున్నది.

నార్మన్ అనే రచయిత యీ విషయాలను గురించి స్థూలంగా వ్రాయుచూ, చావు అనే దాన్ని తలచుకొని భయపడటం శుద్ధ అవివేకం, అనవసరం అన్నాడు. భయపడినా, భయపడక పోయినా అది వచ్చే సమయానికి రాక మానదు. కాబట్టి దాన్ని గురించి ఆలోచనతో మనస్సును పాడు జేసుకోవటం బుద్ధిలేనితనమని సూచిస్తూ, యింకా యిలా వ్రాసినాడు. ప్రపంచములో పుట్టిన ప్రతిదీ ఎప్పుడో ఒకప్పుడు చావక తప్పదు. ఇది తిరుగులేని సత్యం. ఒకవేళ ఆ చావే లేక ప్రతీవారు పుట్టిన తర్వాత అలాగే ఉండిపోతే కొంతకాలం అయే సరికి జీవితంపై ప్రతి వారికి చికాకు, అసంతృప్తి బయలు దేరుతుంది. ఏదో ఒక మంచి నాటకమును జూచుటకై మనము వెళ్లినా మనుకోండి, అది కొన్ని గంటలలో పూర్తిగాకుండా, రోజుల తరబడి అదే పనిగా ఆడితే, అది యెంత మంచిదైనా మనకు చికాకు గలిగించక మానదు. అలాగే యెంత మంచి జీవిత మైనా, మధ్య మధ్య ముగింపు లేకుంటే భరింపరాని భారమౌతుంది.

మరణమనేది రాక పూర్వము కొందరికి అవివేకం వలన భయం కలుగ వచ్చును. అనేక మంది డాక్టర్లు నర్సులు, అనేక చావులు వారి కనుల ముందే సంభవించుట చూచుచుందురుగాన, వారు జెప్పే దేమంటే: చావు అనునది చాలా

8)

ప్రశాంతమైనది. అది స్నేహితుని లాగే వచ్చి మృతుని తనలో లీనము జేసుకొంటుంది. అని వారు వివరించిన సందర్భాలెన్నియో యున్నవి.

ఈ విశాల ప్రపంచములో సృష్టికి మూలం యేమిటా? అనే దాన్ని ఒకోమతం, ఒకోరకంగా చెప్పినా ప్రపంచం మొత్తం మీద అంతులేని అత్యద్భుతమైన ఒక జ్ఞానశక్తి దీని వెనుక నుండి నడిపిస్తుందనేది కఠోర సత్యం. ఏమాత్రం ఊహతో మన మాలోచించినను, యిది కొంతవరకైనా మన కవగతము కాక మానదు. ఈ ప్రపంచ తత్వమును పూర్తిగా అర్ధం జేసుకొన్నవారు శరీరాని కంటే వేరైన ఆత్మ యొక్కటి కలదని వివరించిన సందర్భాలనేకములున్నవి. కాబట్టి చావనేది ఒక రకమైన జీవితమునుండి ఇంకో రకమైన జీవితానికి, ఒక రకమైన వాతావరణము నుండి మరో రకమైన వాతావరణమునకు జరిగే మార్పు అని మాత్రం మనము తెలుసుకో వలసి యున్నది. మరణం వచ్చేముందు, వారిలో అమిత ప్రకాశం, విన సొంపైన సంగీతం వినటం, అంతకు ముందు చనిపోయిన తనకు కావలసిన వారు స్పష్టంగా కనబడటం ఇలాంటివి వివరించిన వారెందరో యున్నారు. ఆత్మ మహత్తర భగవత్పదార్ధములో ఒక వస్తువు అగుటవలన దానికిమాత్రం నశింపులేదు. నిజానికి నేటి పరిశోధన శాస్త్రరీత్యా విశ్వంలో దేనికి నశింపులేదు. అవి వివిధ భాగాలుగా విడిపోయి నూతన పదార్థ పరిణామము జెందును. అంటే ఏలాంటి మూల పదార్థమునుండి ఆకారాలు తయారౌతాయో నశింపు వచ్చేసరికి, తిరిగి ప్రారంభ మూల పదార్థములుగా మారిపోయి మళ్ళీ కొత్త పరిస్థితులలో కొత్త ఆకారాలు తయారౌతవి.

పూర్వ జన్మ విషయాలు జెప్పినవారి సంగతులు, మూడువందల మందిని ప్రపంచం అన్ని ప్రాంతాలవారిని శాస్త్రోక్తంగా పరీక్షించి నిజం తేలిన వాటిని వర్జీనియా యూనివర్సిటీ, మానసిక శాస్త్ర అధిపతి డాక్టర్ ఆయాన్ స్టీవన్‌సన్ అన్ని వివరాలతో నొక గ్రంథం వ్రాసినాడట.

మానవులలో అనేకమంది తగిన కారణాలు లేకుండానే కొత్త ప్రాంతాలకు పోవాలని యూహించుకొందురు. కొందరు అలా అనుకొన్న ప్రాంతాలకు వెళ్ళగలిగితే అదే మొదటిసారి అయినప్పటికీ ఆ ప్రాంతాలువారికి పాత ప్రాంతాలుగానే కనబడును. బహుశః పూర్వ జన్మంలో ఆ ప్రాంతాలలో మసలటమే అందుకు కారణము కావచ్చు.

"ఎక్స్ప్రెస్ గ్రూప్ పేపరులో 10–11–65 నాడు యీ క్రిందివిధంగా ఒక వార్త ప్రకటింప బడినది. పునర్జన్మ మెత్తటం అనే నమ్మకం భారతీయ నమ్మకాలలో ఒక అపూర్వమైన సత్యం. ఈ శరీరాన్ని చాలించి మరొక జన్మ యెత్తినపుడు, పోయిన జన్మలోని విషయాలన్నీ మరవటం జరుగుతుంది. కొందరి విషయంలో యీ మరుపు రాదు. వారు మరొక జన్మ యెత్తి అంతకు ముందు జన్మలోని వివరాలు తెలిపి అందరికి ఆశ్చర్యాన్ని కలిగించే ఆలోచనకు దారితీస్తారు.

ఇటీవల యిలాంటి సంఘటన ఒకటి రాజకోట జిల్లాలో జరిగింది. బికనీరు అనుపట్టణం మన దేశపు రాజకోట జిల్లాలో నున్నది. అక్కడ ఐదు న్నర సంవత్సరాల బాలిక జూనాఘడ్ పట్టణంలో నుంటున్న దంపతులు, తన పూర్వ జన్మలో తలిదండ్రులని చెప్పి, ఆధారాలు జూపి, ప్రజలను ఆశ్చర్య పరచింది. రజూల్ అనే యీబాలిక ఒక రిటైర్ అయిన ప్రభుత్వోద్యోగి కూతురు. ఈమె గత జన్మలోని వివరాలన్నీ వరుసగా చెప్పటంతో తలిదండ్రుల మనసు కరిగి ఆమెను జునాఘడ్‌కు తీసుకువెళ్ళిరి. పూర్వ జన్మలో ఉన్న యింటి గుర్తులు, అప్పుడు భగవదార్చనకు వెళ్ళిన దేవాలయాల గుర్తులు జెప్పినది. అవన్ని ఒక వివరంగూడా, తప్పులేకుండా ముమ్మాటికి నిజంగా యుండటము వల్ల తలిదండ్రులు ఆశ్చర్యపోయారు. తన పూర్వజన్మలోని తలిదండ్రులను జూడగానే గుర్తించి వారు తన పూర్వజన్మ అమ్మా, నాన్న అని వారిని కౌగ లించుకొని పోయిన జన్మలో తనపేరు గీతయని రజూల్ చెప్పింది. ఇవన్ని నిజమేనని ఋజువైంది. అంతేగాక రజూల్ తన పూర్వపు తలిదండ్రులకు జునాఘడ్‌లో తాను సంచరించిన ప్రదేశాలకల్లా తీసుకెళ్ళి చూపించి, అప్పటి తన స్నేహితుల సంగతి, తన మేనత్తసంగతి అడిగింది. రజూల్‌ను మేనత్తగారి యింటికి తీసుకొని వెళ్ళగానే వెంటనే ఆమెను గుర్తించి అందరికి మరోసారి ఆశ్చర్యం కలిగించింది" (వార్తా సంకలనము)

ఈ విధముగా పూర్వజన్మ వృత్తాంతాలు బయటపడుతున్నవి. వీటివలన పునర్జన్మ కలదను హిందూమత వాదమునకు నమ్మకము లేర్పడుతున్నవి.

## కర్మ సిద్ధాంతము

గత జన్మలో జేసిన సత్కర్మలు (మంచి పనులు) దుష్కర్మలు (చెడ్డ పనులు) ప్రస్తుత జన్మలో వెంటాడి తమ ఫలితములను గలిగించునని హిందువుల

విశ్వాసమై యున్నది. హిందూమతములోగల కర్మ సిద్ధాంతమునుగూర్చి అనేక గ్రంథములు ప్రవచిస్తున్నవి

రామాయణములోగల ఒక ఉదాహరణము, కర్మ సిద్ధాంతమునుగూర్చి సీతాదేవి చెప్పిన తీరు అత్యంత మనోహరముగా నున్నది. రావణుడు చంపబడిన తర్వాత హనుమంతునితో అట్టి శుభవార్తను సీతకెఱిగించవలసిందిగా తెలుపుతూ, శ్రీరాముడు హనుమంతుని సీతకడకు పంపించగా, అతడామె వద్దకి వెళ్లి రావణ సంహారమును శ్రీరామ విజయోదంతమును తెలియజేయును అప్పుడు సీతాదేవి సంతోషమగ్నమానసయై 'ఆంజనేయా ! ఈ శుభవార్తను దెలియజేసినందుకు నీకేదైన నొక పారితోషికము నర్పించుట క్షత్రియ ధర్మము గావున నీవాంఛాసిద్ధికొరకేదైన నొకవరము గోరుమన, నతడు కొంత తడవాలోచించి శ్రీరామచంద్ర కృపాకలితుడనగు నాకు యేకొదువయు లేదనుచు, దేనినీ దేవితో నడుగగలనని యాలోచించి తుదకొక నిర్ణయమునకు రాగలిగెను. అదేమనః పదిమాసములనుండి మాతృశ్రీ సీతాదేవిని తర్జన, భర్జనలతో బాధించిన రాక్షస స్త్రీలను కలయ జూచి వీరింకను బ్రతికియుండుటలుజూడ, రావణుడు బ్రతికియున్నట్లేనని నిశ్చయించుకొని, 'అమ్మా ! తాము నాకు వరము ప్రసాదించే పక్షమున మీ కావలి రాక్షసాంగనల నందరిని హతమార్చుటకు అనుజ్ఞ దయజేయు'డనుచు, అదియే నాకు వాంఛాసిద్ధితమగు వర ప్రసాదమనియు ప్రాధేయపడినాడట. అందులకు సీతాదేవి స్మితవదనయై హనుమంతుని వారించుచు, 'నాయనా ! వీరు రావణుని సేవికలు. స్వామియాజ్ఞను తలదాల్చుట సేవకుల ధర్మము. ఇప్పుడు రావణునితో వీరుగూడా, మరణించినట్లే లెక్క. కాబట్టి వారు నాకొనర్చినది స్వయంకృతాపరాధము కాదు. ప్రభువాజ్ఞ పరిపాలనము అంతేగాక నా కర్మఫలముతో రాక్షస బాధలు పడవలసిన అగత్యమున్నప్పుడు అది తప్పునా ?' యని యిట్లనిదనదట.

శ్లో ॥ సుఖస్య దుఃఖస్య న కోపి దాతా
పరో దదాతీతి కుబుద్ధిరేవ
అహం కరోమీతి వృధాభిమానః
స్వకర్మసూత్రగ్రథితో హి లోకః ॥

తా ॥ సుఖపెట్టువాడును, దుఃఖము గొల్పువాడును యెవ్వడును లేడు, సుఖదుఃఖదాత లెవరులేరు. నావల్లనే నాకు సుఖము. నావల్లనే నాకు

దుఃఖము గల్గినదనునది వృధాభిమానము దప్ప మరేమియు కాదు. అట్లు కుమతులు తలంతురు. మానవులందరు తమ కర్మ సూత్రబంధితులైన కీలుబొమ్మలని అర్థము.

మహాభారత గ్రంథమున అరణ్యపర్వములో ధర్మవ్యాధుడు కర్మ సిద్ధాంతమును విశదపరచుచు యిట్లనియెను.

సీ ॥ నీతిమంతులు ధర్మనిరతులు దక్షులు
  నగుకాచు జేయు కార్యములు కొన్ని
సిద్ధిబొందవు దుష్ట చిత్తులు క్రూరులై
  చేయు కొన్ని విశేష సిద్ధిబొందు
నూరకయుండంగ నొందు కొందర విపు
  లార్థములోక్కొంద రాయాసపడియు
నిష్ఫలారంభులై నిలుతురు కొందరు
  పేదవారికి ప్రజ పెల్లు బొడము

తే ॥ నర్థవంతులు కొందర కర్థి నధిక
దానములు ధర్మములు సువ్రతములుసేయ
ప్రజలు బుట్టరు వినుమట్టి భంగిసుమ్ము
కర్మఫల మాత్మతంత్రింబు గాకయుండు.

తా ॥ నీతివంతులైన సజ్జనులు కడుదక్షతతో శ్రద్ధగా నిర్వహించిన పనులు కొన్ని సమయములయందు సిద్ధిబొందక దుర్మార్గులు, క్రూరులు జేయు పనులు ఫలవంతములై సిద్ధిబొందుటలు మనము జూచుచున్నాము. కొందరకు ఊరక యున్నచోటికే విపులార్థములు (గొప్పసంపదలు) వచ్చి చేరును. మరి కొందరకు సమస్త కష్టముల నోర్చినను, పెద్దగా ఆయాస పడినను ఆరంభములోనే నిష్ఫలతను యెదుర్కొన వలసి వచ్చును. గుడిసెలలో నివసించు పేద జనములకు, అధిక సంతానోత్పత్తి గలుగును. ధనధాన్యములు గల్గినవారికి దాన ధర్మ వ్రతములు జేసినను పుత్ర సంతానము గలుగదు. ఇదియంతయు పురాకృతకర్మ ఫలము.

అ ॥ కర్మవశతజూవె గలుగు దేహము దేహ
వర్తనంబు కర్మ వశత బుట్టు
దేహపాతమైన దేహస్థు డగు జీవు
డరుగు కర్మ విహితమైన యెడకు

తా ॥ కర్మవశముననే దేహము కల్గుచున్నది. దేహవర్తనముగూడను కర్మ వశతనే సంప్రాప్తమగుచున్నది. దేహనాశనము జరిగినచో దేహస్థుడగు జీవుడు కర్మ విహితమైన మరొకచోటికి వెళ్లుచున్నాడు.

అని ధర్మవ్యాధుడు సెలవిచ్చియున్నాడు. ఈ కర్మ సిద్ధాంతమే అదృష్ట-దురదృష్టములను గనబర్చుచున్నదని హిందూమతవాదులు విశ్వాసము గల్గింతురు.

ఒక విధముగా యీ నియామకము నిజమను నమ్మకము గల్గుచున్నప్పటికి సదాచరణ, భగవద్భక్తితో కర్మఫలమును మార్చివేయవచ్చునని రెండవ పక్ష వాదముగూడా యీ ధర్మము సూచించుచున్నది. ఏది యెటులున్నను హిందూ సమాజము కర్మ సిద్ధాంతము నతిగా విశ్వసించునని తెలియుచున్నది.

## శ్రుతిధర్మము-స్మృతిధర్మము

శ్రుతులనగా వేదములును వాటి జన్యములైన ఉపనిషదాది గ్రంథము లనియు తెలియదగినదై యున్నది. శ్రుతి ధర్మములనగా వేదములు నిర్దేశించిన ధర్మములు. ఈ శ్రుతి ధర్మములలో వర్ణాశ్రమాచారముల పట్టింపులు లేవు. వీటిలో తపస్స్వాధ్యాయసత్కర్మలు యజ్ఞయాగాదులు సూచింపబడి యున్నవి. విగ్రహారాధన మరియు కులమతముల పరిపాటిని వీటిలో కనుపరపబడి యుండ లేదు. మానవ వికాసము జ్ఞానవైరాగ్య భగవద్విషయక ఉపాసనా పద్ధతులు వేదవేదాంగములలో స్పష్టపరుపబడి యున్నవి. భగవంతుడు సర్వవ్యాపకుడు సర్వాంతర్యామియను సత్యమును వేదములు ప్రకటించినవి. అంతేగాక సర్వ మానవ సమైక్యతను వేదముల జన్యములగు ఉపనిషదాదులు యిట్లు అభి వర్ణించినవి.

## పూర్వశాంతి పాఠమంత్రము

ఓమ్ సహనావవతు, సహ నౌ భునక్తు,
సహ 'వీర్యం కరవావహై, తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై - ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
[ఈ మూల మంత్రమును పలువురు పలురీతులు నిర్వచనము జెప్పి నప్పటికి దీనిలోగల మౌలిక రహస్య మేమన]

భగవంతుడగు పరబ్రహ్మము మనలనందరను రక్షించునుగాక, మన మెల్లరము కలసి భుజింతుముగాక, లేక పరిపాలింపబడుదుముగాక, మన మందరము కలిసి మెలసి సామర్థ్యముతో విక్రమింతుముగాక, తేజోవంతమైన అధ్యయనమును మన మందరము కలసి పొందుదుముగాక, (సమస్త విద్యలు విజ్ఞానములు మన మందరము సంపాదింతుముగాక.) మన మెవ్వరిని ద్వేషించ కుందుముగాక—భూత, భవిష్య, వర్తమాన కాలములకు శుభము, సుఖము శాంతులు లభించునుగాక, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను త్రివిధ తాపములును—దైహిక, భగవద్విషయిక, ప్రాపంచిక కష్టములు తొలగునుగాక యనునది శ్రుతిధర్మమని తెలియదగి యున్నది.

రానురాను ఈ శ్రుతి ధర్మములను వెనుకకు నెట్టి కొందరు స్వప్రయో జకులు తమ స్వార్థసిద్ధికి అధికార ప్రాబల్య విస్తరణకు వేదములనుండి యుత్పన్నమైన ధర్మమని తెలియజేయుచు స్మృతులను వ్రాసి స్మృతి ధర్మ మును సంస్థాపించ గలిగిరి. ఈ స్మృతిధర్మ నిర్ణేతల దూరదృష్టి రహితమైన చర్యలవలన పవిత్రమైన హిందూ ధర్మము అప్రతిష్ఠపాలై పోయినది. విగ్రహా రాధనము వీరిమూలమున కొందరకే అంకితమై యీ శ్రుతిధర్మ జన్యములైన దేవాలయాలలోకి హీన కులజులు రాగూడదని నిషేధములు గల్గించిరి. అంటు ముట్టు హెచ్చు తగ్గులు కల్పించి సమాజములో అస్పృశ్యతను సృష్టించిరి. ఇందుమూలముననే హిందూమతములో రెండు వందల మత శాఖలును, మూడు వేల పై చిల్లర కులశాఖ లుదయించ గలిగెను. ఈ కులమత వర్గ చీలికలవలన బలహీనపడిన హిందూ మత సమాజ ప్రభుత్వములు వలస దేశముల అన్యమత వాదుల దొరతనమునకు దాసోహ మనవలసి వచ్చెను. అన్యులు భారత దేశ మును అవలీలగా జయించిరి, బయటివారు సర్వ సంపత్ సమృద్ధమైన, సస్య

శ్యామాఢ్యయైన భారత జననికి దాస్య శృంఖలములు దగిలించి సర్వాధికారమును వశపర్చుకోగలిగిరి.

కావున మానవ కార్పణ్య గుణ భూయిష్టములైన స్మృతి ధర్మములను విడనాడి మన పూర్వజులగు శుక, నారద, వశిష్ఠ, పరాశర, వ్యాస మహా ఋషులచే ప్రవచింపబడిన వేద విహిత ఉపనిషద్ ధర్మములను పునరుద్ధరించి హిందూ మతములో ఆమూలాగ్రము వేళ్ళు దన్నుకొనిపోయిన అసమానతను రూపుమాపి యీ పవిత్ర ధర్మమును, పునః ప్రతిష్ఠ జేసికొనవలసి యున్నది.

ఒక అస్పృశ్యతను మినహాయిస్తే యింతటి యుత్కృష్టమైన మతము మరొకటి లేదని త్రికరణ శుద్ధిగా ఒప్పుకొనదగినదై యున్నది. ఈ దేశములో అంటరానితనము పేరిట తరుమబడిన వారందరు, ఇతర మతముల నాశ్రయించి హిందూ మతమును బలహీన పరచిరి. ఈ దేశ అనైక్యతకు కారణము, వర్ణాశ్రమాచారములు మరియు అంటరానితనమని వేరే వివరించవలసిన యవసరము లేదు.

కాబట్టి యీ యంటరానితనము నిమ్నోన్నతములు నిర్మూలింపబడిననాడే సమాజములో సంపూర్ణ సమైక్యత వర్ధిల్లునను సత్యమును ప్రతి హిందువుడు బాధ్యతతో గుర్తించి త్రికరణశుద్ధిగా దీనిని నిర్మూలించుటకు శపథము గైకొన వలసి యున్నది.

---

# హిందూ ధర్మము

## నవమాశ్వాసము

~~~

### హిందూ ధర్మములో అష్టవిధ వివాహములు

శ్లో॥ బ్రాహ్మో దైవ స్తథైవార్ష ప్రాజాపత్య స్తథాఽసురః,
గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః ॥

మనుస్మృతి-౩-౨౧

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, అసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచికము.

వధూవరులు ఉభయులు బ్రహ్మచర్యమును పాటిస్తూ విద్యా విజ్ఞాన వంతులై సుశీలులును ధార్మిక ప్రవృత్తిగలవారై పరస్పరాంగీకారముచేత వివాహము జేసుకొనుట బ్రాహ్మ వివాహము అని యందురు,

యజ్ఞయాగాది కర్మలు ఋత్విక్కర్మలు జేయుట జేయించుటయందు ఆసక్తిగల్గిన యల్లునికి అలంకారయుక్తముగా కన్యక నిచ్చి పెండ్లి జేయుటలు దైవ వివాహ మనబడును.

వరునినుండి పారితోషికము ఋచ్చుకొని లేదా ప్రతిఫలము ఋచ్చుకొని కన్యనిచ్చి పెండ్లిజేయుట ఆర్షవివాహ మనబడును.

ధర్మమును వృద్ధిచేయుటకు, న్యాయ సమ్మతముగా జీవితము గడుపుటకు సప్రమాణపూర్వకముగా ఉభయులు వివాహమాడుట ప్రాజాపత్యము అని యందురు.
~~~

కన్యకవైపువాళ్ళు వరునికి కొంత ధనమిచ్చి పెండ్లి జేసుకొనుట ఆసుర వివాహ మనుబడును.

సమయ నియమ ప్రతిబంధకములు లేక కన్యావరులు ఉభయులు గలిసి ఇచ్ఛాపూర్వకముగా పరస్పరము పూలమాలికలు పూర్చుకొని ఏకమగుట గాంధర్వ వివాహ మనబడును,

మోసమునగాని, యుద్ధములుజేసి-జగడములాడి బలాత్కారముగా కన్యక పక్షమువారిని దండించి కన్యకను ఎత్తుకొనిపోయి పెండ్లి జేసుకొనుట రాక్షస వివాహ మనంబడును.

మద్యపానమున మైమరచి నిద్రించిన కన్యకను లేదా పట్టితెచ్చి త్రాగించి మైమరపించి, స్పృహలేకుండాజేసి బలాత్కార సంయోగముజేయుట పైశాచిక వివాహ మనబడును.

ఇంచుమించుగా అన్ని మతములయందు వివాహకర్మకు అత్యంత ప్రాధాన్యత కలదు. హిందూమతములో వివాహ కర్మకు-పెండ్లి కార్యమునకు మరింత ఎక్కువ ప్రాధాన్యత యుండి యున్నది.

హిందువులు వివాహమును పవిత్రబంధముగా భావింతురు. వివాహమున సూర్యచంద్రాదిగ్రహములను అరుంధతి యిత్యాది పతివ్రతలను ముందిడుకొని ప్రమాణములు జేయుటేగాక జాతవేదసుని (అగ్నిదేవుని) సాక్షిగా బ్రహ్మముడి, మంగళసూత్రము ముడి, మనసుముడియను మూడు ముడులు వేయుదురు. కొందరు "సప్తపది" యని మరికొందరు ఆశీర్వాదము మంగళాచరణములని ప్రదక్షిణలని జేయుదురు. ఈ వివాహకర్మమును పురుషుడు బ్రహ్మచర్యమును పాటించువాడును-స్త్రీ పాతివ్రత్యమును పాటించునదియునై యుండుటకు శపథములు జేయుదురు. బ్రహ్మచర్యము అనగా ఒకే స్త్రీతో (కట్టుకొన్న భార్యతో)నే కాపురము జేయుటలని ఒక అర్థము.

హిందువుల వివాహములలో "విడాకులు" తొందరగా అంగీకరించబడవు. భార్య భర్తను భర్త భార్యను విడిచిపెట్టుటలు మహాపాతకమని తలంతురు. భార్య భర్తను తనపాలిటి దేవుడుగా భావించి అతడు తనకు ప్రత్యక్ష దైవమని పూజించును. అందుకే రామాయణాది గ్రంథములలో పతియే ప్రత్యక్ష దైవమని

సీత ఇత్యాది ప్రతివ్రతలు తమ భర్తలను పూజించి ఆరాధించిరి. పతివ్రతలలో అనసూయ, అరుంధతి, సావిత్రి, చంద్రమతి, సీత మొదలగు నారీమణులు గణనీయ చరిత్రను సంతరించుకొన్న వారిలో ముఖ్యులు. "విడాకులు" ఒకానొక సందర్భములో స్మృతులలో అనుమతించినప్పటికీ పతివ్రతలు తమ భర్తలను విడాకులిచ్చి వదిలిపోవుటలు ఎంతమాత్రము అంగీకరించలేదు. ఉదాహరణకు మనుస్మృతిలో యిలా వ్రాయబడియున్నది.

శ్లో ॥ నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥

మగవాడు దివాలాదీసి నష్టపోయినయెడల, చచ్చిపోయినయెడల, సన్యాసముపుచ్చుకొని వెడలిపోయినయెడల, నపుంసకుడై స్త్రీల సుఖదాయక చర్యకు యోగ్యతగోల్పోయిన యెడల మరియు పతితుడై కుకర్మలకు పాల్పడుతూ, సప్తవ్యసనములకు లోనైన ఎడల ఇట్టివానిని భార్యలు వదిలిపెట్టి యితర పురుషులను చేకొని సంసారములు వెలయించవచ్చును. అందుకు వారికి ఎట్టి దోషము సంభవించదు అని స్మృతికారుని అభిప్రాయము. స్మృతిధర్మనిర్ణేతలు స్పష్టముగా స్త్రీల వ్యవహార ధర్మమును నిర్దేశించి తెలిపినప్పటికీ ఉత్తమ పతివ్రతలు తమ మగలను వదలిపెట్టలేదు. పై శ్లోకమును రచించిన స్మృతికారుని భావము యెట్లున్నప్పటికీ, అట్టి ఐదు విధముల ఆపదలందు ''పంచస్వాపత్సు"ల యందు పతివ్రతా శిరోమణులు ఆట్టి ఆపదలను ఎదిరించి నిలిచి తమ భర్తలను కాపాడుకొని స్తవనీయ చరిత్రలయి ఆచంద్రతారార్కము చిరస్థాయిగా తమ పేరు నిలబెట్టుకొన్నారు.

నష్టపడి రాజ్యభ్రష్టుడై కాటికాపరియైన హరిశ్చంద్ర భూమిపాలుని చంద్రమతి వదలిపెట్టలేదు-అతనికి విడాకులివ్వలేదు సరిగదా అతడు విపణివీధిలో బెట్టి విక్రయిస్తే అమ్ముడుపోయి తన భర్త అనుమతికి తల యొగ్గింది.

చచ్చిపోయిన సత్యవంతుని ప్రాణాలను తిరిగి సంపాదించి అతనిని పునర్జీవితుని జేయుకొరకు సావిత్రీదేవి నరకలోక ముఖద్వారమువరకు వైవస్వతుని వెంటాడి తన భర్త ప్రాణములను తిరిగి తెచ్చుకొని అతనికి శతాయుర్దాయము లభ్యమగుటకు యమునితో వరములు బొంది అనన్యసామాన్యమైన కీర్తిని గడించుకొన్నది.

రాజ్యభ్రష్టుడై జూదంలో ఓడిపోయి రాజ్యసన్యాసము స్వీకరించి ద్వైత వనములో సన్యాసులనడుమ పన్నెండు సంవత్సరములు వల్కలాజినములు ధరించి ఫల పర్ణ భక్తుయై జీవయాత్ర గడిపిన ధర్మరాజును ద్రౌపది విడిచిపెట్ట లేదు. ఆమె గణనీయమైన భక్తి తాత్పర్యములు ప్రదర్శించి కీర్తిని గడించు కొన్నది.

బృహన్నల పేరుతో నపుంసకుడుగా రూపొంది ఒక సంవత్సరము విరాట రాజుకూతురుకు నాట్యాచార్యుడుగా ఉద్యోగములో కుదిరి తలదాచుకొని అజ్ఞాతవీరుడుగ నున్న అర్జునుని సుభద్రాదేవి వదిలిపెట్టి మారు పెండ్లికి పూను కొనక అచంచల పాతివ్రత్యదీక్షను ప్రకటించి కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకొన్నది.

కౌశికుడను బ్రాహ్మణోత్తముడు పతితుడై సప్తవ్యసనములకు బద్ధుడై వేశ్యాలోలతవల్ల సంపత్తి క్షీణించిపోగా దరిద్రుడై భిక్షాటనచే జీవించుచు, తుదకు కుష్ఠురోగిగా బాధపడుతూ, తనభార్య సుమతిని పిలిచి తనను పూర్వపు ప్రియు రాలి యింటికి ఒకసారి తీసుకొని పొమ్మని ఆదేశింప, ఆ పతివ్రత అతని మాటకు అడ్డుజెప్పక ఒక గంపలో అతని గూర్చోబెట్టుకొని తలపై యెత్తుకుని వేశ్యగల ఊరికి పయనము సాగించినదట! ఆవిడ మార్గమధ్యమున ప్రయాణించుచుండ ప్రమాదవశాత్తు ఈ కుష్ఠురోగియగు కౌశికుని తల ఒక తపస్వికి, తలక్రిందుల వ్రేళ్ళాడుతూ తపస్సు జేయువానికి తగిలి తపోభంగమైనదట. అప్పుడు ఆ తపస్వి కడునొచ్చుకొని ఓరీ! నీచ కుష్ఠురోగీ! సూర్యోదయముతో నీ తల వేయి వ్రక్కలై మృతిజెందుదువుగాక యని శపింప ఆ పతివ్రత "సుమతి" సూర్యో దయాన్ని తన పాతివ్రత్య మహిమచే నిరోధించి దేవతల మన్ననలకు పాత్రు రాలై తన భర్తకు ఆయురారోగ్యములు ఐశ్వర్యము ఆముష్మిక సుఖములను బడయగలిగినదట.—ఇట్టి పరిస్థితులలో పతివ్రతలు విజయాభివర్ధినులై వెలయ గలిగిన గాథలు, ధర్మబోధనలు హిందూ స్త్రీ సమాజము ప్రగాఢంగా విశ్వ సిస్తుంది. అందుకే హిందూ సమాజస్త్రీలు మహాసుగుణగణన చరిత్రలు అని అన్ని వర్గములవారు ఒప్పుకొందురు.

———

# హిందూ ధర్మము

## దశమాశ్వాసము



## మానవ ధర్మసూత్రములు

ఇక మానవధర్మ మార్గమును సూచించు సూత్రములు స్వప్తవ్యసనములను బాహాటముగా నిరసించును. స్వప్తవ్యసనములనగా ఏడు విధముల దురలవాటులు. వీటిని మహాభారత గ్రంథములో విదురనీతియందు విపులముగా తెలియజేయబడింది.

తే॥ వెలది జూదంబు పానంబు వేట పలుకు
ప్రల్లదంబును దండంబు పరుసదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత
యనెడు సప్తవ్యసనముల జనదు తగుల

-మహాభారతము-ఉద్యోగపర్వము

1. వెలది (డబ్బుకు వచ్చే ఆడది) వేశ్య, 2. జూదము, 3. పానము (త్రాగుడు అలవాటు) 4. కఠినముగా మాటలాడుట, 5. దండము (ప్రతిచిన్న విషయమును శిక్షించుట) 6. పరుసదనము (మొండి పట్టుదల లేక పంతము) 7. సొమ్ము నిష్ప్రయోజనపరచుట (దుర్వ్యయము).

వీటినే సప్త వ్యసనములని యందురు. ఇవియున్న మనుజుడు అధోగతి పాలగును. వీటిలో ఏ ఒక్కటియున్నను ప్రమాదకరముగా బుజువైందని పెద్దలు తెలియజేయుదురు. వేశ్యా సంగమమువలన సమాజములో అనేకులు ధన ప్రాణ మాన నష్టములకు గురియై నశింతురు. త్రాగుడు దురలవాటు శరీర

